# విమర్శక వ్యాసావళి

(ESSAYS IN LITERARY CRITICISM)

*

శ్రీ పారనంది జగన్నాథస్వామి, ఎం. ఏ., ఎల్. టి.
రిటైర్డు ప్రిన్సిపాల్, పర్లాకిమిడిరాజావారి కళాశాల



యం. శేషాచలం అండ్. కంపెని
మచిలీపట్టణము

రు 1-8-0

# విషయసూచిక

ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు
'భాషాశాస్త్రచతురానన' 'విద్వాన్'
శ్రీ గంటి జోగిసోమయాజి M. A., L T., గారు వ్రాసిన

# మున్నుడి

శ్రీయుతులు పారనంది జగన్నాథస్వామిపంతులు గారు తా మప్పుడప్పుడు వ్రాసి వెలువరించిన యీ వ్యాసములు, విమర్శనలు మొదలయినవి సంపుటముగా ప్రచురించుచు, నిద్దాని కొకమున్నుడి వ్రాయవలసినదని నన్ను కోరియున్నారు. నా పయి వారికి చిరకాలము నుండియును గల ప్రేమ, ఆదరము అనుభావములు దీనికి కారణ మని యెఱుగుదును.

విద్యారంగమునను వాఙ్మయప్రాంగణమునను చిరకాలము సేవ చేసిన యీయనను గాని, యింతకు మున్ను ప్రచురణనందిన వీనిని గూర్చి గాని క్రొత్తగా పరిచయము చేయవలసిన యవసరములేదు. వ్యాసములను వ్యాసకర్తను చిరకాలమునుండియు నెఱింగినవాడ నగుటను, విమర్శకు డన్న నెట్టివాడుగ నుండవలయునో యను విషయమునుగూర్చి నిరంతర ముపన్యసింపవలసినవాడ నగుటను కొన్ని విషయములను వ్రాయుటకు పూనుకొనియున్నాను.

విమర్శకునకు ముఖ్యముగా వలసినవి పాండిత్యము, పక్షపాతము లేమి, సానుభూతి, సత్యమును జెప్పుటయందలి యిష్టము, సునిశితమయిన బుద్ధి మొదలగునవి. అట్టివి లేనివారి విమర్శనలు పరిపూర్ణముగా గుణదోషములను నిరూపించి పాఠకునకు సాయపడజాలవు. కాలప్రవాహము ముందునకు నెట్టుకొని పోవుచుండ మానవుడు, భావిపయినే దృష్టి నిలుపును గాని భూతమును దిలకింపడు. అట్లు తిలకించిచేసిన విమర్శనలు, సమన్వయములు పురోభివృద్ధిహేతువులు గావలయునే గాని మఱియొక రీతి నుండరాదు. లోకవృత్తమున విమర్శనల కన్నిటికిని నిట్టిదే ఫల మన

వలసియుండ కావ్యవిమర్శనకును ఫల మిట్టిదని వేఱ చెప్పనక్కఱ లేదు. కావున సహృదయులు, పండితులు, అధికారులు, ప్రతిభాసహాకృత మైన యభ్యాసము గల విమర్శకులు గుణదోషములను విమర్శించి వివరించుట రచయితలకు మార్గదర్శకులుగ నుండుటకొఱకే యని చెప్పనక్కఱ లేదు గదా !

శ్రీ జగన్నాథస్వామిగారు పండిత సంప్రదాయము లోనివారు. శాస్త్రపరిచయము వీరికి చక్కనిది కలదు. ఆంగ్లవాఙ్మయమునను, వేదాంతశాస్త్రమునను పట్టభద్రులు. ఆంధ్రము, సంస్కృతము, పండితులైన తండ్రిగారు శ్రీ పారనందిరామశాస్త్రిగారినుండి యభ్యసించినవారు. ఉన్నతకళాశాలకు ప్రధానులుగా చాలకాలము పనిచేసి, పండితులైన సోదరోపన్యాసకులతో ననేకములయిన విచారణములు, సంవాదములు చేసి నిష్ణాతులైనవారు. విమర్శకునకు అధమము రెండు వాఙ్మయముల పరిచయమైనను గలిగియుండ వలయుననియు, నా వాఙ్మయములు స్వభావమున నెంతదూరస్థములయిన నంతసామర్థ్యము నా విమర్శకునకు గలిగించుననియు, విమర్శనవేత్తల సిద్ధాంతము. సంస్కృతాంధ్రములు రెండు నెఱుంగుట యవసరమే. కాని యా వాఙ్మయములకు సన్నిహితత్వము చాలచోట్ల బింబప్రతిబింబముల వంటిది. ఆంగ్ల మట్టిదిగాదు. ఆంగ్ల వాఙ్మయము నందలి ప్రక్రియలు, విచారణలు, కవుల మార్గములు ప్రాచీనమార్గము కంటె మిక్కిలి విలక్షణము లైనవానివలె గనుపట్టుచుండును. కావున వానిని సాకల్యమున నెఱుగుట శ్రీ జగన్నాథ స్వామిగారికి గొప్పబలము.

వీరు మిత్రుల కావ్యములను విమర్శించునపుడుగూడ గుణదోషములు రెండింటిని చెప్పకతప్ప దను నియమము నెల్లయెడలను పాటించిరి. వీరు విమర్శించిన కృతులు చాలవఱకును మిత్రుల కావ్యములు. తటస్థులయినను వారిగ్రంథములలోని గుణములను, దోషములను గూడ తప్పక చెప్పియున్నారు. ఇంకొకగొప్పవిషయ మేమనగా తాము పొరపడి నప్పు డట్లు పొరపడితిమని బహిరంగముగా నొప్పుకొనుటకు వీరికి సందే

హాములే దని యీ విమర్శనలవలనఁ దెలియుచున్నది. "ఆచార్యాః కృత్వా న నివర్తంతే" యను వాక్య మీయాచార్యుల యెడ జెల్లదు. తాము విమర్శించు కృతియందును, కృతికర్తయెడను వీరికి ఆదరమును సానుభూతియు గల వనుటయు నీ విమర్శనలను బట్టి స్పష్టము. రాగద్వేషములతో జేయు విమర్శనలు, ఫలాపేక్షనుబట్టి చేయు విచారణలు, మిత్రామిత్రుల కుపకారాపకారముల నుద్దేశించిచేయు వాఙ్మయవివాదములు, లోకోపకారకములు గావని మన మనేకవిమర్శనలవలన నెఱుంగుదుము. అట్టి విదుర్విమర్శనలు. గోరా, ఇంటా బయటా, భీష్మప్రతిజ్ఞ, సుమబాల అను కృతుల విమర్శనలలో, విమర్శకుడు, రాగద్వేషముల పొంత బోక, సత్యదిదృక్షతో, గుణదోషవిచారము చేసెనని స్పష్టముగా గనుపట్టకపోదు.

ఈ విమర్శలను విద్యార్థులును, గ్రంథవిమర్శనముచేసి, యందు మెప్పునొంద దలచినవారును తప్పక చదువవలసినవి.

విశాఖపట్టనము, 22-12-53. | విద్వాన్ సోమయాజి.



# 1

శ్రీ శేషాచలం పంతులుగారు సాదరముగా ప్రకటించిన ఈ విమర్శకావళిలో ఒకటిమాత్రము ఇంతకు పూర్వము వెల్లడిఅయి ఉండలేదు. అది మాలపల్లి. గ్రంథముతో బాటు ఈ వ్యాసం కూడా దాగుకొంది. మిగిలినవి చాలావరకు భారతి వారి అనుగ్రహానికి పాత్రులైనవే. పద్మావతీ చరణచారణచక్రవర్తి మాత్రము ఇటీవల కృష్ణాపత్రికలో వెలువడింది. ఆయా పత్రికల సంపాదకులకు నా కృతజ్ఞతావందనాలు.

ఈ వ్యాసాలన్నీ విమర్శకాలు. ఆయా గ్రంథాలను సాదరముతో చదివితిని. ఆయా గ్రంథకర్తలను - ఒక్కరిని తప్ప - ప్రత్యక్షముగా ఎరిగియుండలేదు సరేగదా వారి జీవితాంశములను సహా సేకరించియుండలేదు. గ్రంథాన్ని చదివి, ఆనందించి విమర్శించడానికి గ్రంథకర్త పరిచయము అత్యావశ్యకమా అనే సందేహము కలదు. కవియొక్క హృదయము కృతిలో ఇమిడియుండును. ఆ హృదయము కవిజీవితచరిత్రకు సంబంధించినదే కానక్కరలేదు. తన అనుభవాన్నే పొందుపరచే కవికంటె లోకాన్ని చిత్రించేకవి ఉత్కృష్టుడని సర్వాంగీకారము. అప్పుడు వ్యక్తపడే మానవహృదయాన్ని సమన్వయించుకోవచ్చును. వాల్మీకాదిమహాకవుల జీవితాంశాలు ఊహ్యములేగాని సుస్పష్టచరిత్రాంశాలు కావు. వారి గ్రంథరాజములు ఉద్గ్రంథములేగాక సర్వకాలికములుకూడా. వారి గ్రంథానుగతములు మానవహృదయాన్ని విషయముగా గలవి. ఆ నమ్మకముతో ఈ సంపుటిలో వెలువడిన వ్యాసాలు వ్రాయబడినవి.

వ్యక్తులతో సంబంధముకలదికాదు విమర్శన. కవనాలను తర్కించేది విమర్శన. వారు ఎవరు, వారుఎట్టివారు, వారి ఆదర్శకాశయములు ఏవి, వారి స్వీయానుభవాంశాలు ఎట్టివి, - అనే విషయాపరీక్షచేయక, వారి గ్రంథకల్పనాచాతుర్యము ఎట్టిది, వారి కథాపోషణము ఏలాగు నడ

చింది, వారి పాత్రల శీలవర్ణన ఎట్లుఉన్నది, వారు మానవహృదయాన్ని ఎట్లు గమనించారు, – అనే విషయవిచారణ చేయుటే ఈ వ్యాసాలలోని పద్ధతి. ఈ పద్ధతిని అవలంబించినపుడు గుణదోషాల నిరూపణకు ఒకటే విలువ. ఆవశ్యకమైనపుడు దోషాలను చూపించడము, న్యాయమైనపుడు స్తుతిచేయడము జరిగింది. గ్రంథకర్తయొక్క సాంఘిక గౌరవాతిశయాలను గమనించనక్కరలేకుండా శిల్పాన్ని శిల్పముగాను, ఆభాసను ఆభాసగాను విమర్శించ సాధ్యమైనది. సజీవులైన వారి గ్రంథసమీక్షకు ఇది ప్రధానదీక్ష. విమర్శనవస్తుపరీక్ష ఉద్దేశ్యము.

ప్రసిద్ధమైన సనాతీజాతులలో మూడురకాలు మాత్రమే ఈ సంపుటములో పొందుపరచడమైనది. నవల, పద్యకావ్యము, నాటకము. నవలలు మూడు; అవికూడా ఒకే సంప్రదాయానికి చెందినవికావు. నాటకములురెండు, ఒకటి సంప్రదాయసిద్ధమైనది. ఒకటి నవీనసాహిత్య పద్య నాటిక. న్యాయ్యముగా ఆలోచిస్తే కవనము గద్యమైనా పద్యమైనా ఒక్కటే. కవనప్రతిభా లక్షణాలు రెండింటికీ సమానంగానే వర్తిస్తవి. నవలనుండి నాటకము భేదించునట్లు గద్యనుండి పద్యము భేదిస్తుంది. ప్రత్యేకవిశేషాలు వాటికి లక్షణాలుగా ఉన్నా, పదమాధుర్యము వాక్యపటిమ, అన్వయవిశిష్టత, రసావిర్భావము, కథాగమనము, పాత్రపోషణము, అంగాంగీసంబంధము, మానవహృదయావిష్కరణము జీవన తత్వసమస్యా పరిష్కారము – ఇవన్నీ గద్య పద్యరూపముతో మారేవికావు. విమర్శన ఈ రెండు మార్గాల నడవవచ్చును. సాహిత్యము అనగానేమి? కవి అనగా ఎట్టి లక్షణసంపన్నుడు? కవనము ఎట్లు ఉండవలెను, అని సామాన్య దృష్టితో చేసే విచారణ కేవల సూత్రప్రాయము; కృతులకు చేసే సూచనలు ఉదాహరణల కొరకే. ఈ సూత్రాలు ఎట్లు సిద్ధించగలవు? ఊహాజన్యములా? ప్రసిద్ధమహాకవనాలనుండీ, వాటి శిష్టానందమునుండీ జనితములా? కేవల కల్పితములు కానప్పుడు, కృతుల అధ్యయనవిచారణలద్వారా లోకానికి ఆ సూత్ర నిరూపణ ఎక్కువ లాభకరము అని అభిప్రాయము. రుచి విశేషాల

గ్రహణానికి ఈ పద్ధతి సమంజసము అని ఆశయము. చెప్పేది వీలైనంత నిర్దుష్టంగాను, స్పష్టంగాను చెప్పడమే ప్రయత్నము. ఇందువలన వ్యక్తమైయే విమర్శనబుద్ధి కావ్యకల్పనలోను, కావ్యాస్వాదనలోను ఉపచరించగలదు.

సాహిత్యప్రపంచములో ఈ పనిని విమర్శనలద్వారా సాధించేవారు చాలాతక్కువమంది ఉంటారు. విమర్శనచేసేటప్పుడు దోషాలను చూపిస్తే ఆ గ్రంథకర్తల ఆక్రోశానికి విమర్శన వ్రాసేవాడు ఉత్తరవాది కావలసివస్తుంది. బుద్ధిచాంచల్యముతో బాధపడుతున్న ఈ విమర్శకబ్రువులకు ఒక్కపద్యము వ్రాయడముగాని, ఒక చిన్న వ్యాసము వ్రాయడముగాని చేతకాదు అనే నిందకు పాత్రులవుతారు. ఒక కవి ఒక విమర్శకునిగురించి ఇట్లు వెక్కిరించాడు : 'అసూయ మాత్సర్యాలతో మండుతూ రెండు దమ్మిడీలకు కవులను దూషిస్తే కవులకు డబ్బుఇచ్చే అలవాటులేని ఈ దేశంలో విమర్శనలకు ఇచ్చేవారుఎక్కడ? ఈ సంపుటములోని ఏ వ్యాసానికి ఏమీ ధనము ముట్టలేదని సగర్వముగా ఆ కవి నిరసనానికి ప్రత్యుత్తరము ఇవ్వగలను.

ఆధునిక ఆంధ్ర సారస్వతములోని ఏ గ్రంథమూ ఇంకా ఇతర భాషలలోనికి తర్జుమా అయినట్లు వినడములేదు. కాబట్టి ప్రపంచసారస్వతాపేక్షయా ఆంధ్రగ్రంథవిమర్శన జరగలేదు. రెండు మూడు ప్రపంచ సారస్వత సంపుటాలలో ఆంధ్రసారస్వత చరిత్ర ఒక అధ్యాయములో వివరించే భాగ్యము కలిగింది. ఇది ముదావహమే. అలాగే ఇతరసారస్వతాలలోని ఉత్తమోత్తమ కవనాలు మన ఆంధ్రలోకానికి పఠనానికి అందింపబడలేదు. షేక్స్పియర్, హోమరు, డాంటి ఇటువంటివి అన్ని భాషలలోనికి ఉత్కృష్టకవులచే భాషాంతరీకరింపబడినవి; ఆ భాగ్యము ఆంగ్లభాషరానివారికి చేకూరదు. అట్టి పరిస్థితులలో శుద్ధ సారస్వతానియమానుసరణను విమర్శన సాధ్యముకాదు. సాధ్యము చేసుకొన్నా ఉపయోగము కానేరదు. ఈ సంపుటములో ఉదాహృతములైనవి ఠాకూరిగారి గ్రంథములుతప్ప - ఇతర దేశాలలోను ఇతర

భాషలలోను ప్రచారము కలవి కావన్నంతమాత్రాన, వాటిని తృణీకరించనక్కరలేదు. నిజమే, ఉత్తమోత్తమకావ్యాలకు సార్వత్రికము దేశకాల సంకోచాతీతము ఒక ముఖ్యలక్షణమే. అయినా, ఈ కావ్యాలు ఆధునికయుగానికి చెందినవి అగుటచేత ఆ లక్షణమును పాటించనక్కరలేదు. భవిష్యత్తు గురించి ఇప్పుడు ఎందుకు? ప్రతీకావ్యములోను ఒక అసాధరణ విషయము ఉండగలదనే విశ్వాసముతో కావ్యమథనము చేయ ప్రయత్నిస్తే, ఆ కృతియొక్క గుణదోషాలు వెల్లడికాగలవు. అసాధారణ వస్తువును చిత్రించవలెను కవిబ్రహ్మ అన్నవాడు. నిజమే కాని సాధారణత - అసాధారణత అన్నవి కావ్యాన్ని విమర్శన అనే సానలో పెట్టినప్పుడే గదా విశదపడగలవు.

ఈ కృతులను విమర్శించినపుడు పూర్వగ్రంధాలతో సరిపోల్చటము అనే సాధనాన్ని ఉపయోగించలేదు. నవీనసాహిత్యానికి చెందిన ఈ కావ్యాలలో పూర్వగ్రంథాల సంప్రదాయానుసవరణ లేనేలేదని చెప్పవచ్చును. ఒక్క భీష్మప్రతిజ్ఞ మాత్రము పూర్వసంప్రదాయానుగతము; కాబట్టి దాని విచారణలో ఆ సంప్రదాయస్మరణ చేయడమైనది.

ఈ సంపుటములోని అధ్యాయాలు వ్యాసరూపాన్ని అనుసరించి వ్రాయబడినవి. వ్యాసం సారస్వతజాతులలో ఒకటి వ్యాసానికి ప్రతీసారస్వతజాతికి ఉన్నట్లే కొన్ని నియమాలు ఉంటవి. ఒక ఉపోద్ఘాతము ఒక సమాప్తి, మధ్యను కొన్ని విషయములచర్చ, ఒక్కొక్క విషయానికి ఒక్కొక్కభాగము, ఆయా భాగాలకు అన్యోన్యసంబంధ పరామర్శలు, పరిచ్ఛేద విభాగము (Paras) ఇవి వ్యాసరూపానికి సామాన్యలక్షణాలుగా చెప్పుకోవచ్చును. ఇట్టివ్యాసాలు ఒక్కపేరాలో వ్రాసే చిన్నచిన్న విమర్శనఖండాలు కావు. అభిప్రాయములచర్చ కొంత నిడివిన విపులముగా నడుస్తుంది. తర్కప్రధానమై ఉంటుంది ఈ విమర్శనలోని చర్చ. భావోద్రేకాన్ని అనుసరించదు. హేతునిర్దేశము, వాదప్రతిపత్తి పూర్వపక్షసిద్ధాంతములు, ఉదాహరణము, ప్రమాణవాక్యము మొదలైనవి తర్కజీవము అనిచెప్పవచ్చును. ఈ అపేక్షలను ప్రయత్నించడ

ములో ఈ వ్యాసాలు పెద్దవి కావలసివచ్చినవి. పెద్దవి వ్రాయాలనే సంకల్పము. పెద్దవి అయినా కొంతచర్చను విడవక తీరింది. చిన్నవి అయినప్పుడు విషయపరీక్ష నిండుగా ఉండకపోవును అని భీతి.

ఈ దృష్టిలో ఈ వ్యాసాలను సహృదయముతో చదువరులు గ్రహింతురుగాక. ఈ వ్యాసాలకు పరస్పరసంబంధము వ్యాసాలు వ్రాసినవాడు ఒక్కడు కావడమే. కాని ఆ భిన్నతలో ఐక్యత ఏమీ ఉండదా అనేది పాఠకులు నిర్ణయించగలరు. అట్టి ఐక్యతకు దూరసూచనగా ఇకముందు ఈ ఉపోద్ఘాతములో చేసిన విచారణ ఉపయోగించవచ్చును. ఆ చర్చ కేవలసూత్రప్రాయము. అందు పొందుపరచిన ఆదర్శము. ఇందు అవి ఉన్నవని నేను భ్రమపడలేదని మనవిచేస్తున్నాను.



# 2

# విమర్శన

కళ, శిల్పము, శాస్త్రము, కౌశల్యము — అని సుప్రసిద్ధమైన వాటిలో విమర్శనఏది? కళాశిల్పాలకు జీవము కల్పన. శిల్పవిశేషము కళ. కళ అనేపదాన్ని కౌశల్యము అనే అర్థద్యోతకముగా వాడుతున్నారు. కళాకౌశల్యాలు ఒక్కటికావు. కళకు కౌశల్యముకావాలి. కౌశల్యము కళకాదు. అట్టి విభేదకముగా శాస్త్రముఅన్నది కలదు. చతురంగకౌశల్యము, పాకకౌశల్యము, వాక్కౌశల్యము; గానకళ, చిత్రకళ; అలంకారశాస్త్రము, వ్యాకరణశాస్త్రము, అనేవి ఉదాహరణాలు. కవనము కళగాని శాస్త్రముగాదు, కౌశల్యముకాదు. అనగా కవికి శాస్త్రజ్ఞానకౌశల్యములు అనవసర మనికాదు పరిష్కారము. మంచికవి అలంకారవ్యాకరణ చందశ్శాస్త్రాల జ్ఞానము సహకారి అవుతుంది. కావలసినపరికరాలన్నిటినీ సమంజసముగా కూర్చే నేర్పు కౌశల్యము. సంగీతం ప్రధానంగా కళ. కాని సంగీతశాస్త్రముఉన్నది. ఆ శాస్త్రజ్ఞానము బాగా ఉన్నా పాడేపాట హాయిగా ఉండకపోవచ్చును. అలాగా సంగీతశాస్త్రజ్ఞానము ఏమీ కూడాలేనివారు చాలా హాయి నిచ్చేటట్లు పాడగలరు. అలాగే కవితగురించి చెప్పవచ్చును. కవనము ఒకశిల్పవిశేషము. పండితుడు పట్టగలిగే దోషములేకుండా కవిత్వము చెప్పవచ్చును; కాని పెడసరముగా ఉండవచ్చును. కవితాధార గలవారందరూ శాస్త్రజ్ఞులుకారు. కవనము అందుచేత కళ అనిచెప్పుదురు. విమర్శనో ? శిల్పముకాదు, అది స్పష్టము. శాస్త్రమా అంటే ఇంకా అట్టిపూర్ణస్థితికి పరిణమించలేదని చెప్పవచ్చును. కాని శాస్త్రమువలెనే బుద్ధి తర్కగతముగాని, కళవలె హృదయగతముకాదు. అలంకారాదిశాస్త్ర సంప్రదాయాదులను వినియోగిస్తూ కవన మనే శిల్పాన్ని విషయముగాచేసుకొని, ఒనరించేచర్చ

విమర్శన. కవనవిషయికచర్చవలెనే ఇతరశిల్పముల గురించికూడా చర్చ ఉంటుంది; దానికి కూడా విమర్శన అనే పేరు పెట్టవచ్చును.

శిల్పానికి సంబంధించేవి మూడుప్రత్యేకగుణాలు ఉన్నవి. కల్పనాశక్తి ఆనందించేశక్తి సమన్వయించేశక్తి. వీటిలో శిల్పానికి ముఖ్యమైనది కల్పనాశక్తి. ఆ కల్పనాచిత్రాలను ఆనందించేది సమన్వయించేది లోకము. అట్టిలోకానికి సంబంధించియున్న కల్పనమాత్రమే బహువ్యాపకముకలది కాగలదుకూడ. సమన్వయించేశక్తి సంపాద్యము కాని కల్పన ఆనందించడము అవిధంగా సంపాద్యములుకావు. ఈరెండూ చాలా వరకు సహజముగా రావలసినగుణాలు. సమన్వయించడానికి సాధనాలు, పద్ధతులు, సూత్రాలు ఉన్నట్లు కల్పనకుగాని, ఆనందించడానికిగాని ఉండవు. కల్పనకంటె ఆనందించడము ఒకవిధమైన విశిష్టగుణము. అది ఎక్కువగా సహజము, సమన్వయించేశక్తికి కల్పన ఆనందించడము అనే గుణాలు సహకారులు. సమన్వయించేశక్తి ఉన్నరెండింటికంటె అధికంగా బుద్ధికార్యము. అంత బుద్ధికావ్యాలుకావు. కల్పన ఆనందించడాలు. విచారించడము, తర్కించడము, నిర్వచనవాఖ్య చేయడము ఇవన్నీ ఆ బుద్ధికార్యాలు. ఈ కేవలబుద్ధికి కొంచెము ఒక విశేషముగా కల్పన ఆనందించడాలు అతీతములు.

వీటిలో కల్పనాగుణము అధికముగా ప్రజ్వలిస్తున్నప్పుడు, విమర్శన కావ్యానికి ప్రధాన ధర్మమైన భావోద్రేకరహిత చింతనము కుంఠితము కాగలదు. కల్పనకు బీజమైన భావన ఎక్కువగా పనిచేస్తున్నప్పుడు లోకవ్యవహార జ్ఞానము తక్కువ అవుతుంది. విమర్శన కార్యానికి లోకవ్యవహారజ్ఞానము అనగా బుద్ధియొక్క ఒకరూపము చక్కని సహకారి. విమర్శనకు ఆవశ్యకమైన గుణాలు కేవలకవులకుగాని, కేవలతత్వవేత్తలకుగాని ఉచితరీతిని ఆశ్రయించి ఉండవు. అందుచేత సహజశక్తిగల కవులుగాని తత్వవేత్తలుగాని విమర్శనకార్యానికి తగరు అని అభిప్రాయము. ఆ కారణముచేతనే విమర్శనద్వారా తత్వాన్నిగాని, నీతినిగాని కేవలలోకవ్యవహారాన్ని బోధపరచ ప్రయత్నిస్తే విమర్శనకు

సహజమైన నిష్పక్షత చెడుతుంది. పాశ్చాత్యదేశములో శాస్త్ర విచారణాపద్ధతి విమర్శనలో కూడా ప్రవేశించింది. శాస్త్రము ఎప్పుడూ ఒకే తత్వాన్ని కనిపెట్ట ప్రయత్నిస్తుంది; ఆలాగే విమర్శనలో కూడా ఒక తత్వమును స్థిరపరచవలసిందని ఆ శాస్త్రపండితుల ఆశయము. ఇది సాధ్యమా అనే సందేహము ఉండగా శాస్త్రపద్ధతికి ప్రధానసాధన మైన విశ్లేషణాదులు విమర్శన వ్యక్త బరచ వలసిన ఐక్యతాసౌందర్యాన్ని చెడగొట్టవచ్చును. విమర్శనమాత్రము తత్వనిరూపణకంటె ఎక్కువగా కళాసౌందర్య వ్యక్తీకరణమును చేయవలసిఉంటుంది. విమర్శన శాస్త్రము కంటె కళలను ఎక్కువ సన్నిహితముగా అనుకరిస్తుంది. విమర్శన పద్ధతి కళాసంప్రదాయమును పూర్తిగా విడచి ఉండకూడదు; కేవల భౌతికశాస్త్రరీతులనే అవలంబించరాదు. అందుచేత విమర్శనకు ఒక ప్రత్యేకవిశిష్టత కలదని చెప్పవలసివస్తున్నది.

విమర్శన వ్యక్తిగతమా నియమసూత్రానుసరణమా విమర్శనకు పాండిత్యశుద్ధి ఉన్నప్పుడే విమర్శన రాణించగలదు గదా! ప్రాత సంప్రదాయాలకు క్రొత్త రుచివిశేషాలకు వైరుధ్యము పోగొట్టగలిగే విమర్శనే బాగా విజృంభిస్తుంది! ఏ చరిత్రను పరీక్షించినాసరే స్థిరత అన్నది ఉన్నట్లు స్పష్టపడుతుంది. ఆలాగే రుచి నిష్కర్షలలో కూడా ఒక నియమము ఒక స్థిరత వ్యక్తమవుతుంది. నిజమే; వ్రాసేకర్తలు ఎక్కువైనకొలదీ విమర్శించే వ్యక్తులు ఎక్కువైనకొలదీ, వివిధత్వము ఎక్కువ అవుతూ ఉంటుంది. తేలికైన పదాలను ఆమోదించినవారివలెనే క్లిష్ట పదగుంభనను ఆనందించేవారు ఉన్నారు. శబ్దముల ధ్వనిని పొగిడేవారు అనుప్రాసారాధకులు లేకపోలేదు. స్వాభావికాలంకారాన్ని మెచ్చుకొనే సాధువులవలెనే అతిశయోక్తులను గౌరవించే కమఠాతులుఉన్నారు. చల్లని రంగులను ఎంచుకొనే వారితో గాఢమైన రంగులను పూసే చిత్రకారులను సరిపోల్చినట్లే వారివలనే లాలిత్యము బాగుందంటే ఉజ్జ్వల ప్రభను కోరేవారిని సరిపోల్చవలెను. ఆలాగే సూక్ష్మ సమన్వయములో ఒక విమర్శకుడు ప్రజ్ఞను చూపగలిగితే, తర్కనిపుణతతో గుణదోష

విచారణ ఒకవిమర్శకుడు బాగాచేయగలుగును. గ్రంథ సముదాయముమీద భావనద్వారా గ్రంథకర్త యొక్క ఆశయాన్ని గంభీరముగా విశదపరచేవాడు ఒకడు; గ్రంథస్థ భాగాలను విడదీసి అంగాంగి సంబంధాన్ని చర్చించేవాడు ఒకడు; అంతరదృష్టిని ప్రసారించి మారుమూలలపై తేజస్సును కేంద్రీకరించేవాడు ఒకడు; శబ్దాలంకార శాస్త్రమర్యాదలను పొందుపరచి, కావ్య సరణిని వ్యాఖ్యానించేవాడు ఒకడు;- ఇట్లు వివిధరీతుల విమర్శకులు వారివారి ప్రతిభను వినియోగిస్తూ ఉంటారు. అంతేగాని పరిపూర్ణతఅంటూ ఎక్కడా ఉండదు. అఖండ విమర్శన దుస్సాధ్యము. ఇందులో విశేషమొకటిగలదు. జీవసంబంధమైనది ప్రతిదీ మారుతూ ఉన్నట్లే విమర్శన విమర్శకుడూ మారుతూఉన్నవి. ఇరవైనాలుగో సంవత్సరంలో కనబరచే ఉద్రేకము అరవై దాటగానే శాంతించునట్లు విమర్శనధోరణి, విమర్శనదృష్టి క్రమంగా మారును. ఒక్కొక్కప్పుడు తాను కాదన్నది తానే అంగీకరించవచ్చును.

మీద నుదహరించిన కారణములవలన రుచి నిర్ణయ విషయములో ఇదమిద్ధమనే మొండిపట్టు కూడదని తోస్తుంది. విపులాచపృథ్వీ అన్నప్పుడు విపులాః అభిప్రాయాః అనే వ్యాఖ్యానము చేయవచ్చునని తోస్తుంది. ఇదే సిద్ధాంతమైతే విమర్శనకు నియమాలు సూత్రాలు ప్రమాణాలు ఆదర్శాలు మొదలైన కొలబద్ద అంటూ ఏదీలేదని చెప్పవలసి వస్తుంది. కేవల నియమస్థిరీకరణముకంటె ప్రశస్తకృతుల పరిచయము ఎక్కువ లాభకరము నిజమే. కాని ఆకృతి ప్రాశస్త్యమును నిర్ణయించేటప్పుడు కవననియమాలను విమర్శకుడు తన దృష్టిలో ఉంచుకొని యుండును. ఆదర్శాలులేని ఆచరణ ఉండనట్లే, నియమసూత్రాలులేని విమర్శన ఉండదు. కవనాలనుండి సూత్రాల నిశ్చయము ఎప్పటికప్పుడు కదులుతూఉండే ఇసకతిప్పలమధ్య స్థిరమైన పునాదులను నిర్మించడము వంటిది. మనదేశములో అలంకారశాస్త్రము ఈ పనిని కొంతవరకు సాధించప్రయత్నించేది. ఈ అలంకార శాస్త్రమర్యాదలు కేవలబుద్ధి జన్యములా లేక సమర్థ కవనములనుండి గ్రాహకములా అనే ప్రశ్నకు

సమాధానము దొరకదు. ఆ చర్చ ఇక్కడ అప్రస్తుతముకూడా. నడచిన కావ్యచరిత్రనుబట్టిచూస్తే నిర్ణీత సూత్రావలంబనము క్రొత్తకావ్యాల శ్లాఘ్యతకు విధిగా ఉండలేదని చెప్పగలము. ప్రతీమహాకవి ఏవోకొన్ని నియమాలను పాలించుకొనునని సిద్ధాంతముగా చెప్పవచ్చును. ఆ నియమాలు ప్రాచీన సంప్రదాయ సిద్ధములే కాకుండా, అలాగని వాటిని పూర్తిగా నిరసించకుండా తన ఆంతర్జ్యోతికి అనుగుణముగా వాటిని మార్చుకొని క్రొత్త నియమాలను కల్పించుకొనునని చెప్పగలము. ఇదే అర్థము కవులు నిరంకుశులు అన్నా, కవులకు ప్రాథమికసూత్రము స్వాతంత్ర్యముఅన్నా, అని మనము గమనించాలి.

వివేకులు ఎంత భేదిస్తున్నా, రుచివిశేషాలు ఎంతమారుతూ ఉన్నా లోకంలో నిలిచే కవనాలను నిర్ణయించడములో తగాయిదాలు చాలా తక్కువ. వేలసంవత్సరాలనుండీ లోకంలో అగ్రస్థానాన్ని ఆక్రమించి యున్న వాల్మీకాది మహాకవుల కావ్యాలకు చలనమురాదు. అట్టి అసందిగ్ధ ఉత్తమకావ్యాల మననద్వారానే విమర్శకుల హృదయాలలో నియమాలు స్థిరపడతవి. అలాగని పరిమాణమైన ఒక కొలబద్దను నిరూపించడము సాధ్యంకాదు; అందుకు నిదర్శనముగా విమర్శకుల, ప్రమాణ భూతులైన విమర్శకుల అభిప్రాయాలు భిన్నరీతుల ప్రవహిస్తూ ఉండడము సూచించగలము. ఈ ఆశయమును వ్యాఖ్యానిస్తున్నప్పుడు విమర్శకుని ఆంతరజ్యోతికి విమర్శనలోగల స్థానాన్ని గమనించగలము. ఒక నిశ్చితమైన మతముపై నిలిచియుండక ఎప్పటికప్పుడు తన ఆంతర స్ఫురణను అనుసరిస్తూ విమర్శకుడు తనకార్యాన్ని నిర్వహిస్తాడని చెప్పే పండితవాదముకలదు. దీనిప్రకారము విమర్శనకు ఏ ప్రాథమికసూత్రాలు ఉండవనిన్నీ, ఉండకూడదనిన్నీ సూచనకావచ్చును. కాని, వాస్తవము అదికాదు. ఆ ఆంతరజ్యోతి నిశ్చలముగా ప్రకాశించేదే అయితే, ఆ స్ఫురణ పిచ్చివానిమతివంటిది కాకుండా సందర్భశుచి కలది అయితే, సూత్రాలు ఉండకూడదని చెప్పే తీవ్రవాదము సరి అయినది కాక పోతుంది. వాస్తవము రెండింటికి విరోధములేనిమతము కావాలి. సాపా

ణమువలె స్థిరతకాదు; పిచ్చివలె తాత్కాలికముకాదు. కేవలసూత్ర విచారణకాదు; ఆదర్శనియమముల కట్టుబాటులేనిదికాదు. మహాకవులు నిరంకుశులు అనే స్తుతిలో వారుచంచలలుకారని నిర్వచించవలసినట్లే సూత్రములు వారికి బాహ్యాచోదితములుకావుగాని వారి కవనగమనము వారివారి స్వకల్పిత నియమానుసరముఅని సమరస, సౌందర్యము, స్వాతంత్ర్యము, కళ— వీటిఅన్నిటి విషయమై శిష్టజన వ్యవహారాన్ని చెప్పినట్లే కవనము, విమర్శనము గురించి చెప్పగలము. నియమము, ప్రవర్తన, కవనము సూత్రములు అన్యోన్యాశ్రయములు. ఏది ముందు అని నిర్ణయించడమునకు చేసే ప్రయత్నము అపసిద్ధాంతానికి తావు కల్పిస్తుంది.

ఈ సందర్భములో పరిషత్తులు ఉండాలనికోరే ఒక అభిప్రాయ మును స్మరించవలెను. పూర్వము మనదేశములో నూతనకావ్యాన్ని విమ ర్శించి తర్కించే పండితసభలు ఉండేవి. అవి సాధారణముగా రాజా మోదాన్ని ఆశ్రయించుకొని విలసిల్లేవి. పండితులు చర్చించి నూతన కావ్యాన్ని ఆదరించేవారు. జయదేవుని గీతగోవిందమునకు అట్టిగౌరవము జరిగె నని ఇతిహాసముకలదు. పాశ్చాత్యదేశములో ఫ్రాంసులో ముఖ్య ముగా ఇట్టి పరిషత్తుఉండేది. ఆపరిషత్తు నిరాకరించినకవికిగాని కవ నానికిగాని సారస్వతములో ఉనికి దొరికేదికాదు. సాక్షాత్తుగా అట్టిది ఇంగ్లండుకు లేకుండెను. ఉండాలని కొందరుపండితులు ప్రచారము నొక్కి నొక్కిచేసినా అట్టిది జనామోదము పొందలేదు. ఈ పరిషత్తులుచేసే విచారణకు ఆధారముగా అమోఘనియమాలు ఉండాలని కోరికఉండినా వాటిని వేటినీ అనుసరించి కవనాన్ని ఆమోదించడము నిరసించడము యథావిధికి జరగకపోయినా ప్రజామోదము విజృంభిస్తున్న ఈయుగంలో అట్టిశృంఖాలకు తావులేదని తెలిసినా, కొన్నాళ్ళక్రిందట కాకినాడలో ప్రాచీనసంప్రదాయాల సంరక్షణకు ఒకపరిషత్తు, దానికి వ్యతిరేకముగా అన్నట్లు గుంటూరులో నవీనప్రయత్నాలపోషణకు ఒకపరిషత్తు లేచినవి. రెండూ కాలప్రవాహములో అణిగిపోయినవి. పరిషత్తులు యథోచిత

ముగా నిర్మితములైనవి లేకున్నా, వ్యక్తులకు బిరుదులనొసంగే సమ్మేళనాలు ఉన్నవి కాబోలు. కవిసామ్రాట్, కవిరాజు, బాలకవి మొదలైన బిరుదులు వాడుకలో ఉన్నవి. అట్టి బిరుదల కోర్కె దాతలకు ప్రతిగ్రహీతలకు మెండుగానుండే పరిస్థితులలో యథావిధిగా ఏర్పడ్డ పరిషత్తులు ఉండడము శ్రేయస్కరమని విచక్షణులకు తోచకమానదు. కాని పరిషత్తులు నియమానుసరణము ఎక్కువచేసి, నూతనకాంక్షలను అణగద్రొక్కి, క్రొత్తపోకడలను లేవనీయకుండా చేయుటకు సహకారులు కాగలవు.

ఇదమిద్ధ మనే సూత్రాలు ఉన్నవి, ఉండవలెను అనే ధోరణిలో తప్పులు పట్టడము విమర్శనకు ముఖ్య వ్యవహారము అవగలదు. రుచి నిరూపణలో చెడ్డను చూపించి నిరసించడముకంటె మంచిని ఎంచి కొనియాడడము లాభకరమైనపద్ధతి కాగలదు. కాని ప్రతిదేశములోను కూడ ఈ నిరసనప్రయత్నమువల్ల, విమర్శకులు పొరపాటులు చేయడము సంభవించింది. అల్పుని పెద్దగాను, పెద్దను అల్పునిగాను నిరూపించడము తటస్థించినది. నిజమే పొరపాటు చేయడము ఒక విధంగా మానవనిర్మాణములో ఇమిడి యుండి, కొన్ని అభిప్రాయాలను ప్రాత అనే విశేషణాన్ని చేర్చి నిరాకరించడము కలదు. అంతవరకు లోకములో అంగీకారాన్ని సంపాదించు కొనియు ఉన్న అభిప్రాయాలను అతిసులభంగా తృణీకరించినపుడు బలవత్తరమైన హేతువులను నిరూపించక "నా రుచి" అని సమర్థించడము కలదు. ఇట్టి పరిస్థితులలో మీదను సూచించిన పొరపాటు అనే సహజగుణాన్ని గమనించవలెను. "నారుచి" అన్నది పొరపాటు కావచ్చును. కాబట్టి ప్రాత క్రొత్త అనే శబ్దఘోషపై, ఆధారపడడము కంటె గుణదోషాల విశదీకరణము ఉచితము. ప్రాత-అభిప్రాయము ఎప్పుడు ఎందుకు ప్రచారములోనికి వచ్చింది, ఇప్పుడు ఎందుకు అనంగీకారము దానికి కలిగింది—అనే విచారణ సమంజసము. అట్లు చేసినపుడు పొరపాటు ఎక్కడ ఉన్నది స్పష్టపడుతుంది. నూతనమైనదానికి ప్రాతదానికి సహజవైరుధ్యము కలదు.

ప్రాతపండితులకు నూతనకవిత్వము నచ్చనప్పుడు, విచారణ న్యాయము. యువకులకు నూతనకవిత్వము ఎందుకు ఆమోదకరము అవుతున్నది అని తర్కించడము శాస్త్రమర్యాద. మన దేశములో భావకవులను విపరీత తీవ్రముగా నిరసించిన ప్రాతపండితులకు ఈ సహనము లేకపోయింది. ఆ భావకవనాలు రానురాను పాతకలోకాన్ని ఆక్రమించుకొన్న పరిస్థితులలో నూతనరుచికల్పన అవసరమైనది. ఇక్కడ పొరపాటు ఎక్కడో ఉన్నదిగదా, ఇట్టి పొరపాటులు తటస్థించినపుడు వాగ్వాదము సాధారణముగ రేగుతూ ఉంటుంది. అట్టి రంగములోనికి దిగే విమర్శకునికి ఉద్రేకము తప్పదు. అటువంటిస్థితిలో ఋజుతకు భంగము వాటిల్లుతుంది. న్యాయదృష్టి మభ్యపడుతుంది. ఇది విమర్శకునకు మహాదోషము. పొరపాటు సహజ మని గ్రహించినచో, ఇతరుల అభిప్రాయాలను సానుభూతితో గౌరవించ సాధ్యమవుతుంది.

ఒక మహావిమర్శకుడు అన్నాడు: విమర్శనయొక్క ప్రధాన పద్ధతి ఉదాసీనుడై ఉండడము. లోకవ్యవహారములో కలిగే లాభాలాభాలను గమనించక విమర్శనసూత్రమునే అవలంబిస్తు, అనగా తాను ఎంచిన విషయము గురించి తన ప్రతిభను ప్రవర్తింప జేయడము. గ్రంథకర్త ఏమనుకొనును, అతనిని ఆరాధించేవారు ఏమనుకొందురు, ఇది పత్రికాసంపాదకునికి రుచించునా, అనే ఎట్టి లౌకిక ఫలములను మనస్సున ఉంచుకోకుండా, కావ్యాన్ని సూటిగా సమన్వయించడము ఔదాసీన్యము. సత్యాన్ని ఋజుతను గ్రహించడము, యావచ్ఛక్తిని వినియోగించి, మనశ్శుచిని విడనాడకుండా తర్కించడము, దేశమందు రేగుతూ ఉన్న ఏ కక్షకు కూడ చేరకుండా, బుద్ధిప్రయోగాన్నే అధిష్ఠించడము, బుద్ధికి ప్రశస్తమని తోచిన మతమును వెల్లడిచేస్తూ ప్రియాప్రియములతోగాని, లాభాలాభాలతోగాని సంబంధము కల్పించుకోకుండా ప్రవర్తించేది విమర్శనము. ఏదో ఒక సాహిత్యేతర ప్రయోజనాన్ని సంపాదించేకక్షులు పక్షాలు, ఆ కక్షలకు సంబంధించే పత్రికలు దేశములో ఉంటవి. ఒకొక్కప్పుడు ఒకొక్క వ్యక్తిని

ఆరాధించేవి కూడా అవుతవి. ఋజువిమర్శనకు అవికావు సాధ్య విషయములు.

అట్టి విమర్శకునికి లోకములో కొంత అసంభావనము సంభవించవచ్చును. దోషాలను విశదపరిస్తే ఎవరికైనాసరే నొప్పికలుగక తప్పదు. వారు సాక్షాత్తుగానో వారి శిష్యమిత్రకక్ష బృందముద్వారానో తిరస్కార ప్రయత్నము చేయవచ్చు. ఎవరివిఫు వారికి కానరాదు అన్నట్టు తమ దోషాలను తాము గ్రహించరు. ఇది సాహిత్యచరిత్రే అంతటా విశదమైనదే. అందువలన కుంఠితుడు కాకుండా ఉండడానికి ఈ ఔదాసీన్యము చాలా అవసరము.

విపులాచపృథ్వీ అని పాడిన కవిసుధ ఈ ఉదాసీన విమర్శకునికి అమరత్వమును ఇవ్వగలదు.

ఇట్లు ఔదాసీన్యతను వహించే విమర్శకుడు ఉచితమైన సానుభూతిని కలిగి యుండగలడు ఈ గుణము ముఖ్యముగా దోషనిరూపణచేసే సమయాన చాలా అవసరము. కవి కనబరచిన లోపాలు మానవ స్వాభావానికి చెందేవి. సామర్థ్య న్యూనతవల్ల సంభవించేవి; దుష్ప్రవర్తనకు సంబంధించినవి కావుగదా! అందుచేత దండనార్హమైన దృష్టితో వాటిని కనబరచనక్కర లేదు. నిష్పక్షపాతము, తత్ద్వారాధన అన్న మానవహృదయము గలిగిన విమర్శకుడు సానుభూతితో ఆ లోపాలను తర్కించగలడు.

ఇందుకు సహృదయము చక్కని సహకారి. సహృదయము కవికి ప్రధానము గదా. అలాగే పాఠకులకు కూడా ఉండాలి. కవి, పాఠకుడు, విమర్శకుడు ముగ్గురూ సహృదయులైనపుడె కావ్యము సఫలత నొందుతుంది. సహృదయము ఉంటేనేగాని ఉత్తమకావ్యము ఇవ్వదలచిన ఆనందము ఆహ్లాదము విమర్శకునికైనా పాఠకునికైనా సరే చేకూరవు. సహృదయము ఉన్నపుడే పరిణతబుద్ధి, రసాస్వాదనాతత్పరత, శబ్దమాధుర్యస్ఫూర్తి సాధ్యము కాగలవు; అలాగే భావనావైదగ్ధ్యము, భాషావైచక్షణ్యము, సమ్యక్ వాచకధైర్యము, నిష్కళంకభావము సంధి

వము కాగలవు. ఇవి ఉంటేనేగాని నిరంతర కావ్యాభ్యాసము నిలవదు. కవి ఆశయాన్ని గ్రహించి సమన్వయించి చదువరులకు వ్యక్త పరచడానికి అవకాశము పూర్తిగా ఉంటుంది.

సామాన్య మానవ హృదయానికి ఆహ్లాదమునుగాని జ్ఞానమునుగాని చేకూర్చే ప్రయత్నమే విమర్శన విషయము. బుద్ధికి తీక్ష్ణతను, భావాలకు తీవ్రతను, భావనకు ఉద్రేకతను, తర్కానికి కుశలతను చేకూర్చేది విమర్శన. అట్టి విమర్శనకు మాత్రమే ప్రామాణికత్వము నిలుస్తుంది. అప్పుడే వివేకము అసత్యము కాకుండా, అభిజ్ఞ బాధితము కాకుండా, ప్రతిష్ఠకు న్యూనత రాకుండా ఔచిత్యము వర్ధిల్లగలదు. ఇట్టి అసక్త వివేచనము మనదేశ సంప్రదాయ యోగము. దీనిని సులభముగా ప్రయోగములో ఇమడ్చ సాధ్యము. ఆధునిక యుగములో ప్రవహిస్తున్న రాజకీయాది సంఘర్షణ కక్షలలో సాహిత్య విచారణ మునిగి తేలకుండా ఉండే అసంసక్తతి విమర్శనకు ముఖ్యముగా అవసరము. ఇట్టిది గ్రంథకర్తల పరిచయము అక్కరచేయక గ్రంధాలనే పరిగ్రహించే పద్ధతులు సులభము.

ఇట్లు పనిచేసేటప్పుడు ఒక లోపము వాటిల్లవచ్చును. ఆ విమర్శకుడు నాతి విశ్రుతుడై ఉండిపోవచ్చును. పత్రికలు వాని విమర్శనలను అంగీకరించక పోవచ్చును. వాని వ్యాసాలు ప్రకటింప పడకపోవచ్చును. అతని కావ్యమునకు ప్రయత్నాలకు విఘ్నము రావచ్చును. నిజమే. ఈ ఆపదకు అవకాశము ఉన్నది. కాని విమర్శన యొక్క ఫలము చెడకుండా విలసిల్లాలంటే విమర్శకుడు ధైర్యముగా తన కర్తవ్యాన్ని తదేకదృష్టితో సాధించితీరాలి. ఆ ప్రత్యేక విమర్శకుని జీవితములో ఆశాభంగము కలిగినా' విమర్శన చరిత్రలో మాత్రము ఈ ప్రయోగానికి క్రమశః ఉచ్చస్థానము రాకమానదు. ఈ గౌరవమే చాలును గదా. కేవల గౌరవాపేక్ష కాదు. వాస్తవమైన మానవసేవ కూడా అట్టి ఔదాసీన్యము వలనే చక్కగా జరగగలదు. నూరు మంది మధ్యములును తయారు చేయుటకంటె ఒక ఉత్తముని ఉద్ధరించగలిగేదే అర్ధదాయకము.

ఇట్టి కారణాలను మనస్సున ఉంచుకొని కవులు విమర్శకులు కాలేరు. కాకూడదనే నిషేధము సంక్రమించింది. కవనముచేసేవారికి కవన కష్టములు లెస్సగ తెలియగలవు. కాబట్టి కవి విమర్శకుడైనపుడు వాని విమర్శన సమంజసముగా ఉండగలదనే అభిప్రాయము ఉండి అది నిజమే. కవనము సృష్టితర్క భిన్నము. విమర్శకునకు బీజము తర్కము. రెండింటికీ పొందిక తక్కువ. కవులు భావోద్రేకసంపన్నులు. విమర్శనకు ఉద్రేక రాహిత్యము సొంపు. వైద్యునికి రోగమువస్తే మరొకవైద్యుడు, ప్లీడరు యొక్క స్వీయ-అభియోగానికి మరియొకప్లీడరు ఉచితమైనట్లు, కవన విమర్శనకు కవికానివాడు ఎక్కువగా ఉచితముగా కాగలడు. మహా కవులు తమ కవనాలకు సమన్వయము చేయక, లోకానికి కృతులను విడిచి పెట్టారు. కవి తాను పొందుపరచిన ఆశయాన్ని తానే విశదక పరిస్తే ఎక్కువ లాభకరమనే ఒక అభిప్రాయముకలదు. ఈసందర్భంలో సోక్రిటీసు చెప్పిన మాటలను ఇక్కడ పొందపరచవచ్చును. "నిజము చెప్పుటకు నాకు సిగ్గు అవుతున్నది. బహు జాగ్రత్తతో కల్పించిన కవనాలను నేను విచారించితిని. ఆ కృతికర్తలతో దీర్ఘకాలము సంప్రతించాను. ఆ కవనాల గంభీరార్థమును బోధపరచమంటిని. వారు చెప్పలేక పోయినారు. కవులు సృజిస్తారు. నిర్వచించడము వారి కర్తవ్యముకాదు. శిల్పకారుని భావనలో ఉద్దేశింపబడిన దానికంటెను అంతరమైనది శిల్పములో ఇమిడియుండవచ్చును. శిల్పియొక్క హృదయ గభీరములో నడిచే వృత్తులు కేవల తర్కముపైనే ఆధారపడియుండక సాక్షాత్ గ్రహణశక్తిగల అంతర్జ్ఞానమును ఆశ్రయించియుండును. కాబట్టి శిల్పికికూడ వ్యక్తముగాని తత్వము శిల్పములో ఇమిడియుండ గలదు. ఈ విశేషము కవులమధ్యగల తారతమ్యమునకు సమాధానము దీనియొక్క భేదావస్థలనుబట్టి కవులఉత్కృష్టతాగౌరవము మారుతూ ఉంటుంది. అని చెప్పవచ్చును. ఆ ఉవ్యక్తమును విశదపరచడము విమర్శకుని దర్మము కాబట్టి విమర్శన, కవులకు ఉచితము కాదనే అభిప్రాయము వెల్లడి అయింది.

విచారణ నిర్ధారణ నిశ్చయము— ఇవి విమర్శకుని ప్రధానకార్యాలు. ఒకదానికి ఒకటి సహకారి. సారస్వతప్రవాహములో పైకిలేస్తున్న కవనానికి తగినస్థానాన్ని నిశ్చయించవలసి ఉంటుంది. దానికి సహకారియైన విచారణ నిర్ధారణలను జరిపించవలెను. ఇందుకు ఉపయోగించే సాధనాలు రెండు. సరిపోల్చడము, విడదీయడము కావ్యాలను పరస్పరము సరిపోల్చి పరీక్షించడము; కావ్యములోని భాగాలను విడదీసి ఒకదానితో మరియొకదానిని సరిపోల్చడము; ఉత్తమ కావ్యాలనుండి అల్పకావ్యాలను వేరుపరచడము; గుణాలనుండి దోషాలను విడదీయడము; ఇట్లు వివిధరీతుల ఈ సాధనాలు ఉపయుక్తములు అవుతవి. ఇందుకొరకు విమర్శకునికి ఉండవలసిన లక్షణాలు మూడు ముఖ్యమైనవాటిని సూచించసాధ్యము: శిల్పానుభవము, రుచి విచక్షణాసామర్థ్యము. పాండిత్యజ్ఞానము. తనకు కలిగిన కావ్యానుభవాన్ని విడదీస్తూ, ఆ విశేషాలను సంపుటీకరిస్తూ, ఒకరచనను కల్పిస్తాడు విమర్శకుడు. సారస్వతములో ఎంత విస్తృతవ్యవహారము ఉంటే అంత శిల్పానుభవము కలుగుతుంది. ఆ భాషాసారస్వతమే కాకుండా ఇతర సారస్వతాల పరిచయము ఇందుకు చక్కని సహకారి. ఉ సారస్వతాలలోని ఉత్తమ కావ్యాలపై పుట్టిన భాష్యాలనూ, చర్చలనూ సమ్యక్ పఠనము గావించినపుడు అలవడినది రుచి విచక్షణ. ఇందుకు సహకారి చక్కని పాండిత్యము, విజ్ఞానము, శాస్త్రములతో గల పరిచయమున్నూ. ఇట్టి గుణసంపత్తి గలిగినప్పుడు విమర్శనకు వన్నె రాగలదు. శాస్త్రజ్ఞానము ఎంత విరివిగా ఉంటే అంతమంచిది; తత్వశాస్త్రము, చరిత్రజ్ఞానము మనః శాస్త్రము, జీవన వ్యాపారాల శాస్త్రాలు, తుదకు ప్రకృతి శాస్త్రము. ఇట్టి శాస్త్రాల విజ్ఞానము కావ్యానుభవమును తర్కించినపుడు చల్లగా ఉపయుక్తము అవుతుంది. ఈ పరికరము ఎంత నిండుగా ఉంటే విమర్శనకార్యము అంత సుష్టుగా ఉండగలదు. విమర్శన విజ్ఞానవిశేష మని చెప్పినా చెప్పవచ్చును. ఉద్గ్రంథాలను అన్వయించుకోగల సామర్థ్యము కలగడానికి విసుగు లేకుండా శ్రమదీసుకోవ

డము అవసరము- మోటారులోను, రైలుబండీలోను చదివే గ్రంధాలను అటు ఉంచబెట్టి, నిశ్శబ్దంగా నిశ్చలంగా కూర్చొని అన్వయించవలసిన ఉద్గ్రంధాలు విమర్శకుని ఆకర్షించాలి.

గ్రంథకర్తల హృదయాశయాలను చదువరులకు వెల్లడిచేయడము విమర్శకుని ప్రయోజనము. ప్రత్యేకప్రతిభావిశేషములేనిది గ్రంథ బ్రువము. ఏ అనుభవజ్యోతి లేశమును లోకమందు తేజరిల్ల కవి ఉద్దేశించెనో దానిని పాఠకుల ప్రజ్ఞకు అందించడము అవశ్యకము. సృష్టిచేసే కవుల మండలములో ఉచితప్రబోధ, ఉత్సాహాన్ని విస్తరింపజేయుటకుపాటు పడేవాడు విమర్శకుడు. కవి ఎంతవరకు తాను నిర్ణయించుకొన్న ఉద్దేశాన్ని సాధించగలిగెనో పరీక్షించి నిరూపించడము విమర్శకునిపని. ఈ పని నిర్వహించడములో విమర్శకుడు అధ్యాపకునివలె ప్రవర్తించ గలడు. చక్కగా సమన్వయించుకోలేని పాఠకులకు సహాయముచేసిన వాడు కాగలడు.

కవిహృదయము కవి ఉపయోగించిన పదజాలమునుంచేగదా విశద మవుతుంది. అందుచేత కవి వాడిభాషనుకూడా విమర్శన తర్కిస్తుంది. ఎట్లా వ్యక్తపరచినది, ఎట్లు వర్ణించినది, ఎట్లు నిరూపించినది, ఎట్లు చదువరులకు అందించినది, ఇవన్నీ భాషామూలకమైన విమర్శనకు విషయములు కాగలవు.

కవి వస్తువు పాఠకులు ఈమూడు ముఖ్యమైనవి విమర్శనకు. కవి కనిపెట్టిన క్రొత్తను, వస్తువుయొక్క మహిమను, పాఠకులకు కలిగే ఆహ్లాదాన్ని పురస్కరించుకొనిగదా కవనసమన్వయము కావలసి యుంటుంది.

కావ్యముయొక్క ప్రధానప్రయోజనము చదువరులకు రసవంతమైన అహ్లాదమును కలుగజేయడము; ఆ ఆహ్లాదముద్వారా జీవనవ్యాపారాలను సమన్వయించి, జీవనధర్మాలను ఆత్మకు అందివ్వడం. ఇదికావ్యముయొక్క మొత్తముమీద ఆధారపడి ఉంటుంది; ఆ మొత్తపుభావాన్ని

విశిష్టాంగాల రసము పోషిస్తుంది. విమర్శకుడు ఈ అంగాంగీసంబంధాన్ని పురస్కరించుకొనిగదా రసలక్షణ సమన్వయాదులను తర్కిస్తాడు. ప్రత్యేకపద్యాలను, ప్రత్యేకపదాలను గ్రహించి చేసే విమర్శన ఈ మొత్తపు ఆహ్లాదకరత్వాన్ని మరవకూడదు. ప్రత్యేకభాగాలను అంశాలను పురస్కరించుకొనేవిమర్శన పుష్టిగా ఉండ నేరదు. నిజమే, అంగి అంగాలపై ఆధారపడి ఉంటుంది. కాని అంగియొక్క ఏకత్వాన్ని ఆ ఏకతాసౌందర్యాన్ని విమర్శన మరచిపోరాదు. ప్రయోజనములోను ఫలములోను ఐక్యత ఎట్లు సాధింపబడినదో విచారింపబడవలెనుగదా; భాగాలను ఎంత ఉచితముగా ఐక్యపరిస్తే అంత సుకావ్యము గదా. గ్రంథ—ఉద్దేశ సమన్వయము, వస్తుసందర్భశుచి, రస—ఔచిత్యము, ఈ మొదలైన ప్రయోజనాలకొరకు గ్రంథాన్నంతటిని సింహావలోకనంగా గ్రహించవలెను. ఇందుకు ఉపచరించునంతవరకు అంశాలను భాగాలను అంగాలుగా పరీక్షించవలసివస్తుంది. ఏభాగము ఎట్లు గుణవంతముగా అంగిని పోషించిందో లేక దుష్టమైనదో గమనించవలసివస్తుంది. అప్పుడు మొత్తపుకావ్యభోగము చేకూరకపోతుంది. ఇందుకొరకు విమర్శన ఆవశ్యకము. కృతిని చదివినతరువాత దానిగురించి విచారించి ఆకవనముయొక్క విలువను హృదయంగతము చేసుకొనుటకు విమర్శన కలుగజేసే రుచి ఆవశ్యకము.

విమర్శనకు ముఖ్య ప్రయోజనము ఆ శిల్పాల తత్వస్వరూపాలను విశదపరచడమే కాకుండా, ఆ శిల్పాల రుచివిశేషాలను ఉన్నతస్థానానికి నడిచేటట్లు సరిచేసి సూచించడము. ఆ శిల్పము భవిష్యత్తుకు నిలిచి ప్రయోజనకారి కావలెను అంటే ఏ శిల్పరుచులు పూర్వకాలమునుండి భవిష్యత్తుకు కూడా ప్రవర్తించి ఉండగలవో, ఆ ప్రాథమిక సూత్రాలను అవలంబించి శిల్పము నడుస్తుంది. వాటిని విశదపరిచేది విమర్శన. అందుచేతనే ఒక కవి ఉద్ఘోషించినాడు సుకావ్యసృష్టికి విమర్శన చాలా ఆవశ్యకమని.

విమర్శన కావ్యపఠనాన్ని తొలగించ కూడదు. విమర్శనవలన కావ్యపఠనవైపు ఉత్సాహము కలుగాలి. విమర్శనకు ఆవశ్యకమైన కావ్యభాగాలను సూచిస్తే ఆ సూచనవలన మూలాన్ని పూర్తిగా చదివేటట్లు అవసరము కలగాలి. కావ్యాన్ని లోకానికి అందించడము విమర్శన కార్యాలలో ఒకటి. విమర్శకుడూ ఒక పాఠకుడేగాని పండిత పాఠకుడు పొలములో లేచే గాబును అణచివేసి పంటమొక్కలను పోషించే కృషికుడువంటివాడు. తాను చదివి, దానిని చదివి ఆనందించే దానిని ఉచితభాషలో వ్యక్తబరచి తనవలెనే కావ్యాన్ని చదివే అవకాశము కల్పిస్తాడు విమర్శకుడు. పూనిన నీటిని క్రమంగా సరఫరా చేసే ఆనకట్టువంటి పని విమర్శకునిది. ఒక వైపుకవులు, ఒకవైపు పాఠకులు; వీరికి మధ్యస్థుడు విమర్శకుడు. ఈ గ్రంథతంత్రములో ఒక స్థానాన్ని ఆక్రమించినవాడు విమర్శకుడు. కుశలులనుంచి అల్పగ్రహణ శక్తిగలవారికి శిల్పగుణాలను అందించినవలసినవాడె విమర్శకుడు అనుభవమనే దినుసులనుండి సృజించిన చిత్రాన్ని చదువరుల అనుభవానికితీసుకొని వచ్చేవాడు విమర్శకుడు. జీవితానుభవము యెడల శిల్పికి గల సంబంధము వంటి విమర్శకునికి కావ్యాల యెడల.

కవనాలు ఉత్తమశ్రేణికి చెందేటట్లు విమర్శకుడు కావ్య సమన్వయాన్ని చేయబూనుతాడు. అందుకు విమర్శకుడు బుద్ధిధైర్యమును వివేకతీవ్రతను వహించవలెను. కవనము ప్రస్తుతమునుగాక భవిష్యత్తుకు ఎంతవరకు ఉపచరించగలదు అనే దృష్టిని సారించి విమర్శన నడపవలెను. ఇది ముఖ్యముగా ఈ రోజులలో చాల అవసరము. ఉత్సాహముతో వ్రాసేవారు, అచ్చువేసేవారు, చదివేవారు, రోజుకి రోజూ వర్ధిల్లుతూఉన్న ఈ రోజులలో పూర్వ ఘనులను జ్ఞప్తిని ఉంచుకొని వారి పరంపరకు ఈ నవీనులు చెందవలెననే దీక్షతో విమర్శకుడు తన ధర్మాన్ని నిర్వహించవలసి ఉన్నది. పూర్వఘనులు అనగా ఉత్తమ కావ్య కర్తలు వారిసృష్టి సర్వకాలాలలోను అన్ని దేశాలలోను అతిశయించేది కాళిదాసాదు లట్టివారు.

కాని సాధారణకవిగా కవి దేశకాలావచ్ఛిన్నుడు జీవితతత్వాన్ని గ్రహించేటప్పుడు వానిచుట్టు ప్రజ్వలిస్తున్న పరిసరముల ప్రభావాన్ని దాట సాధ్యము కాదు. దాట ప్రయత్నించడము ఉచితముకాదుకూడ. ఈ సూత్రాన్ని విమర్శకుడు జ్ఞప్తిని ఉంచుకోవాలి. పూర్వులతో సరి పోల్చినపుడు ఈ దేశకాల సంకోచాన్ని గమనించాలి. పూర్వపరిస్థితులు ఆధునికకవిని బంధించనేరవు. కాబట్టి ప్రాత సంప్రదాయలను ఈ నూతనకవనాల సమన్వయములో ఎంతవరకు ఉపయుక్తములు కాగలవో విమర్శకునిదృష్టిని ఉండాలి. కాలవాహినిలో కృతులు ప్రత్యేక తీర్థాలుగా విచారిస్తేనే విమర్శనయొక్క విశిష్టత బోధపడగలదు.

విమర్శనవ్యాసము ఒక రచనావిశేషము. రచనాగుణాలు ఆ వ్యాసానికి పట్టినప్పుడు దానిని ప్రత్యేకకల్పనగా చదవ కుతూహలము చదువరులకు కలుగుతుంది. అప్పుడేగదా విమర్శనవ్యాసాలు సాహితిలో ఒక స్థానాన్ని ఆక్రమిస్తవి. అప్పుడు అవికూడా విమర్శనకు గురి కాగలవు. అంతేగాని ఏదో ఉపవ్యాసధోరణిని పరిగెత్తుతూవ్రాస్తే అది లోపాలకు సులభంగా దొరికి, చక్కనివ్యాసం అనిపించుకోలేదు. విమర్శనవ్యాసానికి కావ్యానికివలెనే ఒక 'రూపము' ఒకసౌందర్య విశేషము ఉండడము ఉచితము; శైలి వాక్యనిర్మాణము, విషయిక విభజన, ఆరంభ-అంతములపొందిక చర్చసందర్భము - ఈ మొదలైనవి వ్యాసలక్షణాలుగదా. కవనాలలో ఇమిడే కల్పన, శాస్త్రాలలో జరిగేచర్చ, బుద్ధి వ్యాపారాలకు సహజమైన ఐక్యతాది గుణాలు కలది సాహిత్యకోటికి చేరగలదు.

విమర్శనచేయబూనేవాడు ప్రాజ్ఞుడు - తన స్వీయ - అభిమానాలను కవులపై ఆపాదించక, ఒక విధమైన త్యాగబుద్ధిని చూపిస్తూ, ఆలాగని ఒకరిఅభిలాషను ఆలోచించకుండా, తన ఋజుతను విడవక విమర్శన ఖడ్గాన్ని సూటిగా వాడిగా ఉపయోగించాలి. ప్రతీవ్యక్తి ప్రతీదాని గురించి ఏదో కొంతచెప్పగలడని మాధ్యమికకవులు విమర్శకులను నిరసిస్తూ ఉంటారు. విమర్శకుడు వారి కృతిని పొగడనప్పుడు ఈ నిరసన ఎక్కువ

తీవ్రముగా వారిప్రచారములో కనిపిస్తుంది. ఆలాగు చెప్పేది విమర్శన కాదు; ఆలాగుచేసే నిరసనకు వాస్తవమైన విమర్శకుడు వశుడు కావలదు. అందరు కృతికర్తలూ కవులు కానట్లు, అందరు విమర్శనచేసేవారూ విమర్శకులు కానేరరు. అందరిగురించి వర్తించే సమానసూత్రము ఒకటే. వారి వారి విధిని వారు యథాశక్తిని నిర్వహించగలిగినారా అని తర్కించవలెను. ఒకవిధంగా చూస్తే ప్రతీ మానవుడూ విమర్శకుడే. బుద్ధిని ఉపయోగిస్తూ ఒకవిషయాన్ని తర్కిస్తే విమర్శించినట్లే. ఆ సందర్భంలో ఒకటి రెండు మాటలను చెప్పేవాడు, ఒకవ్యాసాన్ని వ్రాసేవాడు, ఒక గ్రంథాన్ని కల్పించేవాడు – అన్నీ విమర్శనలే. కూజంతం రామరామేతి అనగానే కవనము ప్రారంభమైనట్లు ఈరీతిగా చెప్తాను, ఈలాగుచెప్పాలి, ఇది అనకూడదు, ఇది అనాలి అని ఎంచడములోనే విమర్శన ప్రారంభమవుతుంది. ఇది ఒకవిధంగా అవ్యక్తము, వ్యక్తమై ఒక శిల్పవిశేషాన్ని విరివిగా తర్కించి, విపులంగా చర్చించినదానికే విమర్శన అనే పదము ఉచితము అవుతుంది. ఇట్టి చర్చవలన కావ్యము ఎట్లుండాలి, కావ్యరచనాపద్ధతి ఏమిటి అనేవి స్పష్టంగా వ్యక్తము కావడమువలన, వాటిని తెలుసుకొన్నవారు కావ్యాన్ని చక్కగా ఆనందించకలుగుతారు. ఒక కావ్యాన్ని ఈ విధంగా అన్వయించినవారికి మరొకకావ్యాన్ని ఆనందించేటప్పుడు కలిగే సౌలభ్యము ఎక్కువ అవుతుంది. ఈ కాలంలో చదివేవారు అందరూ ఈవిధంగానే చదువుతున్నారని చెప్పలేముగాని, సాహిత్యాన్ని చదివేవారి ప్రయోజనము శుద్ధానందమే అయినపుడు విమర్శన లాభకారి అని అంగీకరింపక తప్పదు. విమర్శన పేరు విన్నవారు కావ్యాలను చదవలేదా ఆనందించలేదా అనేదానికి సమాధానంగా ఇట్లు చెప్పవలసివస్తుంది. కుకవులు కుకావ్యాలు సిద్ధమవుతున్న సమయాన ఉత్తమాధమభేదాలను చేయగలిగే సామర్థ్యము అవసరముగదా. సరియైన శిక్షణ పొందినవారిరుచి ఉత్తమశ్రేణిలో ఉండగలదు.

విమర్శన లోకవ్యవహారం కొరకు ఉపచరించడము కలదు. విమర్శన ఈ రోజులలో ఒక వృత్తిగా ఉపయోగిస్తున్నది. అచ్చులో నుండి

వెలువడుతున్న పుస్తకాల సంఖ్య పెరుగుతున్న కొలదీ, ఆ పుస్తకాలను ఎంచుకోవడానికి చదువరులకు సహాయము కావలసివస్తున్నది. పెద్ద పట్నాలలో సంచరించడానికి కావలసిన దర్శకుల వలెనే, పుస్తకాలను ఎంచుకొనడానికి విమర్శకులు అవసరమైంది. ఇట్టి చిన్న విమర్శన ఖండాలు వార్తా పత్రికలలోను మాసపత్రికలలోను సహాయార్థము సంపాదింపబడుతున్నవి. ఈ విమర్శనలలో మీద నుదహరించిన కల్పనాశక్తి గురించిగాని, శాస్త్రీయపద్ధతినిగాని వ్రాయబడడానికి ప్రయోజనము అవకాశము ఉండవు; కేవలము తాత్కాలిక వ్యవహారప్రయోజనాన్ని అనుసరిస్తూ ఉంటవి. ఇవి చిన్న టిప్పణీలవంటివి. చర్చకు స్థానము ఉండదు. గుణదోషములకు విషయవిభాగములకు సూచనలు మాత్రము ఉండసాధ్యము. ఇవి సాధారణముగా చిన్నవిగా ఉంటవి. పుస్తక నామము వలన ఊహించిన దానికంటె ఎక్కువ పరిచయము కలుగజేయడమే వీటి ఉద్దేశము. కవనమునకు సాహిత్యములోగల స్థానాన్ని నిర్ణయించి, గుణదోషాలను తర్కించి, కవనజాతిలో ఆ గ్రంథము ఆక్రమించగలిగేపదవిని నిరూపించి, సాహితీపూర్వపరంలో గల సందర్భాన్ని పురస్కరించుకొని సమన్వయించే విమర్శనలు కావు. ఈ సూచక టిప్పణీలు. ఇవి విమర్శన బ్రువములు. ఈ విమర్శనఖండాలు లోక వ్యవహారముకొరకు ఉద్దేశింపబడినవి కావడముచేత విమర్శకుని కార్యము పరిస్థితులచేత సంకుచితము అవక తప్పదు. పత్రికాసంపాదకునికి నచ్చిన విమర్శన కావాలి. పుస్తకవిక్రయమునకు సహకారిగా ఉండాలి. చదువరులలో కొన్ని, ప్రకటించే నిలయాలను, వ్రాసిన గ్రంథకర్తను ఆ విమర్శకుడు మరచిపోజాలడు. కేవలము కల్పనాగ్రహణము ఒక్కటే విషయమై ఉండదు. తన రుచివిశేషాన్ని తన అంతరజ్యోతిని నమ్మి విమర్శకుడు ప్రవర్తించలేడు. పత్రికల ప్రయత్నమంతా చదువరులను ఆకర్షించడమే అయినప్పుడు, వారి కాలక్షేపానికి తేలికగా తాత్కాలిక వినోదంగా ఈ విమర్శనఖండాలు ఉండాలని పత్రికల ఆశయమై ఉంటున్నది. ఆ వ్యామోహంలో ఈ విమర్శకులు పడడము సంభవము.

లోకవ్యవహారమునే ఆక్షేపించినపుడు సంభవించే ప్రమాదము యిందు పొందుపరచిన అభిప్రాయాలను నా విమర్శకవ్యాసాలలో అనుసరించానా అని నా మీద పూర్వపక్షము రావచ్చును. లేదు. చేయలేకపోయాను. వీటిని ఇప్పుడు వ్యక్తపరచినవి నా మనస్సులో అవ్యక్తముగా ఉండినవి. వ్యాసాల వ్రాసినప్పుడు వీటిని ముం దుంచుకొనలేదు. ఇవి ఆదర్శాలు. ఆదర్శాల చేరే ఘటుడను కాను అని నా విజ్ఞాపనము.



# విమర్శక వ్యాసావళి

## ౧

## మాలపల్లి లేక సంగవిజయము

ఈ గ్రంథము ప్రచురింపబడిన కొద్దికాలములోనే ఇంత సుప్రసిద్ధమగుటకు కారణములలో ఒకటి దాని కర్తయొక్క నామము ఆంధ్రలోకమంతటా గ్రంథప్రచురణ పూర్వమే సువిదితమైయుండుట. ఉన్నవ లక్ష్మీనారాయణగారు సుప్రసిద్ధ-అసహాయవాదులు. అంతకుపూర్వమే వారు కొంత పేరుపొందినవారు. సంఘసంస్కరణ విషయములో వారు చాలా పని చేసినవారు. పేరుపడిన న్యాయవాదులు. సంఘసంస్కరణమునకూ, అసహాయవాదరూపమైన రాజకీయ సంస్కరణమునకున్నూ బీజమైన సూత్రమొకటే—వ్యక్తిస్వాతంత్ర్యము. దాని నిరోధకారణములను అన్నివిధములా ప్రతిఘటించ ప్రయత్నించుటయూ వారి స్వభావమని చెప్పవచ్చును. తాను ధర్మమని భావించిన ఆదర్శములకై ఇహలోక భోగములను బుద్ధిపూర్వకముగ విడనాడుచు, శరీరకష్టములను ఈశ్వరప్రసాదమువలె స్వీకరించిన వారందరు మహనీయులుకదా! కొద్దిగనో, అధికముగనో ఇట్టి మార్గమును అవలంబించిన ఈ గ్రంథకర్తయెడల ఆంధ్రులలో చాలా మందికి గౌరవము కల్గబట్టి, వారు కారాగృహములో ఉన్నప్పుడు వ్రాసిన గ్రంథముయెడలకూడ గౌరవమునుచూపుట లోకసంప్రదాయము.

వారి జీవితాదర్శమైన స్వాతంత్ర్యమును, గ్రంథరచనానియమములను ఉల్లంఘించుటలోకూడ వారు వ్యక్తపరచినారు. మాలపల్లివంటి గ్రంథము ఇదివరకు ఆంధ్రవాఙ్మయములో పుట్టలేదని చెప్పవచ్చును. కవి తనపరిచయమువెడి పీఠికలో భాషావిషయమై తాను త్రొక్కిన క్రొత్తత్రోవ

గురించి కొంతవ్రాసినారు. ఆ వాడుకభాషను ఉపయోగించుటకై జరుగుతూఉన్న చర్చలు ఆంధ్రలోకమునకు తెలిసినవే. గ్రంథములలో వాడుకభాష ఎట్లుఉండునో అనిచూచుటకు మాలపల్లే మొదటిదికాదు. కవిచెప్పినట్లు నిదర్శనమునకు తగినవిలేకున్నా, ఇంతకుపూర్వము కొందరప్పుడే వాడుకభాష నేవాడినారు. కాని విషయసంబంధమైన కారణములచేత ముఖ్యముగా ఆగ్రంథములు అంతవిపులముగా వ్యాప్తములోనికిరాలేదు. అనేకకారణములవల్ల మాలపల్లి అందరూ చదివేపుస్తకము కావచ్చును. ఇట్లు ఈగ్రంథము వ్యావహారిక భాషావాదులకు సంతోషదాయకమే అగును. భాషాస్వాతంత్ర్యమేకాదు ఈ గ్రంథకర్త విశదబరచినది. అతను ఎంచిన విషయమూఅట్టిదే. ఆర్థిక సాంఘిక రాజకీయసంబంధమైన విషయమైవ్రాయుట ఒకసంగతి; ఆ విషయమును చక్కని కథారూపముగ వ్యక్తబరచుట రెండో సంగతి; అన్నిటికంటె ఎక్కువైనసంగతి మాలమాదిగలగురించి గ్రంథమును వ్రాయబూనుట. పూర్వసంప్రదాయానుసారముగ కథానాయకుల లక్షణము మాలమాదిగలకు వర్తింపదు. పట్టణస్థులనుగాక పల్లెవారిని, ధనవిద్యానాగరికత సంపదలతో తులతూగు ఉత్తమవర్ణమువారినిగాక అధమస్థితిలో నున్న పంచములను, కథానాయకులుగ ఎంచుటకు ఇదేమొదటిప్రయత్నమని చెప్పవచ్చును. సంఘసంస్కరణము, అసాహాయ్యవాదము, పంచమోద్యమము, స్వదేశాభిమానము, స్వాతంత్ర్యస్థాపనము — మొదలుగాగల అన్ని నూతనసూత్రములను ఈ నవలలో ఇముడ్చుటకు కవి ప్రయత్నించినాడు. దేశముయొక్క ప్రస్తుతాధమస్థితిని పోగొట్టుటకు ఏయేనూతనవిధానములు ఆవశ్యకములని కవికి తోచెనో వాటినన్నీ, ఏవేవి అన్నిశాఖలలోను ప్రజల హృదయములను ఆకర్షించుచున్నవో వాటినిన్నీ కథానాయకులద్వారా చర్చకు కవి తీసుకొనివచ్చినాడు. దేశప్రజలలోకెల్ల అధమాధమస్థితిలోనున్న మాలమాదిగలు దేశముయొక్క అధమస్థితికి తగిన నిదర్శనప్రాయులు కాగలరనికాబోలు కవి వారిని కథకుముఖ్యులుగను, వారి నివాసస్థలమును ప్రధానరంగస్థానముగను ఎంచి గ్రంథమును ప్రారంభించెను.

అందుచేత ఈ గ్రంథముయొక్క ముఖ్య ఫలము ఆనందజనకము గాక, కవియొక్క ఆశయసాధకమని మనము చెప్పగలము గదా! ఈ ఆశయమును అన్నివిధముల సూచించే ఉద్దేశముతోనే గ్రంథమునకు మాలపల్లి అనే నీ నామకరణమును కవి చేసినట్లు మనమూహింప వచ్చును. మాలపల్లి మాలమాదిగల నివాస గ్రామము. దానికీపేరుఉంచినపుడు కవియొక్క ఉద్దేశమేమి ? మాలపల్లి మాలల గ్రామములలో ఒకగ్రామము అగుటయేగాక, మాలలగ్రామసామాన్యమునకు ద్యోతకము కూడ అగుచున్నది. అందుచేత ఈ గ్రంథమందు వర్ణించు విషయము ఏదో ఒక్క మాలగ్రామమే కాదనిన్ని, ఏదో ఒక్క మాలకుటుంబమే కాదనన్నీ స్పష్టము. కాని, సామాన్యమును వర్ణించునపుడు వ్యక్తులను వర్ణించుటయే కావ్య సంప్రదాయము. కాబట్టి మాలపల్లి అనే పేరుగల గుంటూరు తెనాలి మధ్యస్థమైన ఒక గ్రామమును, అందు అధికులైన మాలమాదిగల కుటుంబములను గ్రంథమునకు విషయముగ కవి పేర్కొన్నాడు. ఆ గ్రామమందు ముఖ్యులు మాలలేయైనా, పంచమేతర వర్ణమువారు ఆ గ్రామమందు లేకపోలేదు. ఒక ధనవంతులైన నాయుడు, ఒక బ్రాహ్మణుడు, కొందరు తురకలు, ఇతర శూద్రులు ఆ గ్రామమందు నివసించియున్నట్లు కథవలన మనకు తెలియును. కాని వీరందరు కథానాయకులైన మాలల చరిత్రలో ఉపనాయకులుగ రావలసినవారు గదా! వారుకూడా సమానముగ ప్రధానులైన యెడల గ్రంథమునకుగల నామము సార్థకము కానేరదు. ఎంతవరకు వీరందరు మాలల జీవితమును వ్యక్తపరచుటకు ఉపచరించగలరో అంతవరకే వీరు కథకు సంగతమగుదురు. మాలల అభ్యుదయము తన జీవితాదర్శమువలె పరిగణించిన రామానాయుడున్ను, మాలలను అధమస్థితిలో ఉంచుటయే ముఖ్యఫల మని భావించిన చౌదరీనాయుడున్ను, మునసబు, కరణము, బ్రాహ్మణపంతులున్ను ఈ తీరుననే గ్రంథసందర్భమునకు అపేక్షితులైనారు.

ఈ సూత్రమును పట్టించి గ్రంథమును విమర్శించునపుడు కృతి రచనలో కొన్నిలోపములు కనబడును. మొదటి సంపుటము నంతను

ఈ సూత్రానుసారముగ సాధించగలిగిననూ, రెండోసంపుటమును చదువు నపుడు, అందువచ్చు పాత్రలు, అందులో వర్ణించిన సంగతులు, అందలి కథాభాగము మాలపల్లితో సంగతము కాకుండు నని చెప్పవలసివచ్చును. మాలపల్లి ముఖ్యకథకున్నూ, కమలమోహనుల కథకున్నూ సంబంధ మేమిన్ని కానరాదు. మాలపల్లి గ్రామభూషణము. మాలమాదిగలకు శిరోమణి అనదగు రామదాసు కుటుంబవ్యవహారములతో ప్రారంభించి, క్రమముగా మాలపల్లిలో నివసించి ఉన్న కూలీలకున్ను, భూఖామందుల కున్ను సంభవించిన పోరాటమును మొదటిసంపుటము వర్ణించును. నవల రచనాసోపానములలో ఈ రెండున్నూ మొదటివి. కుటుంబవ్యవహార ములు, వారి దినకృత్యములు, వారి పొలములు, వారి గృహములు, వారి పశువులు, వారిపిల్లలు — మొదటి సంపుటముయొక్క సగము భాగ ములో వస్తుసముదాయము గదా! ఇంతవరకు రామదాసుకుటుంబము, రామదాసు ముఖ్యులు. రెండవభాగములో పంచమోద్యమము, కూలీల శరణోద్యమము, భూఖామందుల కుట్రలు, కూలీల సమ్మెలు కథావిష యము కాగా, సంగదాసు, వాని అనుచరుడు రామానాయుడు ఒకవైపు నను, చౌదరీ మునసబు ఒకవైపునను ముఖ్యులగుదురు. ఈ సోపానములకు తారతమ్యమున్నా, రెండింటిని ఏకీకరణముచేసి మాలపల్లి నవలయొక్క భాగములనిగాని, అధ్యాయములనిగాని భావించగలము. అయితే రెండో సంపుటములో ఆరంభమయిన కమలమోహనుల కథ మాలలచరిత్రతో ఏవిధమున సంగతమగునో కానరాదు. ఈ సంపుటములో ఈ కథగాక పంచమోద్యమ సంబంధమైనది లేకపోలేదు. ఈ భాగమును రెండు సోపా నములుగ విభజింపవచ్చును. మాలలపైగల కోపమును, అసూయను సంగ దాసు మరణముతో తీర్చుకొనలేక, రామదాసు ఆస్తి అంతా గ్రహించ వలెనని చౌదరీనాయుడు సమకట్టి, వానిపై వ్యాజ్యముద్వారా కసి తీర్చు కొనుట; మాలలలో విద్యాభిమానముకలిగి పాఠశాలను స్థాపించి విద్యను వ్యాపింపజేసి మతచర్చలను జరిపించుచుండుట — ఈ రెండున్ను రెండో సంపుటమునకున్ను మాలపల్లి విషయమునకున్ను సంబంధమును కల్పించు

చున్నవి. రెండుసంపుటములలో వర్ణితమైన వస్తుసామగ్రిని ఈదిగువ నుద హరించినరీతిని వివరింపవచ్చును :

I సం॥ (1) మాలకుటుంబముల వ్యవహారములు. (2) పంచమోద్యమము; కూలీలకు భూఖామందులకుగల వైరము.

II సం॥ (1) కమలమోహనులకథ. (2) మాలలపై కసిదీర్చుకొనుట; పంచమోద్యమము.

ఇవి ప్రధానవిషయములు. చిన్నవి ఇంకా కొన్ని సంగత భంగకారణములు కలవు. వీటి నన్నిటిని ఏకీకరించుట దుస్సాధ్యమని కవే భావించెననుటకు నిదర్శనము తన పరిచయమనెడి పీఠికలో వ్రాసిన ఒక వాక్యము. గ్రంథనామకరణములో రెండు నామధేయములు ఆవశ్యకమగుట, కథావస్తువు సంగతము గాకపోవుటకు నిదర్శనము. మాలపల్లిలేక సంగవిజయము అని పేరుపెట్టుటెందుకు ? నామము ఆశయమునకు లింగము. రెండునామములు ఎప్పుడైనా ఒకే ఆశయమునకు సరియయిన లింగములు కానేరవు. "ఈపుస్తకానికి మొదట మాలపల్లెని పేరుబెట్ట దలచుకొని వ్రాయడం ప్రారంభించాను. కొంతదూరం పోయిన తరువాత సంగవిజయమని పేరివ్వడంమేలని తోచింది. అందుకు రెండుపేర్లూ వుంచాను." అని కవి వ్రాసినాడు. ఈ వాక్యములు మొదటి సంపుటము యొక్క పీఠికలో ఉన్నవి. ఇవి ఆ సంపుటముయొక్క రచనకు చక్కగా అన్వయించును. మొదటి సంపుటముయొక్క మొదటిభాగం మాలపల్లి. రెండవభాగం సంగవిజయము. అయితే విజయము పూర్తి అగుటకు రెండో సంపుటములోని ఒకభాగము అవసరమైనట్లు తోచి రెండోసంపుటమును మొదటిదానినుండి కృతిరచనాచర్చలో విడదీయుట సమంజసము కాదని తట్టవచ్చును. మొదటిదానిలో సమ్మెలు విజయసూచకములు; రెండోదానిలో అట్టి విస్పష్టఫలములను చూపలేకున్నా, పాఠశాలస్థాపన, విద్యావ్యాపకము, సంగమందిర నిర్మాణము, మతచర్చలు సంగవిజయసూచకములని చెప్పవచ్చును గదా ! కాని ఇవి యేవిన్నీ

పూర్తిజెందలేదు; సమ్మెలైనట్లు ఇవికాలేదు. సమ్మె ఫలించుట సంగమరణమునకు ఒకకారణము. రామానాయుడు పంచమోద్యమ ప్రచారకుడగుట నిజమైన సంగవిజయము. అట్లే రామదాసుయొక్క ఆస్తి పోవుటనుగురించి చెప్పగలమా? రామదాసుయొక్క మనస్థైర్యము సంగవిజయముకాదని వాదించగలము. మొదటినుండిన్నీ రామదాసు వాస్తవమైన భక్తి పరవేదాంతిగదా. కథాభాగము లన్నిటికి రెండుపేర్లు చక్కగా అతికె వని చెప్పవచ్చును.

ఈ నిరూపణవల్ల తేలునదేమంటే కవి గ్రంథమును ఆరంభించేటప్పుడు రెండుసంపుటముల కథావస్తువును చక్కగ బుద్ధిమండలమున ప్రతిఫలింపజేసి యుండకపోయెను. అనగా, కథయొక్క అన్నిభాగములు ముఖ్యముగా ఆరంభోపసంహారములు సరిగా నిరూపించకుండ ఆరంభించేకృతికి మీదను విస్తరించిన ఐక్యభావదోషముపట్టును. వ్రాయడము ఆరంభించి, పెరుగుచున్న కొలదిని పెంచినట్లయితే కృతికి సర్వాకారము వచ్చును. మధ్యమధ్య ఒక్కొక్క ఆలోచనపైని ఒక్కొక్క సంగతిని దొర్లించుట కృతి రచనకు సాధనముగాదు. కృతిలో అన్నిభాగములకు పరస్పరముగాను, ప్రతిభాగమునకు మొత్తపు కృతితోనున్న అనుగుణ్యము (Proportion) ఉండవలెను. అది ఈ మాలపల్లికృతిలో తక్కువైనది. కొన్నిభాగములకు మొత్తపు కృతితో సంబంధము లేదు. కొన్నిభాగములు అధికముగ పెంచడమైనది. కొన్నిభాగములు గ్రంథానుగుణములు కాకున్నా, చదువరులను, అందులో సామాన్యులను రంజింపజేయుటకు వ్రాయబడినవి. ఈ అంశములను నిరూపించుటకు రెండోసంపుటము పరీక్షించవలెను.

నా ఊహ యేమనగా మొదటిసంపుటమును పూర్తిచేసినతరువాత రెండోసంపుటము వ్రాయదలచినట్లు కనిపించుచున్నది. అందుచేత రెండోది వేరే మరొకగ్రంథమని మనము భావింపవచ్చును. దానిలోని అధ్యాయముల లెక్క మొదటిదాని లెక్కతో సంబంధము లేకుండా

1, 2, 3, అని ప్రారంభించుట నా ఊహ కాక ఆధారము. అందు 21 అధ్యాయములు 189 పుటలు గలవు. వాటిలో 11 అధ్యాయములు 97 పుటలు కమల మోహనులకథకై వినియోగించబడినవి. 16, 17 అధ్యాయములు 24 పుటలు గలవి కొంతవరకు ఈ విషయమునే వివరించును. 20 వ అధ్యాయము 13 పుటలు గలది. క్రీస్తుమతచర్చకై వ్రాయబడినది; మన గ్రంథమునకున్ను క్రీస్తు మత నిరసనమునకున్ను సంబంధము అట్టేలేదు. అలాగే ఈ నవలకున్ను, మాంబలంలోని స్ఫోటక నివారణపద్ధతులకున్ను ఏవిధమైన సంబంధము కానరాదు. కథతో సంబంధము స్పష్టముగా కానరాని కొన్ని అంశములను మధ్యమధ్యగా ప్రవేశపెట్టి, వాటిని గురించి కొంచెము ముచ్చటించి విరమించుట కనబడుచున్నది. ఏదైనా ఒకమారు పేర్కొని దానిగురించి తిరిగి స్మరింపక పోవుట కావ్యరచనాలోప మని చెప్పవలసివచ్చుచున్నది. మొదటి సంపుటములో రాట్నములగురించి కొన్ని మాటలు చెప్పి విరమించినాడు. రాట్నముల ఉద్యమము గ్రంథమునకు కొంతవరకు అనుగతమైయున్నదని ఒప్పుకొందము.

రాట్నములను మంగళాపురములో ఎందుకు పెట్టినారు? పత్తిగింజలు కావలెనా? ఆ ఉద్యమమునకున్ను మాలపల్లి వస్తువైన పంచమోద్యమమునకున్ను సంబంధ మున్నచో దానిని కవి వ్యక్తముచేయవద్దా? మొదటి సంపుటములో 7, 8, 9, అధ్యాయములలో మతము, భక్తి, తత్వము చర్చకు వచ్చినవి. రామదాసు, సంగదాసు, రామానాయుడు అందరూ ఆచర్చలో పాల్గొందురు. జీవితమునకు ఇవి ముఖ్యములు గావున వాటిని పంచమోద్యమమునకు బీజముగ కవి భావించి ఉండవచ్చును. సరే బాగున్నది. కాని ఈ అధ్యాయములతో వీటి ప్రసంగము విరమించినది. రెండో సంపుటములో అంత ముఖ్యస్థానమును ఆక్రమించిన కమలము మొదటిదానిలో ఎట్టి పాత్రస్థానమును పొందియున్నదో చూడవచ్చును. ఒకమారు పేరుచెప్పి, ఒకమారు అత్తగారితో అమ్మవారి గుడికి పంపుట జరిగింది. ఆరంభములో లక్ష్మమ్మకూడ ఇల్లే ఉండెను.

అమ్మవారి గుడికి బయలుదేరిన ఆమెను కవి ఒకతీరున వర్ణించెను. స్థూలకాయురాలు-బండీ ఎక్కలేదు. ఆవర్ణన చదువునపుడు ఆమె గురించి నవ్వు పుట్టును ( I-72, 76, పుటలను చూ॥) కాని, మొదటి సంపుటము తుదను, రెండో దానిలో అంతటను, ఆమె అట్లు కానరాదు. ఆమె గురించి నవ్వురాదు సరేకదా గౌరవబుద్ధి కలుగును. చౌదరీగారి గృహలక్ష్మి పారిపోక ఆమాత్రమైనా నిలిచి యుండుటకు కారణము ఆమె ధర్మబుద్ధి, పాపభయము, దానశీలము అని చెప్పవచ్చును. వీటి నన్నిటిని సంకలియించి చూస్తే, కవి గ్రంథరచనకు ప్రారంభించినపుడు చేసిన ఏర్పాటులకున్ను వ్రాస్తూవ్రాస్తూ చేసిన మార్పులకున్ను పొందిక లేదనిన్నీ, తనవస్తువునంతను తన మనశ్చక్షుస్సు యెదుట నిలిపి, భాగముల కల్పన గురించి ఆలోచించ లేదనిన్నీ తేలును. ఇప్పుడుదేశమందు ఆందోళనకు కారణములుగ జేస్తూ ఉన్న కొన్ని ఆదర్శధర్మములను కథారూపమున తన దేశస్థులకు బోధపరచుటకై యీ గ్రంథమును కవి వ్రాసినట్లు కనబడును.

ఇంతెందుకు! ఈ గ్రంథమునకు ముఖ్యపాత్రమైన సంగదాసును కవి యెట్లు ప్రవేశపెట్టెనో, ఆ పాత్ర నెట్లు పోషించెనో కొంచెము విమర్శింతము. సంగదాసుచరిత్ర మొదటిసంపుటముతో సరి; అది సంగని మరణముతో సమాప్తమవుతున్నది. ఆ కారణమున రెండోసంపుటమునకు సంగవిజయమనే పే రెట్లువర్తించునో విమర్శనీయము. సంగడులేకున్నా వాడు ఆరంభించిన ఉద్యమము, వానిఆదర్శముల ప్రభావము వాని ఆత్మ ఆచుట్టుపక్కలనున్న వారిని ప్రేరేపించి, వాడు ప్రారంభించినపనిని అంతకంటె అధికోత్సాహముతో కొనసాగించుట కుపచరించినదని సబబు చెప్పవచ్చును. ఆమాట వాస్తవమైనదే. కాని, ఈ వ్యాసములో మొదట ఒకచోట సూచించినట్లు రెండోదానిలోని ఏసంగతికయినా విజయమనే నామము సార్థకమైనట్లు కానరాదు. ఈఅంశముమాట అటుండగా, సంగదాసుచరిత్ర మొదటిసంపుటములోనే ఉన్నదికదా. మూడవఅధ్యాయములో సంగడనే రెండోకొడుకు రామదాసుకు ఉన్నా, వ్యవసాయపుపను

అలో సాయముచేయలేదని మొదట సూచింపబడినది. మరేమిచేస్తున్నదీ తెలియదు. తిరిగీ ఆరవఅధ్యాయములో మరొకమారు వీనిపేరుఉచ్చరింపబడి నది. అక్కడ సంగడుచేస్తున్నపని సూచితమైనది. "సంగడు వీళ్లందరికీ బళ్లుపెట్టించి, చదువూ వృత్తులూ నేర్పించాలంటాడు." ఇదిమాటమాత్రమే. సంగడు చేయుచున్న ఇట్టిప్రయత్నమునకు తిరిగీ మొదటిసంపుటములో ఎక్కడా సూచనలు కానరావు. ఈ సంగతిని కవి మరచిపోయి, మొదటి సంపుటముఅంతా ఇతరవిషయములతో నింపివేసి, ఈలోపమును పూర్తిచేయు టకు రెండోసంపుటమును ప్రారంభించినాడా అని సందేహము కలుగక మానదు. ఏడోఅధ్యాయములో సంగదాసు బాగా మనకు వ్యక్తమవు తాడు. ఆ వ్యక్తివర్ణనకూడ నవలరచనాపద్ధతుల ప్రకారము చేయబడట్లు తోస్తుంది. 7 వ, 8 వ, 9 వ అధ్యాయములలో సంగదాసు భక్తిపరుడు. "నేను గోపికను" అని భావించేవాడు కాని ఈ భక్తితత్వచర్చలలో సంగ దాసుయొక్క ముఖ్యత బయలుపడదు. అన్నిచోట్లను రామదాసే ప్రధాను డగును. ఈ మాలపల్లినవలకు ముఖ్యమైనఅంశము సంగదాసు రామానా యుల స్నేహము. అయితే ఈ మైత్రినిగురించి బుచ్చయ్యశాస్త్రిలు ఏదో ప్రసంగవశాత్తు అనినమాటతప్ప, వేరే ఏసూచనైనా లేదు. ఆ తరువాత కూడా కూలీలసమ్మెవ్యవహారము ప్రారంభమయేవరకు వారిరువురి స్నేహ మెట్టిదో, సంగదాసు రామానాయుని పాడుచేయుచుండుట ఎట్టిదో చదు వరులకు సూచితమైనను కాదు. అంతేకాక బుచ్చయ్యశాస్త్రిలు రామ దాసును ప్రశ్నించేసరికి జరుగుతూఉన్నచర్చతత్వము గురించి, ఆ సందర్భ మున అడిగినప్రశ్ననుబట్టి సంగదాసుయొక్క దుర్బోధన లెట్టివై యుండు నని మన మూహింతుము? నీతిసంబంధమైనవో, లేక మతసంబంధమైనవో అయియుండునని తోచునుకదా! వాస్తవముగ అట్టివికావు. సంగడు తండ్రితో వ్యవసాయము చేయలేదని పూర్వమే తెలిసినా, ఏమిచేస్తున్నాడో పదో అధ్యాయమునకు ముందెక్కడా చెప్పలేదు. అక్కడకూడా స్పష్టము కాదు. "ఈరాత్రి మాయింట్లోనే పడుకుంటాడు" అని రామానాయుడు అన్నంతమాత్రాన సంగుని వృత్తివ్యాపారములసంగతి ఏలాగు స్పష్టమై

నట్లు? ఆ అధ్యాయములో తరువాత సంగడెవరో స్పష్టమగుతుంది.
చౌదరీ వ్యాపారవ్యవహారములను నడిపించు గుమస్తా. కూలీలసమ్మెలో
కలిసిన్నీ, కూలీల ఆర్థికస్థితిని బాగుచేయుటకు ప్రయత్నించిన్నీ,
ఆ తరువాత బెజవాడసభలో "వృత్తి ప్రతిష్ఠాప"నాది విషయములగురించి
ఉపన్యాసము లిచ్చిన్నీ సంగదాసు తన వ్యక్తిత్వమును వ్యక్తపరచినాడు.
భక్తిపరుడైన సంగడు, గుమస్తాపనిచేసిన సంగడు, ఉపన్యాసము లిచ్చిన
సంగడు—ఈముగ్గురికిగల ఐక్యత కృతిరచనాకౌశలమునకు సరిపోలేదని
నాఅభిప్రాయము. తుదను వర్ణితమైన స్వభావమునకు బీజమైనా పూర్వమందు
సూచితమై యుండవలెను. అలాగులేదు. గోపికవంటి భక్తిపరునిచే నీలి
మందు జేరము చేయించుట, కూలీలసమ్మెలకు కారకుడగుట, ఆర్థిక సాం
ఘిక రాజకీయవ్యవహారములవిషయమై, అతినూతనాభిప్రాయముల గురించి
ఉపన్యాసకుడగుట ఎట్లు పొందును? ఒకవేళ ఏకవాక్యత కావలసిఉంటే
కవి దానికి సూచనలెక్కడైనా కృతిలో చేసినాడా? నావాదన యేమంటే
అట్టిప్రయత్నమును, అట్టి రచనను కవి తలపెట్టుకోలేదని, ఒకదాని తరువాత
మరొకటి కవి మనస్సుకు ఊహాపోహములు వాటంతటఅవి తట్టగా, వాటిని
ప్రవేశపెట్టి, కావ్యము అల్లినాడు గాబోలని!

రామానాయుని సంగదాసు పాడుచేస్తున్నట్లు బుచ్చయ్యశాస్త్రిలు
విన్నాడట. సంగడివల్ల రామనాయుడు చెడిపోయినాడని చౌదరీనాయుడు
నమ్మి, సంగదాసును చంపినాడు. వాస్తవమేమిటో నిర్ణయించుటకు నవ
లలో ఆధారము లున్నవా? నాకు కనబడలేదు. రామానాయుడు చదువు
కొన్నవాడు. ఉద్యోగములో ప్రవేశిస్తే డిప్యూటికలెక్టరు లేక తాహసీ
లుదారు కావలసినవాడు. మోహనరావుతో సమానుడు. సంగదాసో? పం
చమ కుటుంబములో ఉత్తముడైనా అంతచదువుగలవాడని చెప్పలేము.
చౌదరీఇంట్లో గుమస్తా కూలీలపై యజమాని. ఇట్టి ఇరువురిలో ఎవడు ఎవ
రికి గురువు కాగలడో గదా! మోహనరావును "పంచమోద్యమము నీ కిష్ట
మేనా?" అని రామానాయుడు అడిగినాడు. ఇట్లు చదువుకొంటున్నప్పుడే
రామానాయునికి ఈ ఉద్యమముపై అభినివేశముకలిగి, అందుకు తనజీవిత

మును ధారపోయ సమకట్టియుండవచ్చును. కాని, పంచముల దుస్థితి గురించి తనకు తెలిసినదంతా తాను విన్నదీ చదివినదే కాకుండా, సంగదాసుద్వారా చక్షుర్గోచరమై అనుభవములోనికివచ్చి యుండవచ్చును; అందుచేత తన పూర్వాభినివేశము దృఢమై మాలలలో తెలివితేటలుగల సంగదాసునుచేరదీసి, ఉద్యమచర్చలు తరచుగ చేస్తూ, సంగదాసును రామానాయుడు తరిబీతుచేసినాడని మనము దృఢముగా ఊహించగలము. సంగదాసు చెప్పగలిగినమాటలన్నీ, ఉపన్యాసములన్నీ రామానాయుడు చేసిన బోధనల ఫలితములై ఉండవలెను. పంచములసభలో పంచములే తీర్మానోపపాదకులు కావలెనుగాని ఇతరవర్ణులవారు అగుట సమంజసముకాదు గదా! కవి దీనిని సూచించకపోలేదు. ఎట్లంటే "మాపిల్లవాడు వారి దగ్గరనే వుంటున్నాడు. బుద్ధి గరిపిందీవారే" అని రామదాసు బుచ్చయ్యశాస్త్రులకు ప్రత్యుత్తరమిచ్చినాడు (I. 47 పుట). కాని ఇట్టి సంగడిని చౌదరి తనసేవలోనికి ఎందుకు తెచ్చాడో వాళ్ళఇళ్లు దూరముగా లేకున్నా తనభవనములోనే ఒకగది యెందు కిచ్చాడో చెప్ప వీలు కాకున్నది.

ఈ వ్యాసములో ఒకటి రెండుచోట్ల కమలమోహనుల కథయెట్లు ఈ గ్రంథముతో అనుగతముకాదో చూపించినాను. వారి కథ శృంగార రసప్రధానమైనది. అదికూడ సాంప్రదాయిక నీతిబాహ్యశృంగారము. దీనిని మాలపల్లిలో కవి ఎందుకు ప్రవేశపెట్టినాడో? మొదట గ్రంథమును పోల్చినపుడుగాని, మొదటి సంపుటము వ్రాసేటప్పుడుగాని ఈ కథ గురించి కవికి తలపులులేవని తోస్తుంది. ఆతరువాతనైనా ఏ ఉద్దేశముతో ఈ కథాభాగము దూర్చినాడో తెలియదు. మాలపల్లి గ్రంథమునకు ప్రయోజనము ఆదర్శప్రతిపాదనముగాని ఆనందజనకముకాదని నిశ్చయించేయున్నాము. ఈ భాగము మాత్రము అట్టిదికాదు. కాకున్నచో కమలవలపు కామశృంగార పలాయనము ఆదర్శమని చెప్పవలసివచ్చును. ఎందుకో ఒకదానికి ఈ కథ వచ్చినది. దానిని కవి ఎట్లు రచించెనో కొంచెము విమర్శింతము. కమలయొక్క నామోచ్చారణతప్ప మరేమిన్నీ

మొదటిసంపుటములో కానరాదు. ఆమె దాంపత్యముగురించి ఏమియును తెలియదు. రెండోదానిలోనయినా రామానాయుడు అత్తవారింటికి వెళ్ళినప్పుడు కమలమ్మయొక్క నడవడి చిత్రమేమియును కానరాదు. చాలారోజులైంది భర్తను విడిచిపెట్టి; అంతకాలమైన తరువాత వచ్చినభర్తను ఆరాధించుటలో ప్రాచీన హిందూసంప్రదాయముతప్ప మరేమియును కానరాదు. శృంగారస్త్రీ అని ఎవరము అనలేము. ఆమెకట్టి దాంపత్యమునెడల ఎట్టి విముఖతఉన్నట్లు సూచనలులేవు. ఆమెకు సంతృప్తి పూర్తిగ ఉన్నట్లే మనకుతోచును. మోహానునితో పారిపోయినపుడుగాని, ఆ తరువాతగాని ఆమె పలాయనమునకు తగిన యెట్టికారణములూ ఉన్నట్లు కవి చెప్పలేదు. ఆమెకు ఒక చక్కని కొడుకు. బిడ్డలుకలిగితే స్త్రీయైనా సంసారి అగునని ఒకలోకసామెత. ఇన్ని ఆటంకము లున్నప్పటికీ కమలను ఇంటినుండిపారదోలుట ఈకృతికి యొకగొప్ప కలంక మని అంగీకరింపవలసిందేకదా!

మోహానుని చూచిచూడగానే మోహముపొంది, ఇల్లువిడిచి, పారిపోవ నిశ్చయించి, సాహుకనబడ్డా పారిపోవ సమర్థురాలైన కమలమ్మయొక్క స్వభావవర్ణన కాశీమజిలీలు, పండ్రెండురాజుల కథలలో ఉండవలసినది కాని ఆధునికకృతిరచనతో పరిచయ ముండి, ఆధునికభావములతో పొంగుచున్న హృదయముగల గ్రంథకర్తరచనలో పొందికకు సరిపోయినదికాదు. ఇట్టి ఆధునిక భావసూచన ఒక్కచోటమాత్రము గ్రంథములో ఒక్కవాక్యమున గలదు. దానిని చూపకపోవుట సమంజసము కాదు. "రాజకీయస్వాతంత్ర్యం గలజాతి విజృంభించేవిధాన విడిచెట్లకు కొమ్మలు, రెమ్మలు విస్తరించినపోల్కి, బంధవిముక్తయైన కమల లావణ్యసాగరం......" (II. 87 పుట) "బంధముక్తయైన" అనేమాట చాలాచక్కని అంగము. కాని దీని కనుగుణమైన సంగతి మరేదియును ఈ కథలో ఎక్కడా లేనందున ఇది తప్పిదారి పడ్డట్టున్నదని చెప్పవలసివస్తుంది. కాని ఈసందర్భమున ఈకథను ప్రతిపాదించి రచించియున్నచో స్వాతంత్ర్యాదర్శముతో ఇదికూడ అత్తి, బాగుండియుండును కదా! ఒక మాటమాత్రము చెప్పకతీరదు.

ఈ కథాభాగకల్పనలోగల ఒకరమ్యమైన కల్పనను కవి ఆధునిక పద్ధతులను అనుసరించి ప్రవేశపెట్టినాడు. అది చాలాబాగుంది. కమలఘునకు కనబడిన సాహుమయ ప్రపంచము, దానిప్రభావము చక్కనిది. కాని ఈ కథలో చాలాచోట్ల కవి పామరులను, శృంగారరసికులను రంజింపజేయు ఉద్దేశముతో అల్పరచనాశిల్పకల్పనకు దిగినాడని విచారము కలుగకమానదు. అందుచేత మొత్తముపైని ఈ కథను అంతను గ్రంథము నుండి బహిష్కరించుటో లేక ఇట్టి పలాయనమును ఆధునిక పాశ్చాత్య నవలలతోపాటు వ్యక్తిస్వాతంత్ర్యనిదర్శనముగ సమర్థించుటో చెసి తీరవలెను. మరికొన్ని చిన్నసంగతు లున్నవి. కాని వ్యాసము పెద్దదగుచున్నదని విరమించుచున్నాడను. ఈ మాలపల్లిని సంస్కరించి, రెండో కూర్పుకు త్వరలో తెచ్చి, ఆంధ్రవాఙ్మయసేవను చక్కగ కవిచేయవలెననేకోరికతో ఈ వ్యాసమును వ్రాసినాను.



# ౨

# హృదయేశ్వరి

ఆంధ్రకవులకు స్వాతంత్ర్యము లేదని విసుగుతూ ఉండేవారి ఆమోదమునకు పాత్రమైన సాహితీసమితికి అధ్యక్షులు శ్రీ శివశంకర శాస్త్రి గారు హృదయేశ్వరి అనే కావ్యమును ఆంధ్ర సారస్వతమునకు అర్పించినారు. ఈ సాహితీ సమితిసభ్యులందరూ నూతనసంప్రదాయములను ఆంధ్రసారస్వతములో ప్రవేశపెట్టవలె నని సంకల్పించుకొన్నవారు.

హృదయేశ్వరి ఒక కథ కాదు; బాహ్యప్రకృతివర్ణన కాదు; అది కవియొక్క హృదయతత్త్వమును వ్యక్తపరిచే గీతాసాహిత్యము. హృదయేశ్వరియొక్క అంగసౌష్ఠవముగాని, జీవితచిత్రములుగాని కావ్యమునకు ప్రధానము కావు. హృదయేశ్వరియొక్క హృదయమెట్టిదో, అట్టి హృదయమువలన తన హృదయమందు ఉదయించే భావము లెట్టివో వ్యక్తపరిచే గ్రంథము ఇది. ఆంధ్రవాఙ్మయములో సామాన్యమైన ప్రబంధములు గాథాప్రపంచమునకో, చరిత్రప్రపంచమునకో చెంది యున్నట్లుగాక, ఈ కావ్యము భావప్రపంచమునకు చేరినదై యున్నది. ఇదే దీని ముఖ్యవిశేషము. అలాగని ఈ గ్రంథములో వర్ణించిన భావములు పూర్వగ్రంథములలో నెక్కడా కానరావని నెప్ప సాహసింపను. పూర్వశృంగారకావ్యములలో అక్కడక్కడ ఉన్న వర్ణనావిశేషములను ఏరి, సంకలనముచేసి, ఈ కావ్యముగా నిర్మించెనని చెప్పే విమర్శనతో ఎంత మాత్రమూ నేను ఏకీభవించలేను. ఒకవేళ ఆలాగుచేసియున్నా, గ్రంథమును అంతమాత్రాన నిరసించము; ఆలాగు చేసినట్లుకూడా కానరాదు.

---

సూచన:—[గురుతుగా వేసిన అంకెలు ఘట్టమునకు, ఘట్టములోని పద్యమునకు సూచన. పుట అయినచోట పుట అని ఉండును.]

ఈ కావ్యమునకు మూలము చెప్పవలసేవస్తే, మనదేశ ప్రబంధాలు వెతుకుట కంటె పాశ్చాత్య సారస్వతములోని ఒక విధమైన శృంగారకావ్యముల వైపు * విమర్శనదృష్టిని మరలిస్తే ఎక్కువ లాభకారిగా నుండునేమో అని నాకొక ఊహ కల్గుతున్నది. అలాగని హృదయేశ్వరి కేవలమూ భాషాంతరీకరణ మనిగాని, అనువాద మనిగాని, వట్టి అనుకరణమనిగాని నా అభిప్రాయము కాదు.

ఇంతకూ 'హృదయేశ్వరి' కేవల శృంగారకావ్య మనికూడా నేను భావించలేదు. ఒక స్త్రీవ్యక్తిని చూచి మోహించి, ఆమెను పొందుటకొరకు (ఆమె అనగా ఆమె శరీరమేనా?) విరహబాధపడి, ఆమెను పొంది సుఖించిన కాముకుల శృంగారచేష్టలను వర్ణించే కావ్యము ఇది కానే కాదు. ఇది భావప్రపంచమునకు చేరినదైనా, భావనా యోగ్యమైనది అగుటచేత, దీనికొక విశేష మేర్పడుతున్నది. లక్ష్మి యనే ఒక స్త్రీరత్నమును కవి చూచి, ఆమెతో కలిసి మాటలాడి, వివాహము

---

* *Dante:* Vita Nuova-Beatrice; *Petrarch*......Laure; *Shakespeare*: Sonnets; *Sydney*: Astrophal and Stellna; *Spenser*: Amoretti.

ఈ వ్యాసమును వ్రాసి పంపినతరువాత Madras Educational Review లో వైష్ణవ శృంగార గీతము లనే విషయమై జయంతకుమారదాసుగారు వ్రాసిన వ్యాసము చదువుట సంభవించినది. అందులో రాధాకృష్ణుల శృంగారగీతముల గురించి వ్రాస్తూ చండీదాసును గురించి కొంచెము వ్రాసెను.

"చండీదాసు ఒక బ్రాహ్మణుడైనా ఒక చాకలిపాలతినిచూచి మోహించి పెండ్లాడినాడు. ఆమెపైగల మోహమును అనేకవిధముల గీతాలలో వర్ణించి, తుద కొకచోట ఆమెను 'వేదమాత, గాయిత్రి' అని సంబోధించినాడు." అని ఉన్నది.

ఇట్టి వైష్ణవశృంగారగీతములుకూడా మన కవికి తెలిసియుండవచ్చును. అట్టివి ఏవైనా ఎంతవరకూ మన కావ్యమునకు మూలము లయ్యెనో నేను రూఢిగా చెప్పజాలను.

చేసికొని సుఖించుటే కావ్యమునకు ప్రధాన ప్రయోజనముగా ఎంచ కూడదు. లోకవ్యవహారమున సాధ్యమగుటకుగాను కవిహృద్గతమైన ప్రేమ లక్ష్మి అనే స్త్రీ రూపమును (కవి పురుషుడుకాబట్టి) దాల్చెనని నిర్వచించవలెను. లక్ష్మి స్వప్నములలోనూ, స్వర్గములలోనూ సంచరించే నిర్మలరూపిణి (60). నరలోకములో ఉన్నా, భౌతికశరీరము దాల్చినా, ఆకారణమున సంక్రమించే మానవసామాన్యలోపము లేవైనా ఉన్నా, ఆమె నిజముగా 'భావనాలోకములోనే పుట్టి, పెరిగి, భావశరీరమునే దాల్చి, సంచరించిన ప్రణయరూపిణి. అందుచేతనే లక్ష్మియొక్క నిర్మలతా సహృదయతాదిగుణములు దేవతాసంబంధములైనవి. మానవభావనలో ఉత్కృష్టపదవిని ఆక్రమించేదంతా దివ్యలోకమునకు చెందినదే అగుచున్నట్లు, లక్ష్మికూడా భావనాసృష్టికి చెందినదగుటచేత దేవతాస్త్రీ కాగలిగినదని నిర్వచించవలెను. ఆకారణముచేత లక్ష్మి ఒక వ్యక్తిగా కాకుండా స్త్రీ జాతికి ఉదాహరణముగా కవి భావించినట్లు తోస్తూ ఉండును. ప్రేమతత్వమును భావపదార్థముగా చర్చించుట కంటె ప్రేమరూపిణియైన స్త్రీ వ్యక్తిసాహాయ్యమున నిరూపించుటలో ఉండే సౌలభ్యము సారస్యము విమర్శకులు జ్ఞప్తికి తెచ్చుకుంటే, ఇట్టి భావనా కావ్యములయొక్క ఆధిక్యమును, విశేషమును చక్కగా ఆమోదిస్తారు. అప్పుడు ఈ కావ్యము వట్టి శృంగారరసప్రబంధము మాత్రమే కాదని స్పష్టమవుతుంది.

కేవల శృంగారకావ్యమే యైతే పుస్తక ప్రారంభమున ఉన్న పటము చదువరులకు వింతగా తోచకూడదు; అలాగే ఆపటమునకు మూలమైన గ్రంథస్వవర్ణనలుగాని, అందుకు కారణమైన కవి ఆదర్శములుగాని ఉద్వేగకారణము కాకుండును. ధీరోదాత్తుడైన నాయకుడు తాను మోహించిన నాయికకాళ్లపై బడుట, ప్రాచీనసంప్రదాయముగా శృంగారనాటకములలో చూస్తున్నాము. అలాగే మనకవిచేసిన వర్ణనలనూ, కావ్యోద్దేశములనూ తాత్కాలికముండే చేష్టలుగా కవి తలంచియుండినా, చదువరులు సమన్వయించుకొనినా, కావ్యము ఎవరికీ వెగటుగా తోచక

పోయియుండును. అలాగుకాకను కాబట్టే కావ్యము చదువరులలో ఉద్వేగ
మును కలిగింపవచ్చునని కవి తన కర్తవ్యములో సందేహించియుండెను.
ఉద్వేగకారణము కవి సూచించకపోయినా, చదువరులు ఊహించేటప్పుడు
కవి నిరూపించిన కొన్ని ఆదర్శములు అట్టికారణములు కావచ్చునని
అందరూ అభిప్రాయపడతారు. (స్త్రీ అనగా తల్లిగాని, తల్లివంటి
గురుభార్యాదులుగాని కాకుండా, తన వలపుకు నిలయమైన భార్యయే
యైనపుడు) స్త్రీ జాతియెడల కవి చూపే ఆదరగౌరవములే పూర్వాచార
పరాయణులగు ఛాందసులకు సహ్యములుగా ఉండవు. భార్యను ప్రేమ
పూర్వకముగా ఆదరించుటే ప్రాచీన గార్హస్థ్యధర్మమునకు వింతగా
తోచే స్థితిలో, భార్యను జీవితేశ్వరి యని భావించి, వర్ణించుట విపరీత
ముగా ఉండవచ్చు. అంతేకాకుండా భార్యను మహాదేవి, రమాదేవి,
సరస్వతీదేవి, ముక్తికాంత అనే దేవతాస్త్రీలతో సమముచేసి, తుదకు—

వివిధభంగుల నిన్ను భావించుకొలది
పొడముచుండు నమస్కారబుద్ధి నాకు!
జాజువారిన నీపదాంభోజయుగళి
వ్రాలు భక్తుని కరుణను నేలుకొమ్మ!

అని నిరూపించేటప్పుడు నాగరికుల మని గర్వపడుతూఉన్న
కొందరి విద్యావంతుల వీనులుకూడా మూసికొనిపోవును కాబోలు!
ఈ భావము ఒక్క అంకితములోనే కాదు, కావ్య మంతటా వెదజల్లి
యున్నది. దేవీ, జీవితేశ్వరి, బుద్ధిప్రదాత్రి, అనే భావగర్భితవర్ణనలే
కాకుండా,

నీప్రేమచేతనే కవివరుండ నైతిని (128. పుట.)
నా మతమునందు భార్య మాన్యురాలు (126. పుట.)
భార్యావిధేయుడనై యుండెదను (47. 5)

అనే ఆదర్శముల నిరూపణ కావ్యములో చక్కగా కానవచ్చును.
శృంగారవికారములో మోహపరవశుడైన కాముకుడు ఏమైనా కొన్ని
వికృతచేష్టలు చేసినా చదువరులు క్షమింతురు కాని, బుద్ధిపూర్వకముగా

తన నిశ్చితాదర్శములని ఇట్టి విపరీతాభిప్రాయములను ఉద్ఘోషించే టప్పుడు| ఎంతమంది విశాలహృదయులూ, ఎంతమంది రసజ్ఞులూ సహింతురో కదా!

నిజమే! "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని భావించేవారికి ఈ నూతనాభిప్రాయము అసహ్యముగా ఉండును. ఈయుగములో స్త్రీయెడల ఆదరము ఉదయిస్తున్నది. స్త్రీ, భార్యయైనా సరే, పురుషునితో తుల్యమైనవ్యక్తి యనిన్నీ, అట్టిస్వతంత్రత వ్యక్తమయ్యేటప్పుడే వాస్తవమైన ప్రేమకు అవకాశ ముండగలదనిన్నీ, ప్రేమించుటకుగాని, ప్రేమింప కుండుటకుగాని స్వాతంత్ర్యములేని స్త్రీయెడల ఉన్నతప్రణయము ఉదయించ నేరదనిన్నీ, ఈ యుగమందు ఒక ఉద్యమము ప్రజ్వరిల్లుతూ ఉన్నది. ఈనవ్యభావము ఒంటపట్టినన్నీ, ఆచరణలోనికిరానిదిన్నీ పురుషుని హృదయేశ్వరి వాస్తవమైన హృదయేశ్వరి కానేరదు. ప్రతిపురుషునికీ ఒక్కొక్క హృదయేశ్వరి ఉన్నట్లు మోహవశమైయున్నప్పుడున్నూ, ప్రేమసముద్రతీరతరంగములలో ఆడుతున్నప్పుడున్నూ, తోచినా, ఆ హృదయేశ్వరి పురుషుని మోహముపైనే ఆధారపడియుండేది కాబట్టి వాస్తవమైన హృదయేశ్వరి కానేరదు. కవియొక్క హృదయేశ్వరి అట్టి భ్రాంతిజాత అయినహృదయేశ్వరి కాదు; నిర్వ్యాజప్రణయపయోధిలో పుట్టిన లక్ష్మి. కవికిన్నీ లక్ష్మికిన్నీ గల అనుబంధము పూర్ణమైన ప్రేమకాబట్టే తనగుణములను ఎంచిగాని, తనలోపములను గణించిగాని, తనను వరింప వద్దనిన్నీ, తాను నిష్కపటముగా చూపుతూఉండే పూర్ణానురాగమునకు తనను అంగీకరించమనిన్నీ వేడుకొన్నాడు. తానెట్లు ప్రేమ చూపుతాడో అనేకస్థలములలో వర్ణించి వర్ణించి, తుదకు అన్నిటిని ఒక్కదగ్గిర చేర్చినాడా అన్నట్లు 59 గీతములో పదకొండువిధాల చేష్టలను వర్ణించి నాడు. ప్రేమే సర్వమున్నూ. ప్రేమలో జీవనమునడిపి ప్రేమలో ఇద్దరూ ఐక్యము పొందుతారు. (16-6) ఇట్టి నిర్మలప్రేమకు ఆస్పద మైన వస్తువును దేవీసమానముగా ఎంచుటలోనూ, దేవతగా భావించి ఆరాధించు టలోనూ వైపరీత్య మేమి ఉండగలదు?

ఇంద్రియభోగమునే పరమసౌఖ్యముగా భావింపని ఆర్యమత సంప్రదాయకులకు ఇట్టి తాదాత్మ్యభావన వెక్కిరింతగా తోచకూడదు. ఈ భావన ఒక్క శక్తిమతస్థులలోనే వామాచారసమయమందే వినియోగమవుతూ, ఇతరవ్యాపారము లన్నిటిలోనూ అంతరించి పోవుట ఎంతో శోచనీయము. అట్టిదానిని పునరుద్ధరించేవారు వాస్తవమైన ఆర్యతా వాసనలుగలవారు; వారందరూ హృదయేశ్వరివంటి చక్కని గ్రంథములకు స్వాగత మిస్తారనుకొంటాను. *

ఈభావనేకాకుండా మరేదైనా ఉద్వేగకారణమున్నదాఅనివిచారిస్తే మరొకటి నాకు తట్టినది. అది ఒకవైపునుంచి లక్ష్మీచరిత్రతోనూ, మరొకవైపునుంచి మన సంఘమర్యాదలతోను సంబంధము గలిగియున్నది. అందుచేత కావ్యములో సూచితమై యున్న లక్ష్మీచరిత్రను సంగ్రహముగ చేస్తాను. లక్ష్మి ఒకఅగ్రహారపు పిల్ల అయినా, చక్కగా సాహిత్యసంగీతజ్ఞానమును సంపాదింప గలిగినది.

చిత్రశిల్పకళావనాంతరసీమ లందు విహారలీలల
అనిశ మానందాధిగమమున అలరె. ... (60)

రుచివిశేషము పొందినది ఆమె. ఒకనాడు ఆమె పుట్టింట "సుందరద్వారముకడ" కవి ఆమెను జూచి, మోహించినాడు. కవికూడ ఆ అగ్రహారస్థుడే అగుటచేత, ఆమెను పదేపదే చూడగల్గినాడు. దేవతాదర్శనమునకై ఆమె వెళ్లినపుడూ, విద్యాలయమునుండి తిరిగి వస్తూ ఉన్నప్పుడూ, ఇట్లు నాలైదుసారులు చూచి తన వలపును తనలో తలపోసుకోవడమే కాకుండా తనమిత్రునికి తెలియబరచినాడు. ఆమెకూడ అతనిని ఒకమారు చూసి, వాని ప్రేమను ప్రజ్వలింపజేసినది. మరొకమారు

* ఈభావనగురించి ఒక స్నేహితునితో ముచ్చటిస్తున్నపుడు, వారు పారిజాతాపహరణమున్నూ, ప్రభావతీప్రద్యుమ్నమున్నూ ఇట్టి భావనను వర్ణించియున్నవని చెప్పినారు. ఇంకా మరి కొన్ని స్థలములు ఉన్నవట.

చూసినప్పుడు ఆమె సైగచేసిందికూడ. (అ. 3) ఆమె తన ప్రేమకానుకను పరిగ్రహించింది కాబట్టి, ఆమె పాణిగ్రహణముకొరకు కవి తపిస్తూఉండే వాడు. ఆ విరహబాధలో పూర్వము మరచికోబోలు !

తెలిపి నీప్రేమ కావు మీ దీనజనుని (31. 4)

అని, ఇదివరకే అత్మ్మ ప్రత్యనురాగము వ్యక్తపరచినా, మొరపెట్టినాడు. ఎన్నోమార్లు ఆమెను చూడాలని, ఎండావానా అనకుండా, వేళాపాళా సరకుచేయకుండా ఆమెసౌధమువైపు వెళ్లుతూ ఉండేవాడు. ఒకమారు ఆమెముఖసందర్శనము పొంది, ఒకమారు ఆమె కంఠధ్వని విని, ఒకమారు ఏ లాభము పొందకుండానూ, ఈలాగు తనయింటినుండి ఆమె హర్మ్యము నకు తీర్థయాత్ర చేస్తూఉండేవాడు. ఇట్లు నా లైదుమాసములు గడపి, జ్యేష్ఠమాసములో ఒకనాడు అమెయింటిలోనికి వెళ్లి, ఆమె తల్లి తండ్రులతో మాట్లాడుతున్నప్పుడు, అతనికంఠధ్వని పోల్తిపైని కాబోలు ఆమె పైకివచ్చి, ప్రియునిజూచి సంతసించినది.

వల్గుగమనమ్ముతో జేర వచ్చినావు
.........నన్ను దర్శించుకోర్కి

అని అతడు మోహము నిలిపాడు. అలాగే అప్పుడప్పుడు తన యింటికి వచ్చిన ప్రియుని కిటికిలో నుంచీ, తలుపుసందులో నుంచీ తొంగిచూస్తూ తన మనోరథమునుకూడ వెల్లడిచేసేది. తుద కొకనాడు "కామదేవుడు వారికనుల్ కలపగా" ఆమెతో మాట్లాడి, ఆమె ప్రత్యుత్తరము గైకొన్నాడు.

'నన్ను గొనిపొమ్ము, మన్మనోనాథ !' యన్న
విధమునందోచె నపుడు నీ వీక్షణంబు
మదనదేవుడు నిరుపమ మధ్యవర్తి
నిన్ను నర్ధాంగిగా నాకు నిర్ణయించె. (50. 5.)

అని ధైర్యము తెచ్చుకొన్నాడు. "అన్యులకు గానరాకుండ" "గూఢముగ మన్ముఖప్రభల్ గ్రోలినావు" అని సంతోషిస్తూ,

......నాయెడ నీకు గాఢానురాగ
మను మహోహర్ష జనక వృత్తాంతకలన
శాంతి నెలకొనె ...... నా స్వాంతమందు (53. 1)

అని హృదయశాంతి కలుగజేసికొన్నాడు. ఆ శాంతితో విరహము పర్యవసాన మొందలేదు. ఆమెయొక్క ప్రాప్తి కావలసియున్నది.

తల్లిదండ్రుల అనుమతిపై వివాహము కాలేదు. అట్టిపద్ధతి కవికి నచ్చలేదు కాబోలు. వాస్తవప్రణయమునకు ఆవశ్యక మైన స్వాతంత్ర్యము ఒకరుచేసే వివాహములో ఉండదని కవి యాశయము కావచ్చును. అందుకు కన్యే వరించి వివాహము చేసుకోవలసిఉంటుంది. తల్లిదండ్రుల అనుజ్ఞకు లోబడి ఉన్నప్పుడు వారి అభిమతము అవసరము. లక్ష్మి విషయమై అది ఉన్నదనిగాని, లేదనిగాని చెప్పటకు తగిన సామాగ్రి కావ్యములో కానరాదు. కాని పుట్టిల్లు విడుచుటకు ఆమెకు కష్టముగా ఉన్నట్లున్నూ, పుట్టింటిఅనురాగమునకున్నూ, ప్రియునిప్రణయమునకున్నూ ఆమె హృదయసీమను గొప్పసంగరము జరిగినట్లున్నూ, అట్లు బహుదినాలు ఎన్నోబాధలుపడి తుదకు "ప్రబలమైన ప్రవిమలప్రేమంబున"* ఆమె కాంతునికోర్కె చెల్లించగల్గినట్లున్నూ కనబడుతున్నది. (పుట 135). పుట్టిల్లువిడిచి, రహస్యముగా ప్రియునితో పోవ కవి వర్ణించినాడు—

నిన్ను గొనిపోవంగ నిదె ధృఢ
నిశ్చయమ్మున నరుగుదెంచితి.....
వేగముగ ప్రాణప్రియా, యిక
వెడలి రాగదవే.
సంశయింపకు ప్రియతమా !
శ్శబ్దగమనముతోడ బోదము.

అని మంచి చీకటిరాత్రి "వెడలిరాగదవే" అనే గీతమును (58) కవి పాడినాడు. అప్పుడైనా లక్ష్మి వచ్చిందోలేదో స్పష్టముగా తెలియదు గాని, ఊహిస్తే వెడలివచ్చినట్లే తోస్తుంది.

ఇదిగో ఈరహస్యముగా గొనిపోవడము చదువరులందు ఉద్వేగము కలిగించు నని కవి సంశయించేనేమో. నాకు ఉద్వేగము కలుగలేదు కాని, రహస్య మెందుకో, పలాయన మెందుకో తెలియలేదు. ఇది సాంఘికాదర్శము కానేరదుగదా. ఆ ప్రత్యేకస్థితిగతులలో కావలసి వచ్చెనంటే అది వేరేవాదము. ఆలాగు సమన్వయించుటకు ఈ కథ వ్యక్తిసంబంధమైనదే కాకపోవుటచేతనూ, ఆ పరిస్థితులు తెలియకపోవుట చేతను ఆ చర్చకు అవకాశములేదు. అందుచేత ఆదర్శ మేదంటే రహస్య పలాయనము కాదనిన్నీ, అందులో వ్యక్త మయ్యే స్వయంవరము అనిన్నీ చెప్పవచ్చును. లక్ష్మిచరిత్రద్వారా దానిని సూచించుటే కాకుండా, తన కూతురిభావిజీవితములగురించి కుటుంబము అందరూ కూర్చుని, సావకాశముగా మాట్లాడుతున్నప్పుడుకూడా ఈ స్వయంవరమును కవి తన నిశ్చితాభిప్రాయముగా ప్రతిపాదించినాడు. స్వయంవరము, స్వాతంత్ర్యము రెండూ పరస్పరమూ ఆనుషంగికములు. అన్నివిషయాలలోను స్వాతంత్ర్యమును స్థాపించేకవి ఈ స్వయంవరమును ఇట్లు వర్ణించుటలో వింత యేమీ లేదు. కాని ఇంత విశాలహృదయమూ వివాహము నిర్బంధ మని నిశ్చయించుటలో సంకుచిత మైన దని చెప్పవలసివస్తుంది. ఎట్లంటే,

భార్య: మంచి దొక్కమాట మణికర్ణికా! నీవు
సర్వకాలములను జనకు మ్రోల
నోలలాడుచుందు వొక్కొ? విద్యలలోన
పెండ్లియూహ విడిచిపెట్టికూడ !

భర్త: కాదుకాదు బిడ్డ గణియించి విద్యల
యందు పటిమ షోడశాబ్దములకు
వరుని యోగ్యుడైన వానిని వరియించి
పెండ్లియాడి చనును ప్రియునివెంట.

ఎల్లకాల మతివ యొటు తల్లిదండ్రుల
సవిధమందు నుండజాలు చెపుమ ! (పుట 134)
హృదయనాథుకడకు నేగకమాను నే !

అని దంపతులు మాట్లాడుకొన్నారు.

ఈ అభిప్రాయములకు ఉద్వేగము పొందనివారు స్వాదుపరాఙ్ముఖులు కానివారిలోను, వివిధసారస్వత పరిచయము కలవారిలోను, కళాప్రవీణులలోను ఉందు రని కవి ఆశించినట్లు తోస్తుంది. ఉద్వేగకారణములు సారస్యసంబంధము లైన వైతే ఇట్టి చదువరులను కోరుట సమంజసమగును కాని, సాంఘికసమస్యల విషయ మైన అభిప్రాయములు ఉద్వేగకారణము లైనపుడు సంస్కర్తలను కోరవలసియున్నది గదా. క్రొత్త భావనలకైనా, క్రొత్తకల్పనలకైనా, క్రొత్తకవితాసమయములకైనా ఉద్వేగము పుట్టేటప్పుడు కవి పేర్కొనినగుణములు సాధనములు కావచ్చును. సంస్కారము సారస్వతసంబంధ మైనదిగాక సంఘసంబంధ మైనది. కాని, ఈ రెండింటికి సంబంధము లేదని నా వాదము కాదు. కవిత్వము జీవితధర్మముల సమన్వయము అయ్యేటప్పుడు, జీవితధర్మములు సాంఘికములుకూడా కాబట్టి, సంస్కారము ప్రియమైన కవికి సంఘసంస్కారము ఇష్టమూ ఆవశ్యమూ అవుతుంది. ఎట్లంటే, లోకానుభవములోవలెనే సారస్వతములోకూడా అస్వతంత్రస్త్రీ నాయికగా ఉంటే రసము చాలా చప్పగా ఉంటుంది కాబట్టి, ఈ స్వయంవరణము సంఘసంస్కారప్రశ్నే కాకుండా సారస్వతప్రశ్నకూడా అయిం దని వాదిస్తే ఇష్టాపత్తే.

కావ్యనిర్మాణముగురించి కొంచెము తెలుసుకొందాము. కావ్యములో ఒకొక్క ప్రధానభావము ఒకొక్క ఉచ్ఛ్వాసములో వర్ణిత మైనది. స్త్రీరత్నమును చూచినందువలన తనలోగల్గిన 'విభ్రమము'; అందువలన ఉదయించిన (అయోగ) 'విరహవీచి'; ఆమెఅంగీకారము గైకొన్న తరువాత కలిగిన 'హృదయశాంతి';– అనే మూడు ముఖ్యశృంగారావస్థలు

క్రమముగా మొదటిమూడింటిలోను వర్ణింపబడినవి. హృదయశాంతి కల్గినా, ఆమె ప్రాప్తి కాలేదని ఆమెకొక ప్రేమగీతావళి కానుకగా ఇచ్చి, స్వప్నము పొందినాడు; ఈరెండూ మరిరెండు ఉచ్ఛ్వాసాలు ఆమెను చూచినది ఆదిగా ఆమెవలన కలిగిన సౌఖ్యావధిగాగల ఈ చరిత్రను భావ చక్రమందు ఐదుఅవస్థలుగా విభాగించి కవి వర్ణించెను. మొత్తముమీద కావ్యమంతా భావములవర్ణనేయైనా, మొదటిరెండింటిలోను వ్యక్తమయ్యే భావోద్రేకము రానురాను కథాసందర్భములో తగ్గి, తుదకు సుఖస్వప్నములో ఆదర్శముల నిరూపణకు వినియోగమైనది. భావోద్రేకము తీవ్రముగా ఉన్నప్పుడు భావములు అతివేగముతో పారిపోతూ ఉంటే వాటిని సావకాశముగా ఛందములలో సరసముగా వర్ణించుటకు ఒకవిధమైన సామర్థ్యము ఆవశ్యకము. బావములను జ్ఞప్తికితెచ్చుకొని, నిలిపిఉంచుట; విశిష్టానుభవములను విభజించి నిరూపించుట; ఈ మనోగతవృత్తులను మాటలలో చక్కగా వర్ణించుటకు తగిన సాహిత్యజ్ఞానము, పదవాక్య నిర్మాణము మొదలైనశక్తివిశేషములు కవికి ఎంత కుశలములుగా ఉంటే, కావ్యము అంతహృద్యముగా ఉంటుంది. భావముల నున్న దున్నట్లు వర్ణింప ప్రయత్నించినట్లు కావ్యములో ఉన్నఘట్టములవలన తెలుస్తూ ఉన్నది. స్థూలదృష్టిలో ఒకఘట్టమునకు మరొకదానికి ఉన్నసంబంధము అల్పమని తోస్తుంది. ఈ ఘట్టము లన్ని ఈ కావ్యములలో ఉన్నవరుసను వ్రాసియుండలేదనిన్నీ, దేనిమట్టుకు దానిని ఆ యా అనుభవస్ఫూర్తి సమయానవ్రాసి, తరువాత ఈ క్రమములో ఏర్పరిచెననిన్నీ మనము ఊహించవచ్చును. అందుకే "ఒకపట్టున చదువుటకన్న ఘట్టము ఘట్టము కడను గొంతతడవు నిలుచుచుండుట యుక్తము." అని కవి తన వక్తవ్యములో వ్రాసెను. ఒకొక్కభావనకు ఒకొక్కఘట్టము. ఘట్టములో ఎన్నోకొన్ని పద్యాలు; ఒకొక్కపద్యములో నాల్గేసిపంక్తులు. ఈ ఏర్పాటులో కొంత సౌలభ్యమున్నది. భావనపై బుద్ధినిలిపి, దానిని పుష్టీకరించి, విస్తరించి వర్ణించుటకు ఏర్పాటులో సులువుఉన్నది. ఈవిశేషము చిన్నచిన్న ఖండకావ్యములలో చక్కగా వ్యక్తమవుతున్నది.

కావ్యము భావప్రపంచమునకే చెందినది, కాబట్టిన్నీ, హృదయేశ్వరి భావసృష్టికే చెందినది కాబట్టిన్నీ, లక్ష్మికి వ్యక్తిత్వము లేదు కాబట్టిన్నీ కావ్యములో లక్ష్మి మాటాడనక్కరలేకుండా, కవే తన భావాలనూ, తన హృదయేశ్వరి భావాలనూ తన మాటలలోనే వర్ణించ నిర్ణయించుకొనెను. కాని ఈ ఏర్పాటుకు నలుగురిమాటలు కనబడుతూఉన్న ఐదో ఉచ్ఛ్వాసములో భంగము వచ్చినట్లు కనిపిస్తుంది. అది స్వప్నముకాబట్టి ఎవరన్న మాటలూ, కవి విన్నమాటలూ స్వప్నములోని చర్యలే అనిచెప్పి, ఆ దోషమును వారింపజేస్తే, అందులో వర్ణించిన సౌఖ్యాతిశయముకూడా స్వప్నగతమైనదే కావలసి వస్తుంది. అట్లు అనవల దని నా అభిప్రాయము. ఆ సౌఖ్యమునకు అతథ్యము రాకూడదని నా అభిప్రాయము. మిగిలిన నాల్గింటివలెనే ఈ ఉచ్ఛ్వాసముకూడా కవిభావముల వర్ణనే అని చెప్పితే ఎక్కువ సరసముగా ఉంటుందని నాతలంపు. అందుకు ఇట్లు వ్యాఖ్యానము చేస్తాను. భార్యాదులమాటలు వారివారి మాటలుగా కాకుండా, కవిభావముల ప్రవాహముయొక్క జోరును ఆపేటందుకు కట్టిన చిన్నచిన్న అడ్డుగా సమన్వయింపవచ్చును. తనమాటలుగానే చెప్పేటప్పుడు కలిగే సారస్యముకంటె వారివారి మాటలుగా నిర్మిస్తే ఒకవిధమైన రుచి విశేషము కలుగుతుందికాబోలు. వారివారి మాటలవలన ఉదయించే వేర్వేరు రుచులమేళనము ప్రాప్తిస్తుంది. ఆ సుఖస్వప్నమునకు అనిర్వచనీయసౌఖ్యమని అర్థముచెప్పి, నిర్మాణలోపము, సౌఖ్యాసత్యత అనే దోషములు రెండూ వారిస్తవి.

ఇట్లు ఎన్నోవిధాల క్రొత్తదైన ఈ కావ్యములో ప్రాతసంప్రదాయము లున్నవి. వాటిలో ముఖ్యమైనది భాష. కవి నావలెనే వ్యావహారిక భాషావాది అని వినికిడి. ఆ భాషనే వారికావ్యమునకు వాడేఉంటే—ఏలాగూ పఠనీయగ్రంథముగా వేయించుకోవాలనే ప్రయత్నము ఉండదు కాబట్టి—కావ్యము ఎక్కువ ధారాళముగాను, రసవంతముగాను ఉండి ఉండునని నాఊహ. కవిత్వములో పటిమ వస్తుందని కాబోలు సంస్కృతమును బాగావాడేరు. ఆంధ్రగ్రంథములు అందరి అందికలోనూ ఉండా

లనే ఆదర్శము విజృంభిస్తూఉన్న ఈవేళను నూతనాభిప్రాయాభిలాషి యైన మనకవి సంస్కృతపదములు తగ్గించిఉంటే బాగా ఉండునుకదా! నూతనాదర్శములో సంఘములో ప్రవేశించాలంటే జనసామాన్యమునకు అడ్డుకాకుండా ఉండేటట్లు భాషను నిర్మించవలెను. భాషలోనే కాకుండా కవితాసామగ్రియైన అలంకారాదులలో కూడా ప్రాచీనరీతి బాగా కనబడుతుంది; పద్మము, తుమ్మెద, మీనము, ఈ మొదలైనవి మాటిమాటికి వస్తూనే ఉండెను. అతిపరిచితము లైన వస్తువులే తరుచుగా కనబడుతూ ఉంటే అవి అలంకారములుగాక, అసహ్యము లవుతవనే లోకోక్తి కవితారచనలోకూడా వర్తిస్తుందికదా. ఇట్టివేకాబోలు కవి అన్న ప్రాచీనరీతులు; సరే.

కవిత్వము మొత్తముమీద మృదువుగాను, సరళముగాను ఉంది. గీతావళిగాక, మిగిలిన కావ్యమంతా ఒకేఛందస్సులో ఉన్నా, విసుగు రాకుండా రచన సాగింది. కావ్యమంతా పద్యాలలోనే ఉండడముచేత కొన్నికొన్ని స్థలములు గద్యలో ఉండుటకు తగిన వైనా పద్యాలలో ఉండుట తటస్థించినది. అవికావ్య కవిత్వపుసొంపుకు ఉదాహరణములు.

హృదయేశ్వరివలెనే హృదయేశ్వరుడుకూడా కొద్దికాలములో ఆవిర్భవించునని మనము ఆశించవచ్చును.

---

# ౩

# పద్మావతీచరణచారణచక్రవర్తి



శ్రీ శివశంకరశాస్త్రిగారి కవనాన్ని చదివి ఆనందించగలిగినంత సులువుగా విమర్శించడము శక్యముకాదని నేను ఎరుగుదును. వీరి "హృదయేశ్వరి" ని చదివినతరువాత ఎక్కువ జాగ్రత్తగా చదివినది ఈ నాటికనే. సుమారు ఆరు సంవత్సరాల క్రిందట వెలువడిన ఈ నాటికను కవిగారు నాకు ఒక ప్రతిని పంపినారు. అప్పుడు చదవడము కంటె ఎక్కువ పరిశీలనము చేయుటకు నాకు అవకాశము లేకుండెను. ఎప్పటికైనా దానిని జాగ్రత్తగా చదవాలని సంకల్పించుకొని పుస్తకమును జారనీయకుండా భద్రపరచి యుంటిని. ఈ మధ్య జయదేవుని గీతగోవిందములు మరొకసందర్భములో విచారణకు రాగా, ఈనాటికను పరీక్షించడము తటస్థించినది. ఆరుసంవత్సరాలలో మరవవలసిన గ్రంథము కాదని మరొకమారు నిర్ణయించుకొని, నా కానుకను ఆ కవిగారికి ఈ వ్యాసముద్వారా అర్పిస్తున్నాను.

సంస్కృతవాఙ్మయములో జయదేవుడు ఒక విధమైన నూతనావిర్భావాన్ని ప్రవేశపెట్టాడు. గీతగోవిందము కేవలము రాధాకృష్ణ భక్తులకే నిర్ణయింపబడ్డ మతగ్రంథము కాదు. మహాకావ్య మనిన్నీ, లక్షణములుగా ఉపచరించే శ్లోకరత్నములు గల ప్రబంధ మనిన్నీ మనము గ్రహించవలెను. జయదేవుని పూర్వులెవరున్నూ గీతగోవింద సంప్రదాయాన్ని అవలంబించి మహద్గ్రంథమును రచించియున్నట్లు ప్రత్యక్షప్రమాణాలు ఏవీ కానరాకున్నవి, నేను తెలుసుకోగలిగినంత వరకు. పదలాలిత్యము, రసమాధుర్యము, ప్రయోగవైదగ్ధ్యము, ఇవేవీ కావు ఈ నూతనసంప్రదాయ లక్షణాలు. సంగీతసాహిత్య సమ్మేళనము

ఇందున్న గొప్ప విశేషము. నిజమే. సరసరాగ నిబద్ధ సుప్రబంధ ప్రధానం. ద్వివిధశృంగారయుక్త భక్తికథాసుసేవితం. కాని ఇవికూడా కావు ఈ గుణములు ఏవీ క్రొత్తవిశేషములు కావు. గ్రంథరచనాకౌశల్యమును వ్యక్తపరచుటలో జయదేవుడు దీనికి ప్రబంధమని నామకరణము చేశాడు. "ఏకంకరోతి జయదేవకవిః ప్రబంధం" దీని భాగములకు సర్గాలని పేరు పెట్టాడు. కాని ప్రతాపరుద్రీయాదులు మహాకావ్యానికి చెప్పిన లక్షణాలు ఈ ప్రబంధములో లేవు. ఆలాగని "యేనకేనాపి తాళేన గద్యపద్య సమన్వితం" అన్నటువంటి క్షుద్రప్రబంధము ఎంత మాత్రము కాదు. మహాకావ్యమని దీనిని పరిగణించవలెనని కాబోలు ఒక వ్యాఖ్యానకారుడు దీనియందలి ప్రతిశ్లోకానికి విపులముగా రీతివృత్త్యలంకారచందస్సులను మల్లినాథుని మహాకావ్యవాక్యములను మించునట్లుగా ప్రతిపాదించియున్నాడు. ప్రాచీనుల మతములో కావ్యప్రబంధములకు భేదము ఉన్నట్లు కనబడదు. అభినయము ముఖ్యాంశమైన నాటకము గీతగోవిందము కాగూడదా? నృత్యసంగీతములు ఇందు విపులముగా ఉపయోగించబడియున్నవి. సంభాషణ వ్యాపారములద్వారా పాత్రలశీలవ్యక్తీకరణము నాటకముయొక్క లక్షణముగదా! శాస్త్రిగారుకూడా దీనిని కావ్యమన్నారు.

ఆ గుణములన్నీ పూర్తిగా గీతగోవిందములో లేకున్నా కొన్ని స్పష్టముగా వ్యక్తమవుతున్నవి. ఇతివృత్తము చాలా సంకుచితమైనది. కాని రసము పొర్లి పారుతూఉన్నది. పాత్రలు రెండో మూడో. ముఖ్యపాత్రలు సాక్షాత్తుగా మాట్లాడుకోరు. మేక్‌డానల్ గారు దీనిని పాత్రసంభాషణగ అంగీకరించకపోయినా, కేవలము కవివర్ణనలగా వారిమాటలను సమన్వయింప వీలుకాదు. ఆదినుండి తుదివరకు ఒకే రసము అగుటచేత ఆహ్లాదమునకు కొరత వచ్చిందని అనవచ్చును; కాని సూక్ష్మపరీక్షలో అంగములుగా కరుణాదిరసముల విస్ఫూర్తి వ్యక్తమవుతుంది. ప్రాచీన విమర్శకులు దీనిని నాటకముగా పేర్కొని యుండలేదు. పాశ్చాత్య విమర్శకుడు కైత్ అతని సంస్కృతనాటకచరిత్ర గ్రంథములో వ్రాసిన

ఒక వాక్యమును భాషాంతరీకరిస్తున్నాను : "గీత గోవిందములో వ్యక్తమగు కృతి వేదములందున్న గీతములలో నున్న నాటకకృతితో సరిపోల్చవచ్చును. గీతగోవిందము యాత్రలరచనకు సరిపడుతుంది. నాటక క్షీణదశలో ఈ యాత్రలు బయలుదేరినవి. రాధాకృష్ణుల శృంగారలీలల గురించి ఆటపాటవేషములతో నడిచే వీధినాటకాల వంటిది ఈ గీత గోవిందము. కాని, దీనిలో ప్రకాశిస్తున్న సాహిత్యము యాత్రిలలో కనబడదు". విక్రమోర్వశీయములో నాటకాంగముగా గానమును (గానము ఉంటే తాళనృత్యములు ఉన్నట్టేగదా) కవి నిర్మించినాడు.

ఆంధ్రదేశములో చాలాకాలము క్రిందటినుండి గీతగోవిందానికి విస్తార ప్రచారమున్నది. కృష్ణాజిల్లావాస్తవ్యులైన చెరుకూరు కుటుంబము నకు చెందిన లక్ష్మణాచారి వ్యాఖ్యానము చేసియుండెను. కృష్ణదేవ రాయల ఆస్థానములో గీతగోవింద ప్రశస్తి ఉండెను. ఒకవ్యాఖ్యానము రచింపబడెను. అనగా 16వ శతాబ్దమునాటికే గీతగోవిందము దక్షిణ దేశమున మంచి వ్యాప్తికి వచ్చినదన్నమాట. కాని, కావ్యములో పాటలు ఉండడము కనబడదు. గీతగోవింద మందుచేత కేవలము కావ్యనాటకము లలో ఏ తరగతికి చెందదు. ఎక్కువగా పోలికగల యాత్రలకంటె కూడా భిన్నమైనది. యాత్రలు నాటకక్షీణదశలోనివా? నాటక పూర్వ దశలోనివా? అనేచర్చ ఇక్కడ అప్రస్తుతము. సంస్కృతవాఙ్మయ ములో గీతగోవిందమునకు పూర్వము ఇటువంటిగ్రంథములు ఉన్నట్లు ఉదాహరణలు కానరావు. గీతగోవిందానికి అనుకరణములు ఆ తరువాత చాలా బయలుదేరినవి. గీతగోవిందముయొక్క జనామోదము దీనినిబట్టి మనము ఊహించవచ్చును. శాస్త్రరీత్యా గీతగోవిందము కేవలము మొట్ట మొదటిదిగా సృజింపబడినదని వాదించలేము. బహుశః దేశభాషలలో ముఖ్యముగా బంగాళీభాషలో వ్యాపించియుండిన వైష్ణవయాత్రల ఆవి ర్భావము గీతగోవింద మేమో.

జయదేవుడు గీతగోవిందములో మిత్రాక్షరచంధస్సును విపుల ముగా ఉపయోగించినాడనిన్నీ, మరి యే సంస్కృతకవీశ్వరుడు ఇట్లు

ఉపయోగించి యుండలేదనిన్నీ, ఇది ఉత్కళకవిత్వములో సాధారణముగా కనబడుతున్నదనిన్నీ, ఉత్కళుడైన జయదేవుడు దేశభాషలో విపులప్రచారముగల యాత్ర లనెడి వీధినాటకాలపద్ధతిని సంస్కృతములో ఉత్కృష్టనాటక-కావ్యాన్ని ప్రబంధమనే నామముతో సృష్టించాడని ఒక విమర్శకుని అభిప్రాయము. పర్లాకిమిడి మహారాజా సంస్కృత కళాశాల ప్రిన్సుపాల్ గారు, వ్యాకరణాచార్య లింగరాజు మిశ్రో, B. A., B. O. L. గారు ఈ అంశమును వారి వ్యాసములో చర్చించియున్నారు.

ఈ చర్చను శాస్త్రిగారు వారినాటకములో ప్రవేశపెట్టారు. వారు రచన లన్నిటినీ మూడుజాతులుగ విభజించినారు. రూపకము, శ్రవ్యకావ్యము, గేయకృతి యని మూడురకములని లక్ష్మణసేన పరీక్షసభలో నీలకంఠమఖిద్వారా చెప్పారు. (పుట 22) సాధారణముగా శాస్త్రమందు దృశ్యకావ్యమనిన్నీ, శ్రవ్యకావ్యమనిన్నీ విభజన కనబడుతుంది. రూపకమనునది దృశ్యకావ్యస్థానే పేర్కొనబడినా గేయకృతియని ఒక క్రొత్తజాతి కనబడుతున్నది. గీతగోవిందమువంటి రచనలకు అంతర్భావమునకుదరాలనే అభిప్రాయముతో ఈ నూతనజాతిని కల్పించారు కాబోలు. ఈ చర్చవలన నిర్ణయించగలిగినది ఈ శాస్త్రిగారి వ్యాఖ్యానముకూడా గీతగోవిందము ఒక నూతనరచనాపద్ధతిని అవలంబించినద నేకదా. గీతగోవిందము అనే పేరువల్లనే విశదమవుతున్న గానగుణము అందున్న పాటలవల్లనే కాకుండా కావ్యమంతా గానమయ మైన దనే నిర్వచనము శాస్త్రిగారు చేశారు. పద్యములనుకూడా జయదేవుడు పాడినాడని కవిగారి అభిప్రాయము. పూర్వము పద్యాలను పాడేవారా? సాక్ష్యము కొరకు వెదకవలసియున్నది. మహేశ్వరభట్టు మొదలైన పండితులు జయదేవుని గానకౌశలాన్నే మొదట సూచించి కొనియాడలేదు. నీలకంఠమఖి ఎత్తేవరకు కావ్యగుణాల ప్రశ్న రానేలేదు. ఆ కావ్యమంతా పాటే అన్నంతవ్యామోహంలో పడద్రోసింది ఆగానము. గానకవితాప్రియులైన శాస్త్రిగారు గీతగోవిందమందు ఇమిడియున్న గానమును

అట్లు లోకమునకు ప్రకటించారు. గాయకులే హరిహరాదులను పాడుతూ ఉంటారట (52). చదవడము పాడడము ఒక్కటే అని వారి అభిప్రాయము. చదవడమంటే సరసంగా చదవడము అంటారు. గానములేని కవులను శాస్త్రిగారు సంభవమని ఊహించరు. చక్కని కవిత్వానికి సంగీతజ్ఞానము కావాలి అని వారి అనుభవమాత్రము. ఉమాపతి మిశ్రి కవిపండితులు తాళము వేసినారు.

జయదేవుని గానములో చాలా గంభీరమైన శుద్ధియున్నదని మనము ఊహించాలి. అందరూ యెట్టి ఆక్షేపణావకాశము లేకుండా ఆమోదించి ఆనందించారు వారి గానాన్ని. ఎల్లప్పుడూ పాడుకొంటూ యుండిన ఆ దంపతులు అన్యోన్యము వారి కౌశలమును తెలుసుకొనే యుందురు. అయినా పద్మావతికి ఎందుకు శంకకలిగిందో స్వరభంగము కలుగలేదు గదాఅని. అట్టి శంకకైనా అవకాశ మెట్లు వచ్చింది? శంకకు కూడా ఆధార ముండాలిగదా. అదికూడా గొంతుకలో జీరవంటిది కాదు. స్వరభంగము ఆమెభయపడినది. అట్టి గాయకమహనీయునికి అట్టి లోపము యాదృచ్ఛికముగా నైనా సంభవింపదు గదా. పద్యాలను రాగతాళాల తీరున చదివితే రక్తిమెండు. 25

"సంగీత సాహిత్య రసానభిజ్ఞః
సాక్షాత్పశుః పృచ్ఛవిషాణ హీనః"

అష్టపదులకు జయదేవకవి నిర్ణయించినరాగాలు సరిపడవని చాలమంది గాయకశిఖామణులు రాగతాళములను మార్చినారు. అట్టి ప్రయత్నాలు దక్షిణదేశములో జరిగినవి; ఉత్తరదేశరాగాలను పొందుపరచినారు ఔత్తరీయులు. దక్షిణదేశములోని కర్ణాటకరాగాలను మేళవింపుజేసినారు దాక్షిణాత్యులు.

ఇట్లు నూతనకల్పన యైన గీతగోవిందాన్ని ఇతివృత్తముగా చేసిన శివశంకరశాస్త్రిగారు కూడా ఒకనూతనకల్పన చేసినారు. నవ్యకావ్యము నవ్యసాహిత్యము అయిన వారి పద్మావతీ నాటికలో. పద్మావతీపద్యనాటిక ఆంధ్రనాటకాలన్నీ సంస్కృత

నాటకపద్ధతిపై నడచి గద్యపద్యాలతో ఇమిడినవి. సంస్కృతనాటకాలు ఆడేరోజులలో శ్లోకాలను పాడేవారా అనేప్రశ్నకు సమాధానము నేను ఇప్పుడుచెప్పజాలను. కాని ఆంధ్రనాటకాలలో పద్యాలన్నీ సంగీతప్రావీణ్యములో ఇరుక్కొనియుండేవని చెప్పగలను. ఆంధ్రనాటకాలలో అంతేకాకుండా పద్యరచనలో సంధిచేశారు. సంధిఉంచిచదవడములో చిక్కు తప్పదు. స్వాభావికోచ్చారణలో ఉంచవలసిననొక్కుడు (Emphasis) సంధియున్నపద్యాలలోవుండడము కుదరదు. ప్రార్థనము చేయనున్న దీ పాదదాసి. ప్రార్థనముచేయనున్నది యీపాదదాసి. 'ఏది సరళమైన ఉచ్చారణ? సంధిచేయకతప్పదేమో. నాటకమునకు పద్యములే అడ్డని వాదించేటప్పుడు పద్యాలచంధస్సును మార్చుతూ సంభాషణనడిపే ఇద్దరిలో ఒకరు ఒకచంధస్సులోను, మరియొకరు మరొకఛందస్సులోను మాట్లాడితే, భావముల స్ఫురీకరణము ఎట్లుంటుందో ఆలోచించవలెను.

పద్యములు కొన్నిచోట్ల గద్యగా చదవడానికి చాలా సులువుగా వుంటుంది. కాని కొన్నిచోట్ల పద్యములువ్రాయడమువల్ల క్లిష్టప్రయోగాలు మారుమూలపదాలు తప్పినవికావు.

నాయికానాయకుల ముఖ్యపాత్రలను ధరించాలంటే సంగీతవిద్వాంసులుకావలసినదే. ఈ సంగీతబాధ విపరీతమై నాట్యకౌశలముగలిగి సంగీతముచేతగాని నటకులకు అవకాశముండేటట్లు గద్యనాటకాలు వచ్చెయి. ఇట్టిపరిస్థితిలో శివశంకరశాస్త్రిగారు కేవలపద్యనాటికను వ్రాశారు. పద్యనాటకములు చదవడానికేగాని ఆడడానికికావనే మతముఉంది. పద్యాలనుపాడకుండా సంభాషణవలె గద్యరూపముగా చదవాలనేవారు ఉన్నారు. పద్మావతీనాటికప్రదర్శనలాభము నాకులేకుండెను. దీనిని కవిగారి ప్రోత్సాహముక్రింద ప్రదర్శించినారనీ నా జ్ఞాపకము. అప్పుడు ఈపద్యపఠనము ఎట్లుండెనో పరీక్షించ అవకాశముండెను. పద్యగమనము నాట్యకౌశలమునకు అడ్డుగాఉండదా? అభినయమప్పుడు భావప్రకటనకు ఉండవలసిన ఉచ్చారణస్వాతంత్ర్యము పద్యపఠనములో పాట సంగీతములో వలెపోదా? ఈ ప్రశ్నఉంది. సంగీతము చెతగాని నేను నటకునివలెచదవ

ప్రయత్నించాను. పద్యమందు గర్భీకృతమైయున్న సంగీతకళ నా ఉచ్చారణస్వాతంత్ర్యమునకు అడ్డువచ్చింది. పద్యబంధస్సు మాత్రాయుక్తమగుటవలన గద్యగాచేయడానికి వృత్తముకంటె ఎక్కువగ వంగిందనిజమే. ఈపద్యములను మాత్రచందస్సుగానిర్మించారు. శాస్త్రిగారుసంగీతప్రియులు; ఆమాధుర్యమును వదలలేక వారిభావముల లాలిత్యాన్ని పోషించడానికి పద్యయానమును గ్రహించియుండిరా? గీతగోవిందకారుడు పాటలలో నాటకము నడిపిస్తే, శాస్త్రీగారు పద్యాలలో అనుకరించి మూలాన్ని స్ఫురింపజేయసంకల్పించినారా? ఈనాటిక ఇతివృత్తము చాలాఅల్పమైనది. అనేకసమస్యలను సూచిస్తూఉంటుంది. మూలమువలె రసము ఇందులో నిండుగా లేదు. ఆంధ్ర వాఙ్మయములో క్రొత్తక్రొత్తమార్గాల పరుగెత్తుతూఉన్నరోజులలో ఈనాటిక ఒకనూతనకల్పనకు మార్గదర్శి అయింది.

జయదేవుడు లక్ష్మణసేనసభారత్నములలో ఒకడని విశేషముగా ప్రచారము ఉన్నది.

> గోవర్ధనశ్చ జయదేవ ఉమాపతి ః
> కవిరాజశ్చ రత్నాణి సమితౌ లక్ష్మణస్యచ ॥

'గాడవాసులమైతి ముత్కళములోని బిందుబిల్వము విడిచి' (౮.౨) ఈ ప్రతీతిని శాస్త్రిగారు వారి నాటికలో దృఢపరచినారు. కాని, మిశ్రాక్షరచంధస్సును ఉపయోగించడము, జగన్నాథుని ఆలయములో భక్తుడుగా జయదేవు డుండినట్లు గాథ, ఇప్పటికి గీతగోవిందపఠనము పూరీ జగన్నాథాలయములో జరిగే నియమము, ఉత్కళదేశరాజు మరియొక గీతగోవిందగ్రంథమును రచించిన కథ—ఇట్టి నిదర్శనాలు కొన్ని ఆ ప్రతీతికి బాధకములుగా ఉన్నవి. ఇటీవల ఒక విమర్శకుడు జయదేవుడు లక్ష్మనసేనసమకాలీనుడు కాడని చారిత్రికవాదన బయలుదేరదీసి ఇండియన్ హిస్టారికల్ కాంగ్రెసులో ఒక వ్యాసము చదివెను. మీద నుదహరించిన శ్లోకము లక్ష్మణసేనసభామందిరద్వార శిలా ఫలకమున ఉన్నదాని గురించి శంకలేకపోలేదు. గీతగోవిందములో

"వాచః పల్లవయత్యుమాపతిధరః' (1. 4.) అన్నశ్లోకములో జయదేవుడే ఉమాపతిశరణ గోవర్ధన ధోయీశ్రుతధరులను సుపరిచితులుగా స్మరించి యున్నాడన్నది కూడా పూర్వపక్షములో పడినది. ఈ శ్లోకము క్షేపక మని రసికప్రియావ్యాఖ్యానకారుడు ఉటంకించినాడు; రసమంజరీ వ్యాఖ్యానకారుడు దీనిని స్తుతినిందగా నిర్వచనము చేశాడు. ఇట్లు సందేహాస్పదమైన ఈ ప్రతీతిని, ఈ శ్లోకాన్ని ఆధారపరచుకొనియున్నది నాటికలోని రెండోరంగము. ముఖ్యముగా గీతగోవిందశ్లోకములోఉన్న "స్పర్ధీకోపినవిశ్రుతః" అన్న ధీరవచనాన్నిగదా ఆధారముచేసుకొని నడిచింది ఆ రెండోరంగమందలి పండితసభాగోష్ఠి. ఆశ్లోకము క్షేపక మైతే, జయదేవుడు లక్ష్మణసేనలకు సంబంధములేకపోతే, నాటికకు ఆధారమైన చారిత్రికవిషయము కల్పితమైతే— నాటికగౌరవానికి హాని రావలసిన అవసర మున్నదని నేను వాదించలేదు.

'పద్మావతీచరణ చారణచక్రవర్తి' అనేనాటిక నామము జయదేవుడు పెట్టుకొన్నబిరుదు. ఈ బిరుదులోఉన్న పద్మావతిఎవరు? జయదేవునిభార్య అని ఒకరు, లక్ష్మీదేవి అని ఒకరు సమన్వయముచేసియున్నారు. పద్మావతి భార్యానామమేయని శాస్త్రిగారి వ్యాఖ్యానము. పద్మావతీపాదములచేత నృత్యము చేయించడముతో చక్రవర్తి. రెండో అర్థములో లక్ష్మీసేవకు లలో అగ్రజుడు జయదేవుడు; లేదా లక్ష్మీపాదములవద్ద నృత్యముచేయు వారిలో ముఖ్యుడు. చారణపదమునకు ఇష్టమువచ్చినట్లు అర్థముచెప్పనిచ్చే సంస్కృతభాషామహిమ అది. పద్మావతి భార్యానామ మెట్లో ఇష్ట దేవతానామముకూడా. జయదేవుడు తన జన్మగ్రామములో పద్మావతికి ప్రత్యేకాలయము కట్టించినట్లు ప్రతీతికలదు; ఈవృత్తాంతమును నాట కములో శాస్త్రిగారు ఉచితముగా ఉపయోగించినారు. భార్యపేరును ఉచ్చరింపకూడదనే సంప్రదాయమును పాలించాలనే పట్టుదలగలవారు లక్ష్మీపరంగా 'అర్థం చెప్పడానికి ప్రయత్నించారు. కుంభరాజు అనే వ్యాఖ్యానకారుడు ఈ ప్రాచీనసంప్రదాయాన్ని స్థాపించప్రయత్నించి తుదకు ప్రకారాంతముగా అంగీకరించాడు. ఈ శ్లోకములోఉన్న పద్మా

వతీపదానికి దేవత అని అర్థము చెప్పగలిగినా, కావ్యములో మరెండు చోట్ల కవి ఈనామాన్ని స్మరించిన స్థలములలో ఈ సమన్వయము కుదరదు. 'ప్రియే చారుశీలే' అనే 21వ అష్టపదిలో "జయతి పద్మావతీరమణ జయ దేవ ఫణితం" అని సగర్వముగా చాలా ఉచితముగా తనప్రియురాలి నామోచ్చారణ కవిచేసినాడు. కుంభరాజు ఈ సరసమైనపాఠాన్ని విడిచి పెట్టి, ఒక చప్పనిమాటలతో పాదపూరణముచేశాడు. రసమంజరీవ్యాఖ్యాన కారుడు మహామహోపాధ్యాయ శంకరమిశ్రో ఆ పిరికితనము చూపలేదు. మూడోస్థలములో ఉన్న పద్మావతీపదానికి లక్ష్మి అర్థము చెప్పిన కుంభరాజు వాస్తవమైన ప్రేమతత్వమును వెల్లడిచేయుటకూడా ఈ కవనముయొక్క ఆశయమై యుండవచ్చు. వాస్తవమైన ప్రేమపరాయణులకు అందులో తప్పు కానరాదు. నరాంతకుడు సత్యభామయెదుట నృత్యముచేశాడుగదా ! ప్రేమవంతులలో కృష్ణునిమించిన ఉదాహరణము లేదు.

సమాజ అనే పదానికి స్థానమనే అర్థాన్ని కల్పించాడు; ఆ అర్థము అతనికి ఏలాగు ప్రమాణమో విమర్శనీయము. మురారియొక్క మంగళ ప్రసాదాన్ని ప్రార్థించిన కవి జయదేవుడు తన భార్యతో కలిసి తనను స్మరించుకొనుట ఉచితము. శాస్త్రిగారు తమ నిర్వచనాన్ని స్థిరపరచి నారు త్వదీయ చరణచారణుం డని. పద్మావతి పరిశీలాత్మక కళలో నిష్ణాత. (52).

విహితపద్మావతీ సుఖసమాజే
కురుమురారే మంగళశతాని
భణతి జయదేవ కవిరాజరాజే.

ఇట్లు మూడుచోట్ల ఆదిని మధ్యను తుదిని ప్రబంధములో స్మరించిన పద్మావతీపదము నూతనరీతిని ధైర్యముతో నిర్మించిన జయదేవుడు లక్ష్మి అర్థముతో ఉపయోగించడని రసికు లందరూ ఏకగ్రీవముగా అంగీకరించవలసినదే. మనశాస్త్రిగారు అట్టి రసగ్రాహ్యు లని చెప్పనవసరము లేదు.

ఇట్లు భార్యానామోచ్చారణ చేయుటలో ఈ ప్రబంధకవి ఉద్దేశమేమో గదా! పద్మావతీనామము ప్రబంధము రెండో శ్లోకము రెండో పాదములో ఉన్నది. మొదటిశ్లోకము మంగళాచరణ శ్లోకము. రాధామాధవులను ఇష్టదేవతలుగాను, వారి రహఃకేళులు ఇతివృత్తముగాను కవి మంగళాచరణము చేయడము యుక్తమేగదా. వెనువెంటనే వాగ్దేవతను నమస్కరించినాడు: "వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తసద్మా." అది యుక్తమే. రాధామాధవ సరస్వతుల తరువాత తనభార్యను "పద్మావతీచరణచారణ చక్రవర్తీ" అని గంభీరముగా నుడివినాడు. ఆ తరువాత తిరిగి రాధామాధవులను ప్రబంధవిషయాన్ని కలిపి "శ్రీ వాసుదేవ రతికేళి కథాసమేతం" అని ఉచ్చరించినాడు. ఇట్లు భార్యను గౌరవించడము చాలా అసాధారణమైన నూతనసంప్రదాయము. ఇట్లుచేయుట ఆ గ్రంథాన్ని తనభార్యకు అంకితము ఇచ్చినట్లు అని, మనము ఇప్పటి సంప్రదాయము ప్రకారము నిర్వచనము చేయవచ్చు నని నేను మనవి చేస్తున్నాను. శివశంకరశాస్త్రిగారు వారిభార్యకు అంకితము ఇవ్వడము కేవలము పాశ్చాత్య సంప్రదాయ మని మనము నిరసింపనక్కరలేదు; జయదేవుడు (వారినాటికకుమూలము) చేసినదానినే వీరు అనుసరించినట్లు చెప్పవచ్చును. ధనాదులను ఇచ్చి పోషించే ప్రభువుకు అంకితము ఇవ్వడముకంటె ప్రేమను ఇచ్చి ప్రేమరూపమైన భక్తిని సుసాధ్యము చేసిన భార్యకు భక్తిరూపిగాభావించి, భక్తితో తన భక్తిగ్రంథాన్ని అంకితము ఇవ్వడము ఎక్కువ సరసమైనదని సహృదయులకు నొక్కి చెప్పనక్కర లేదుగదా. భార్యనామాన్ని ఉచ్చరించడము ఆర్యసంప్రదాయాన్ని ఉల్లంఘించడము కాదని చెప్పగలము. రాజశేఖరుడు తనభార్య అవంతి సుందరిని తన ఉద్గ్రంథమైన కావ్యమీమాంసలో మూడుమార్లు స్మరించి యున్నాడు. జయదేవుడుకూడా మూడుమార్లే చేశాడుగదా! ఈమూటిలో ఏమైనా ప్రత్యేకవిశేషమున్నదా ఏమిటి? జయదేవుడు తనభావములను సూచనపూర్వకముగా వ్యక్తపరచియుండగా రాజశేఖరుడు తనవాదమునకు ప్రమాణముగా (Support) "ఇతి అవంతి సుందరీ" అని చెప్పుకొన్నాడు.

ఆమె సాహిత్య విద్యావధు. రాజశేఖరునికి కావ్యమీమాంస జీవమైనట్లు జయదేవునికి భక్తిజీవము. భక్తిప్రదర్శనానికి వైష్ణవసంప్రదాయము సంగీతనృత్యములు. ఆ పాండిత్యము జయదేవుడు నేర్పించినాడనా? లేక ఆమెకు వివాహపూర్వమే కలిగియున్నదా? వాటికి ఉచితమగునట్లు ఆయన భక్తి, విద్య నడిచినవా? కావ్యమీమాంసలో అవంతిసుందరికి గల మీమాంస పద్మావతికి 'సకలలలితకలాభిజ్ఞ' అనేబిరుదును కవిఇచ్చాడు. సంగీతనృత్యములే కాకుండా సకలకళలలో పాండిత్యమున్నది. అన్నందుకు తగిన ప్రమాణమున్నదా అని ఒక సంశయము పుట్టవచ్చును. రాజశేఖరుడు అవంతిసుందరికి ఇచ్చినదానిని శాస్త్రిగారు వారి నాయికకు ఇప్పించి యుండవచ్చును. స్వారస్యము హెచ్చునుగాని తగ్గదుగదా!

ఏలాగైనా మూడుఅంశములుకూడా (పద్మావతి, జయదేవుడు, గీతగోవిందము) చరిత్రసంబంధమైనవి గీతగోవిందము ఇప్పటికీ ప్రచారములో ఉంది. దంపతులచరిత్రగురించు గాథ లున్నవి. జయదేవునిగురించి కొంతపురాణము, కొంత చరిత్ర ఉన్నది.

పూర్వము మనదేశములో స్త్రీలు కేవలము వంటకత్తెలుగానే ఉండలేదనుటకు ఇంతకంటె బలవత్తరమైన రుజువుకావలెనా? శాక్తేయసంప్రదాయములో స్త్రీ-ఉపాసన ఒక ప్రౌఢమార్గము. స్త్రీ పూజాప్రతిమ. ఈ స్త్రీ-అంశ (అనాదినుండి ప్రకృతి అనే బిరుదుతో వస్తున్నది) వైష్ణవ సంప్రదాయములో రాధారూపాన్న భక్తిలక్ష్యమైనది. "రాధికే" అని స్మరణ. కేవల స్త్రీసామాన్యసంబంధముకాక ప్రేమస్వరూపిణియైన ప్రియురాలి సంబంధమైనది. ఆ భావనలో దేవతాస్వరూపిణి. భార్యను భక్తిపూర్వకముగా ఆదరించిన శాస్త్రిగారు ఈ సంప్రదాయాలకు చెందిన వారని నా తర్కము.

ఈ నిరూపణంతా నాటికకుగల నామ సార్థక్యాన్ని, నాటిక యొక్క ముఖ్యభావ ప్రయోజనాన్ని నిర్వచించుటకు ఉపచరిస్తుందని నా అభిప్రాయము మొదటి అంకములో పద్మావతి నామోచ్చారణచర్చ,

రెండోదానిలో పద్మావతి చరణచారణుండు అనేబిరుదు, మూడోదానిలో ఆ పద్మావతీపాదములకు భూషణము — ఇట్లు మూడింటిలో పద్మావతీ సంబంధముగల ఈనాటికకు పద్మావతి పేరుపెట్టుట సమంజసమైనది. మూర్తిదాల్చిన యిష్టదైవతమవు(15) నీవు నాకు ఉత్సాహమివ్వకున్న 'కావ్యమెట్లు చేయగలుగువాడ'. గీతగోవిందమహిమను జయదేవునికి కంటె అధికముగా పద్మావతికి అన్వయింపజేసిన శాస్త్రి సహృదయ సరసతను పాఠక విమర్శకులు గమనించవలసియున్నది. ఇది వారి స్వంతభావన, స్వతంత్ర కల్పన. స్త్రీకి అర్థనారీశ్వరభావనలోను, ప్రకృతి సృష్టికల్పనలోను, రాధికాప్రేమలోను, శాక్తేయ సంప్రదాయములోను వ్యక్తమయ్యే అసాధారణౌన్నత్యమును మానవజీవితనిర్మాణములో ఈ శాస్త్రిగారి కల్పన సూచిస్తుంది. 'ఆదిపద్యము పాడినయంతనె' పద్యంకూడా పాడడమనే శాస్త్రిగారి నిర్వచనము.

ఉభౌతౌ దంపతీతత్ర ఏకప్రాణౌ బభూవతుః
నృత్యంతౌ వాపి గాయంతౌ శ్రీకృష్ణార్జున తత్పరౌ॥

అని పద్మావతీ జయదేవులగురించి ఒక గాథ కలదు. ఆధునిక యుగములో సర్వాంగీకారము బొందుచున్న స్త్రీ గౌరవ భావము శాస్త్రిగారు వారి నాటికలో చాలాసున్నితముగా సూచించారని చెప్పవచ్చును.

పట్టపుదేవి సభకు వచ్చి గీతగోవిందాన్ని మెచ్చుకొని బహుమతి నిచ్చినది. అందువలన ఆమెకుగల పాండిత్యపక్షపాతము, కళాభిరుచి వెల్లడైనవి. స్త్రీలయెడలగల గౌరవసూచకములో ఇదొకటి. దేవి రసజ్ఞురాలు, కవితానిపుణురాలు, దేవభాషాభిజ్ఞురాలు. పద్మావతీజయము స్త్రీగౌరవము. చతుష్పాది వ్రాసింది ఆమె. 'బహుమానములనెల్ల పరికించునెడల నిజముగా నీనాడు నీకెజయమ్ము.' 'భార్యకొసంగుచో... భర్తనుగూడ సంభావించినట్లె.' అట్టి దాంపత్యములోనే గాక కళాప్రతిపత్తిలో కూడా భార్యకుగల స్థానము స్త్రీకి ఒసంగే గౌరవము స్పష్టమయింది.

భార్యానామోచ్చారణ చేయగలిగిన గాంభీర్యము గలిగిన జయదేవునిచే ఆ సాహసము జరదంబపే రని సమాధానము చెప్పించుట ధీరో

దారుని ఉచ్చకు లోపమువచ్చినది. జయదేవుడే ఆశ్లేషచేసి, సుధామాధుర్యానికి భార్యనామముగాను, విమర్శకుల శాంతికి జగదంబపేరుగాను తప్పించుకొనుటకు ప్రయత్నించినటుల వర్ణించడము పాత్రశీలానికి లోపము వచ్చినట్లైనది. రెండుసమాధానాలు ఒక్కమారే వ్యక్తమైతే ఏది జయదేవుని కల్పనోగదా!

సభలో భార్య పేరును ఉచ్చరించి, ఆమె నృత్యకౌశలము కొనియాడితే లజ్జ యెవరిదోగదా. సభలో నిలుచున్న ఆ వక్తకా? సభలో ఉచ్చరిస్తారని భావనచేసే గృహిణికా? జగదంబ నామోచ్చారణ వలన పవిత్రత వస్తుందనీ సర్వాంగీకారమే. విమలప్రేమావతార మైన భార్యా నామోచ్చారణవలనే అరజమురాలుట చెప్పకూడదా ఈకవినిరంకుశత్వము అని నాప్రశ్న. నాకు ప్రాణేశ్వరికి మూర్తిదాల్చినట్టి యిష్టదైవతము. భార్యను ఇష్టదేవతగా రూపించే శాక్తేయవైష్ణవ సంప్రదాయ మున్నది. తనను గౌరవించుటకు తన ఇంటివరకూ వచ్చిన పండితులను సత్కరించి (మేడయిల్లుగదా) తనకు అసమానమైన బిరుదును, అమూల్యమైన బహుమతులను తెప్పించిన పద్మావతిని ఆ పండితులకు ఎరుకపరచుట, ఆమె గాననాట్యకౌశలమును వారికి విశదపరచుట సమంజసముగాను, ఆమె గౌరవమునకు దానిద్వారా స్త్రీ గౌరవమునకు అవకాశ ముండియుండును గదా. కవిగారు అలాగుచేయక ఎపుడు నిన్ను చూడగల్గుదును అనే చిన్న భావమును ఉపయోగించి కథ నడిపెను.

ఈ నాటికరచనలో ఉండే క్రొత్తదనము తెలుసుకొనడానికి నాటికయొక్క ఇతివృత్తమును, దానిని నిర్వహించినవిధానాన్ని విమర్శించాలి. నాటికకు ఇచ్చిననామధేయమును బట్టి ఇతివృత్తమును ఊహించలేము. పద్మావతీచరణచారణ చక్రవర్తి అయిన జయదేవుని చరిత్ర ఇతివృత్తముకాదు. పోనీ; ఆ బిరుదురావడానికి కారణమైన నృత్యకౌశలము కూడా ఇతివృత్తముకాదు. జయదేవుని గీతగోవింద ప్రాశస్త్యము ఇతివృత్తముగా అంగీకరించాలి. ఆ ఇతివృత్తాన్ని నిర్వహించడము, కథనము ద్వారాగాని, వర్ణనముద్వారాగాని గాక, విమర్శద్వారా ఎక్కువగా

నడిచింది. కవి గీతగోవిందముపై విమర్శపూర్వకమైన వ్యాఖ్యానాన్ని నాటికరూపముగా వ్రాశారని దానికి సమన్వయము. ఈ వ్యాఖ్యయొక్క ప్రయోజనము కవికి గల అపరిమితగౌరవాన్ని వెల్లడిచేయడమే.

నాటిక ఒక విమర్శనము. ప్రథమరంగము చర్చతో ప్రారంభ మైనది. పద్మావతి చేసిన పూర్వపక్షానికి జయదేవుడు సమాధానము చెప్ప ప్రయత్నించినాడు. రెండోరంగమంతా కావ్యసమీక్ష. పండితులలో కొందరు పూర్వపక్షముచేస్తే, మరికొందరు ప్రత్యుత్తరము చెప్పారు. మహారాజు జయదేవునికి బహుమతులు ఇచ్చి గౌరవించాడు. మూడోరంగములో చర్చ లేకపోలేదు. కాని కథనము ఎక్కువగా ఉంది. పరాశరుడు ఒకమారు, జయదేవుడు మరొకమారు రాజు బహుమతులు ఇవ్వడము గురించి బహుమతులను వర్ణిస్తూ కథ చెప్పారు. చర్చ ఆ బహుమతుల ధారణవిషయమై ప్రారంభమైనది. నూపురాలను జయదేవుడు భార్య పాదములపై స్వయముగా తనహస్తములతో ఉంచవచ్చునా? అని చర్చ విషయము. జయదేవునికి కలిగినగౌరవము, ఇచ్చినబహుమతులు ఆ భాగాలను విడిచిపెట్టితే, నాటికఅంతా చర్చలతోను విమర్శనలతోను నిండినదని చెప్పవచ్చును. గౌరవమూ, బహుమతులూ, చర్చలూ అన్నీకూడా గీతగోవింద ప్రాశస్త్యము చుట్టూ ఆవరించుకొనియున్నవే కాబట్టి ఇతివృత్తము గీతగోవిందస్తుతి అని మనవి చేసినాను.

ఈ చేసినచర్చలుకూడా గీతగోవిందమును స్తోత్రపాఠము చేయడానికేగాని చర్చలుసరిగ్గా నడిచెనా లేదా అనే విచారము కవిగారికి ఉన్నట్లుతోచదు. ఎందుచేతనంటే ఉపపాదించిన పూర్వపక్షాలకు తగిన సమాధానము రాలేదుగాని చర్చ ముగిసిపోయింది. అట్టిచర్చ గురించి చదువరులు ఊహించవలసిన దేమిటి? చర్చ కనబడాలనిగాని, సరియైన వాదప్రతివాదాలు ఉండాలనికాదు. చర్చ అనేరూపము దాల్చి స్తోత్రముచేయడానికి ప్రయత్నము నిజభార్యపేరు కావ్యములోచేర్చుట దోష మని పద్మావతిచేసిన ప్రబల పూర్వపక్షానికి తగిన సమాధానము రాలేదు, [రహస్య క్రీడలలోనే ఉచితముగాని] తనివితీరను, వైభవము

ఒదవును. భార్యానామోచ్చారణ చేసిన ఇతరులు ఉన్నారు, అని ప్రత్యుత్తరము. ఇదేదీ కుదరకపోతే "కవులు నిరంకుశుల్ స్వేచ్ఛలోనే వారి జీవనంబు" అని దోషాన్నే ఛేదించ ప్రయత్నము. స్వీయనామకీర్తనము వలన సిగ్గు అవుతుందంటే "నీకీర్తి శాశ్వతముగా నిలుస్తుంది, నీవు నాకు ఇష్టదైవతము" అనిప్రత్యుత్తరము. వాదమునకు తుదిలేనపుడు పరాశరుడు వచ్చి దానికి అడ్డుపెట్టగలిగినాడు. నిజభార్యా నామోచ్చరణదోషము కాదని నిశ్చయమైనదా?

మరొక ఉదాహరణ చూడండి. ఈ నవ్యకావ్యము ఏ శ్రేణిలో చేరునని చర్చలో మూడు అసమానపోటీలు చూపబడినవి. నిండురూపకము, సంపూర్ణశ్రవ్యకావ్యము, గేయకృతి అని. రూపక కావ్యాలకు ఉన్నట్లు గేయకృతికి విశేషము ఏదిన్నీ లేదు. రూపక శ్రవ్యకావ్యాల లక్షణాలనుగురించి సంపూర్ణత్వము చర్చకు విషయము. కాబట్టి ఉమాపతి ప్రత్యుత్తరములో చెప్పినట్లు ఏగుణము హెచ్చుగాఉంటే ఆగుణమును అనుసరించి పేరువచ్చుననే సమాధానము కుదురుతుంది. పూర్వపక్షములో దృశ్యత్వ శ్రవ్యత్వ గేయత్వములు మూడుగుణములు సమానమైన పోటీలుగా పేర్కొనక, "నిండు" "సంపూర్ణము" అనే విశేషణములతో రెండింటిని సామాన్యముగా ఒకదానిని చెప్పుటచేత ఏమాత్రము గానమున్నా గేయకృతి కాగలదు అని స్ఫురిస్తుందా? ఇంతకూ గానములు ఇరువదినాలుగు మాత్రమే. పద్యములు 93 గల గ్రంథములో గేయగుణము "హెచ్చుగా" గాన్పించుచున్నదా? కాబట్టి "ఈ మహాకావ్యంబు నందు గేయగుణము తుందిలంబు" అనుయుక్తి ఏలాగు కుదురుతుంది? ఇంతకూ గేయగుణము శ్రవ్యత్వదృశ్యత్వముల వలె లేక, ఇతరకావ్యలక్షణాలవలె కావ్యానికి లక్షణగుణమా? విక్రమోర్వశీయములో గానముఉన్నంతమాత్రాన దానికి గేయరూపక మన్న సంజ్ఞవచ్చినదా? సంస్కృతనాటకాలని ప్రదర్శించేటప్పుడు వాటిలో ఉండే పద్యాలను పాడేవారు అని [ ఇప్పుడు తెలుగునాటకాలలోని పద్యాలవలె ] రుజువులేదు. కొన్నిపద్యాలను పాడవలెను అనేసూచన

ఉండడమువల్ల గానము వాటికిమాత్రమే అని ఊహించవలెను. కేవలము పాటలే గ్రంథముగా ఉన్న అధ్యాత్మ రామాయణకీర్తనములు కావ్య సంజ్ఞలో చేరనందున గీతగోవింద కావ్యప్రాశస్త్యమునకు కారణము దానియందున్న పాటల మహిమ కాదనిన్నీ, శ్లోకములలో ఉన్న గుణ సంపద అనిన్నీ చెప్పగలము. సంస్కృతవాఙ్మయములో గీతగోవిందానికి పూర్వము గీతగ్రంథములుఉండేవా అనేప్రశ్నకు నాకు తగిన సమాధానము దొరకలేదు. సామవేదము ఉదాహరణముకాదా అని తర్కించవచ్చును. ఖిలములైనవి ఉండియుండవచ్చుననే సాక్ష్యము సమంజస మైనదికాదు. రామాయణము పాడినారనేగాథ "మానిషాద" అనే కథ సరిపడునా ఈ వాదానికి తగినసాక్ష్యముగా ?

నాటకములోని చర్చ సరియైన విమర్శనకొరకు కాదు. "వివరము లను కొన్ని విద్వద్వినోదార్థ మడుగదలతు" అని నీలకంఠమఖి సెలవిచ్చి నట్లు చర్చ వినోదముకొరకు జరిగింది. మహారాజు మొదట అడిగిన ప్రశ్న కూడా అట్లే ఉండెను. "కావ్యగానంబులు మీ కేవిధముగ రుచియించెనో" మా కెరింగించవలెను. అని అతని ఆజ్ఞ. రుచియించెనో అని. ఆతరువాత నీలకంఠమఖి కావ్యవిమర్శ చేయబూని "ఈ కవిప్రకాండు డెంచకున్న" అని క్షమాపణపూర్వకముగ ఉపోద్ఘాతము చెప్పగా అప్పుడు మహారాజు "సంకోచము వీడి విమర్శ చేయంగదగును" అనెను. ధైర్యముచాలలేదు నిష్కర్ష విమర్శనకు. గానపారవశ్యులైనారా? కావ్యరుచి కూడా అట్టిదే వాస్తవముగా. మొదటి వ్యాఖ్యాన విమర్శనలు చేయబూనిన శివశంకరశాస్త్రిగారు గీతగోవిందపరవశులై యున్నారే! అట్టి సందర్భములో వినోదార్థము కాక మరొకతీరున జరగదు. గీత గోవిందమును అందరమూ గౌరవిస్తాము సరే. వినోదార్థమైనా చేసిన పూర్వపక్షాలకు సమాధానము సరిగ్గా ఉండకపోతే విమర్శనకు చిక్కు వస్తుంది.

"ఏల చేరవలయు నే శ్రేణిలో నైన?"
"ప్రతి కవీంద్రురచన ప్రత్యేకమై యుండు."

ఏ గుణంబు హెచ్చుగానుండు దానివలన నొదవు నాఖ్య. ఆఖ్య శ్రేణివాచకమా లేక ప్రత్యేకముయొక్క సంజ్ఞా? గేయకృతి అనేది శ్రేణిలో చేర్చలేదా? "కూడు నన్నిగతులు కొన్నియెడల" అని ఉమాపతిగారి సూత్రములోని గతు లా నీలకంఠమఖిగారి పూర్వపక్షములోని రచనాశ్రేణులు. గీతకవి అని ఏ శాస్త్రకారుడు చెప్పినట్లు గానరాదు. ఈ విషయమును విపులముగా చర్చించిన రాజశేఖరునిది కూడా రచన కవి అని చెప్పినవారు గీతకవి అని చెప్పలేదు. ప్రతి కవీంద్రుని రచన ప్రత్యేకమై యుండునని ఉమాపతిగారు వాదనకు అన్నారుగాని జాతిలేని వృత్తులు ఉంటవా? మూడుశ్రేణులలో పేర్కొనబడిన గతులు మూడు రచనవిషయమై సమానమైన ప్రాముఖ్యముగలవా? గానము శ్రవ్యకావ్యాలలో కొద్దిగానైనా ఉంటుందా, ఉండాలా? వ్రాసిన శ్లోకాలను పాడవచ్చునని సమాధానము చెప్పుకొందామంటే ఈమధ్య ఒక సంగీత సాహిత్యవిద్వాంసుడు గద్యనుపాడి చూపించాడు. సంగీతము జగత్తంతటావ్యాపించి లీనమైయున్నదనీ, అలాగువాదన కుదుర్తుంటే స్వతః విరోధులైన శ్రవ్యదృశ్యత్వగతులు ఒకచోటను ఇమడడమెట్లు? అది కుదర్చవచ్చునంటే దృశ్యశ్రవ్య భేదము అసత్యమన్నమాట. కాబట్టి (పూర్వపక్షము) మూడుభిన్నశ్రేణులనేది తప్పు. ఇట్లు వాదప్రతివాదాలతో నిండియున్న చర్చను ఉమాపతిగారి సమాధానముపై నీలకంఠమిశ్రగారిచేతగాని, వారి వాదావలంబకులైన మరియెవరిచేతనైననేమి ఆక్షేపణములు శాస్త్రీగారు చెప్పింపలేదు.

అష్టాదశకావ్యలక్షణములులేనిది సుకావ్యముకాదని పూర్వపక్షమైతే, గర్భితముగ ఆవర్ణనలు ఉన్నవని ప్రత్యుత్తరమిచ్చినపుడు, పూర్వపక్షమందున్న సూత్రాన్ని అంగీకరించినట్లుకదా. ఏమాత్రమూ సూచనైనాలేని కొన్నిలక్షణాలని ఎంచి, అవి యెక్కడ గర్భగతమైయున్నవి చూపమని పూర్వపక్షీకుడు అడగవలసియుండెను. అలాగుకవి అడిగించలేదు!

వృత్తాలు గీతాలకంటె ఉత్తమములని చందశ్శాస్త్ర మర్యాదగదా అంటే వృత్తాలనుకూడా పాడవచ్చును, పాటలను వృత్తాలవలె చదవవచ్చును

అనిన్నీ, రాగతాళములతో వృత్తాలను చదివితే ఎక్కువరక్తి కట్టుననిన్నీ ప్రత్యుత్తరము.

పూర్వపక్షము బలహీనముగా చేయించి, ఆపూర్వపక్షసూచిత దోషానికి సరియైన జబాబు చెప్పించకుండానే పూర్వపక్షము విరమిస్తే అట్టి చర్చ తత్వవిచారణకొరకు కాదనిన్నీ, కేవలవినోదమునకే అనిన్నీ చెప్పనక్కరలేదు.

శార్దూలవిక్రీడితాది పదములను శ్లోకములో ఇమడ్చకూడదనే శాస్త్రముప్రకారము దోషముచూపిస్తే బాగాయుండియుండును. నాటకములో దనసామోచ్చారణ అనుచితమన్నట్లు ఈపూర్వపక్షము కుదురును. అలాగుగాక రెండు అర్థాల పదాలనువాడడము దోషమంటే ఏలాగు కుదురుతుంది? రెండుఅర్థములు ఇచ్చేటట్లు అక్కడక్కడ పదాలను వాడడము కావ్యగుణముగా భావించే సందర్భములో దోషముగా పూర్వపక్షము ఉపపాదించిన వామదేవదీక్షితుని ఏమనవలెనో. ఆ ఉమాపతిచేత ఆగుణప్రశంస చేయించడానికేనా?

మొదటిరంగములో పద్మావతి శంకించిన అంశముగురించి భర్త సభనుండి రాగానే అడుగుట సహజముగదా! నిజముగా పద్మావతి మనస్సును ఆశంక బాధిస్తే విజయుడైవచ్చిన భర్తను స్వరభంగము కాలేదుగదా అని ప్రసంగించింది.

అన్నీ ఏడు పూర్వపక్షాలు. పండితులందరూ తొమ్మండుగురు మహారాజు జయదేవునితోకలిసి. ఏపూర్వపక్షానికైనాసరే జయదేవుడు జవాబుచెప్పలేదు. మధ్యస్థుడు మహారాజు. పూర్వపక్షాలు ఏడు వాదమున నడిపినవారుఏడుగురు. వారిలోనలుగురు ఉమాపతి, శరణమిశ్రుడు, గోవర్ధనాచార్యుడు, ధోయీ పూర్వపక్షాలను పరిహరించారు. ఉమాపతి రెండింటికి మాత్రము ప్రత్యుత్తరమిచ్చాడు; రెండుమార్లు మాట్లాడినాడు. ఆరు వాక్యాలలో (సూత్రప్రాయముగా) క్లుప్తముగా పంద్రెండు పంక్తులలో అతని సిద్ధాంతవచనాలను పొందుపరచాడు. శరణమిశ్రునిది అదే విధము. ధోయీ ఆలాగే అని చెప్పవచ్చును.

గోవర్ధనాచార్యుడుమాత్రము ఒక్కదానికే ఒక్కసారే ప్రత్యుత్తరమిచ్చాడు. కాని వీరి ఇద్దరికంటె ఎక్కువగా మాటలు చెప్పి సిద్ధాంతపరచెను. కాని పూర్వపక్షముచేసినవారు ముగ్గురు. నీలకంఠమఖి, వామదేవదీక్షితుడు, మహేశ్వరభట్టున్ను. మహేశ్వరభట్టు ఒక్క పూర్వపక్షము నీలకంఠమఖి రెండు చేశారు. వామదేవదీక్షితుడుమాత్రము నాలుగుపూర్వపక్షాలు ప్రతిపాదించాడు. నీలకంఠమఖి ప్రారంభించాడు ఈచర్చ. మహేశ్వరభట్టు వామదేవులు సభాప్రారంభాన్ని జయదేవునిగానమహిమను, ఇట్టి సంగీతరీతులు మేము వినలేదు అనిన్నీ, మ్రోగుచున్నది ఆ గానమధురకళలు అనిన్నీ, ఈ అష్టపదులపాట కెపుడు ఈ జగత్తులో లోటురాదు అనిన్నీ చాలాగంభీరముగా కొనియాడారు. ఈ స్తోత్రపాఠము నీలకంఠమఖిని సూదితో పొడిచినట్లు అయిందికాబోలు. కావ్యానికి గానానికి సంబంధమేమిటోగదా. గాయకుడు బాగాపాడినంతమాత్రాన కావ్యదోషాలుపోతాయా? ఈకవిప్రకాండుడెంచకున్న "మహారాజు అజ్ఞఅయ్యేనేని" అని క్షమాపణలుచెప్పుకుంటూ యేవో కొన్ని కావ్యదోషాలు చూపిస్తానని ఉటంకించాడు. వీరి అందరిలో వామదేవమహేశ్వరభట్టులలో ఒకచిత్రమున్నది. పండితులఅభిప్రాయము చెప్పడానికి మొదటివాడు మహేశ్వరభట్టు. గానాన్ని కొనియాడేడు. ఆ అభిప్రాయముచెప్పడములో ఏమాత్రము కావ్యగుణముగురించి ఉచ్చరించలేదు. నీలకంఠమఖికూడా గానాన్ని కొనియాడినా, కవులు గాయకులుకూడా అని భావించిన్నీ కావ్యదోషసూచనచేశాడు. కాని కావ్యదోషచర్చ ప్రారంభించగానే, కావ్యప్రాశస్త్యమును విజృంభించవలసినవాడు (గానామృతమునుగ్రోలి జ్వరము వాపు కొన్నవాడుగదా) పూర్వపక్షులకోటిలో చేరాడు. ఇంత పూర్వపక్షము నడిపిన మహేశ్వరభట్టు చర్చ ప్రారంభించినట్లే ధైర్యముగా ముగిస్తూ—

'భక్తులకు రసికులకును పండితులకు
కవివరేణ్యుల కిది మహాకావ్యమగును'.

అని ధన్యవాదముచెప్పినాడు. ఒక్కకవికే సంతోషముకలుగజేసి విరమించేమనిషి కాదుకాబట్టి రాజుకూడా సరసముగా—

దేవ! మీకవుల్ విక్రమాదిత్యహర్ష
ధరణిపాస్థానకవులకు తగ్గిపోరు.

అని మహారాజును పొంగవేశాడు. ఇంతదూరము వెళ్ళలేకపోయినా మిగిలిన ఇద్దరు పూర్వపక్షీకులున్నూ సరసముగా ముగింపుమాటలు ఆడినారు. (వామదేవదీక్షితుడు వరుసగా నాలుగు దృఢమైన పూర్వపక్షాలతో సభను కదల్చినవాడుకూడా. పూర్వపక్షాలన్నీ వీగిపోయినవనే సూచనతో "శ్రుణుతదా జయదేవసరస్వతీమ్" అని మహేశ్వరభట్టు ధన్యవాదాన్ని అనువదించాడు. తాను చేసిన పూర్వపక్షము ఆరంభమందు చెప్పినట్లు నిజముగా విద్వద్వినోదార్థమే అని స్థిరపరచును. అన్నట్లు "జయదేవస్యవైదగ్ధ్యవాచః" అని ప్రథమధన్యవాదాన్ని అనువదించాడు.

జయదేవుని కావ్యప్రాశస్త్యమును సిద్ధాంతపరచిన నలుగురున్నూ జయదేవునితో కలిసి ఐదుగురు లక్ష్మణసేనుని సభాకవిరత్నములు. వీరిని వర్ణిస్తూ జయదేవుడు గీతగోవిందములో కవి వర్ణనచేసినాడని ఆ విఖ్యాత శ్లోకాన్ని మహారాజుసభలో చదివి, తన కవిపోషణశీలాన్ని సగర్వముగా విశదపరచుకొన్నాడు. మహేశ్వరభట్టు ఈ రత్నములలో ఒకడు కాడు. కాబట్టే అతనికి స్థానము పూర్వపక్షకోటిలో దొరికింది కాని సిద్ధాంతకోటిలో కుదరలేదు. అతనిముఖ్యాభిప్రాయము గీతగోవిందప్రాశస్త్యమే అయినా పూర్వపక్షము చేయక తప్పిందికాదు. ఈ పండితుడు సాంకేతముగా లక్ష్మణసేనునికూడా జయదేవగీతగోవిందముల స్తుతిసందర్భములో అతనిపాండిత్యాభిమానానికి కొనియాడుచూ, విక్రమాదిత్యహర్ష ధరాధిపాస్థానములతో సరిపోల్చగానే మహారాజు సగర్వవినయపూర్వకముగా తన సభాకవిరత్నములకు అభివందనవందనములా అన్నట్లు 'వాచః పల్లవయత్యుమాపతిః' అని జయదేవుని శ్లోకాన్ని చదివినాడు.

చర్చ వినోదార్థమే అన్నదిస్థిరపడింది. జయదేవుడే అనుప్రశంస తననుతాను కొనియాడుకొన్నవి ఈ శ్లోకాలన్నీ. వీటిలో అన్నిటిలోను జయదేవుని నామోచ్చారణముఉన్నది. మరియొకడు చెప్పినట్లు కనిపిస్తవి.

'వాచః పల్లవయతి' అనేశ్లోకము ప్రక్షిప్తమనే వాదనను అనువదించేయున్నారు. ఉన్నశ్లోకాలుకూడా అట్టివే అన్న సందేహ మున్నది. రస మంజరీవ్యాఖ్యానకారుడు వాటికి వ్యాఖ్యానము చేయలేదు. గీతగోవింద ములో రసము నిండుగా ఉన్నట్లు ఇందులోలేదు.

పూర్వపక్షము చేయడము. అందుచేత కావ్యగుణములను ప్రత్యుత్తర ములద్వారా వెల్లడిచేయుటకే వ్యాజనింద, నిందాస్తుతిన్నీగదా. అబల వాదించలేక రక్షణవేడుకొన్నది. వైదుషియైన పద్మావతికూడా స్త్రీస్వభా వాన్ని అతిక్రమించలేక శరణ అన్నది. అద్యస్త్రీగదా ఇంతకు! ఆమె శరణఅంటె అతడు ఇష్టదైవత మన్నాడుఅని చర్చతీర్చును. ప్రేమ ప్రకట నముచేయడము సమంజసముకాదని పద్మావతిఅంటే, కవులు నిరంకుశులు అని ప్రత్యుత్తరము. ఈచర్చవలన పరస్పరభావములు వ్యక్తమయినవిగాని సమాధానము కుదరలేదు. లజ్జ ప్రకటన నౌచిత్యము. స్త్రీ హృదయము ప్రేమ పవిత్రత, కవిస్వాతంత్ర్యము ఆశయము.

అన్ని పూర్వపక్షాలకంటె బలవత్తమమైనది మహేశ్వరభట్టు రెండోమారు చేసిన ఆక్షేపణ.

'విశ్వంఖలరీతిని రతిని వర్ణించు కతమున
రక్తిహెచ్చదే దేహముపయి'

అని, ఇక్కడకూడా జబాబు గట్టిగా చెప్పడానికి వీలుఉండడానికి పూర్వపక్షమును అలాగుచేయించారు శాస్త్రిగారు. దేహనిరసనకాదు పూర్వపక్షులు కోరేది. కేవలకాయికమైన రతిని పచ్చిమాటలలో వర్ణించడము అనుచితముకాదా? కావ్యగుణాపేక్షయా? ఈ పచ్చికాయిక శృంగారరతిని సమర్థించ ప్రయత్నించినందుకు శాస్త్రిగారిని నేను అభినందించలేను. వారు వారి కావ్యాలలో ఎక్కడా అలాగు వర్ణనలు చేయలేదని నాజ్ఞాపకము. దానిని వారు ఆమోదించ లేదన్నందుకు అవే బలమైన సాక్ష్యము. జయదేవునియందుగాని, గీతగోవిందముపైనిగాని, వారికిగల గౌరవమును కాపాడుకొనుటకు ఈ చర్చ వారు మానివేయవలసి

యుండును. వారిభక్తి వైష్ణవభక్తి కావచ్చును. కాని మహేశ్వరభట్టు యొక్క ఈ పూర్వపక్షానికి గోవర్ధనాచార్యునిచేత చెప్పించిన జవాబులో శాస్త్రిగారి అభిప్రాయములుగదా వ్యక్తమవుతవి? ఒకతీరున వేదాంతార్థమైన జీవేశ్వరులు రాధాకృష్ణులనే విగ్రహరూపులుగా వర్ణింపబడినవని ఈ శృంగారైక్యమునకు భాష్యము వ్రాసినా ఆ Allegory ని సర్వత్ర గ్రంథవర్ణనలలో పాలింప శక్యముకాదు. రతికేళీవివరములు, వర్ణనలు అనవసరములు. జీవబ్రహ్మలకు వర్తించవు. కేవల సంభోగశృంగార కావ్యమేకాదు. ఏ తారాశశాంకమువంటిది కాదని చెప్పవచ్చును. "యద్గాంధర్వకళానుకౌశల..."

భక్తికి ఆధ్యాత్మికతత్వానికి పచ్చిశృంగారము సాధనమా? భక్తికి రతివర్ణనములు ఆవశ్యకములా? ఈ రతివర్ణనలో మునిగితేలే సాధకుడు భక్తిని సులభముగా సాధిస్తాడా? జయదేవుడు భక్తివివశుండై ఈ రాధాగోవిందలీలలను వర్ణించాడా అనే జబాబు జయదేవుని చరిత్రసంబంధమైనది. కావ్యౌచిత్యమును పరీక్షించే వ్యాఖ్యానకారునికి ఈ రతివర్ణనలు ఎట్లు రుచిస్తవి? ఎట్లు కావ్యరసపోషకములు అవుతవి? అనేదిప్రశ్న. "మనుష్యరతివర్ణనమును దివ్యచరితము వినంగనేలాగుకల్గు వికృతి" అని గోవర్ధనుచేత శాస్త్రిగారు చెప్పించారు. ఇది శాస్త్రిగారి నిశ్చితాభిప్రాయమా అని నేను అడుగుతున్నాను. "రసికప్రవరులకెల్లన్ రసాపకర్షకముకాదు రతివర్ణన" అని శాస్త్రిగారు ఒక సూత్రాన్ని నిర్మించారు. నిజమే. మనదేశపు వాఙ్మయములో, సంస్కృతములోకూడా రతివర్ణనను కాళిదాసాదిమహాకవులు చేశారు. రతిసంబంధమైన శరీరాంగములను విచ్చలవిడిగా వర్ణించారు. కాని వారిని మించినారు ఆంధ్రకవులు కొందరు పచ్చికాముకరతిని వర్ణించడములో. కాని, ఆధునికవిమర్శకులైన శివశంకరశాస్త్రిగారు ఇతరదేశ వాఙ్మయములతోను, రసికుల ఆదర్శములతోను పరిచయముగలవారు. రసికప్రవరులని సామాన్య వాచకము వేయడము న్యాయముకాదు. బూతులుకూడా రసాపకర్షకము కాదనివాదిస్తే ఏమి జబాబు చెప్పగలము? గ్రీసు, ఇటలీదేశాలలో పూర్వ

కాలమంతు [రాధాగోవిందుల లీలలవర్ణనము శక్తిసాధనముగా సమర్థిస్తే అడగవలసిన దొకటి గలదు. రాధాగోవిందులలీల లన్నీ కాయికరతి విన్యాసములేనా? అంతకంటె ఉచితముగా వర్ణించగలిగే లీలలు లేవా? ఉన్నతప్రేమ విశేషములు కాయికరతిలీలలా?] శృంగారవిహారాలు సలుపుతూ ఆనందించే యువకులగీతాలుగల కావ్యాలు చాలామట్టుకు ఇప్పుడు మనకు లభిస్తవి. వాటిని విమర్శిస్తే కాయికరతి వర్ణనాచిత్య సంబంధములో బాగా ఉపచరిస్తుందని శాస్త్రిగారికి మనవిచేస్తూన్నాను. వాస్తవముగా నాచర్చకు ఈభక్తివాదము కాని అధ్యాత్మిక నిర్వచన సమాధానముగాని అనవసరము. కొంతవరకైనా భక్తి భావోద్రేకసంబంధమైనదగుటచేత కావ్యలక్షణాలకు కొంచెమైనా దగ్గరగా ఉండగలదని ఇంతవరకు స్మరింపవలసివచ్చింది. కాని ఆధ్యాత్మిక తత్వచర్చ, జీవేశ్వరైక్య విచారము అప్రస్తుతము. కాని తిరిగినాకు అవకాశము దొరకదనే సంశయమువల్ల ఒక్కప్రశ్నమాత్రము వేసి ఈవిషయము విడిచిపెట్టెదను.

"ఎరుకగలవారలందురు। శరీరమాద్యంబు ధర్మసాధనమని త
ద్వరవాక్యంబును మెచ్చని। విరాగులకుదేహమన్న విసుగుకవీశా"

అన్న వేమన్న వాక్యానికిన్నీ, "ఈకృతితాత్పర్యం బెసంగు జీవేశ్వరైక్యమే తలపోయన్" అన్నసమాధానానికిన్నీ స్వవిరోధములేదా? జీవేశ్వరైక్యముచెప్పే వేదాంతతత్వవాదులు శరీరముఖ్యతను అంగీకరిస్తారా? కావ్యవర్ణనలను విడిచిపెట్టి మాట్లాడేటప్పుడు అడగవలసినది ఏమంటే, భక్తివివశు డన్న జయదేవుడు శరీరముఖ్యత గమనిస్తాడా అని. "శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" అనేదిన్నీ జీవేశ్వరైక్యమున్నూ స్వవిరోధులు. అంతేకాకుండా వైష్ణవసంప్రదాయక భక్తివాదులు జీవ-ఈశ్వర-ఐక్యాన్ని అంగీకరిస్తారా? శివశంకరశాస్త్రిగారు వేదాంత తత్వచర్చ జేయడానికి ఆవాక్యాలు వ్రాయలేదు నిజమేగదా! కావ్యపరులైన రసికులకు ఈ ఆధ్యాత్మకతత్వచర్చ ఇప్పట్టు లెందుకుగదా అని నావిచారము.

ఈ సందర్భములో ప్రసిద్ధజగన్నాథపండితుడు రసగంగాధరములో చేసినతీర్పు క్లుప్తంగా వ్రాస్తాను.

గీతగోవిందము దైవభక్తిని వ్యక్తపరుస్తుంది. శృంగారరసమును, రతికేళులను, సంభోగవిలాసములను భక్తిపరముగా సమన్వయించడము వైష్ణవ సంప్రదాయమైనది. ఇట్టి వర్ణనలు రసమునకు అనౌచిత్యమును ఆపాదిస్తవని జగన్నాథపండితుడు రసగంగాధరములో గీతగోవిందాన్ని స్మరిస్తూ విమర్శించినారు. ఆధునికవిమర్శకులుకూడా ఆధ్యాత్మిక సంబంధాన్ని శారీరకసంభోగ కౌచిత్యము ప్రతిబింబించడము అనుచితమని ఖండిస్తున్నారు. ఈ ఇతివృత్తములో గీతగోవిందమునకు ప్రాథమికస్థానము దొరకదు. భాగవతమునుండి ఈ సంప్రదాయము వెల్లడిచేయుచున్నది.

ఈ వైష్ణవ సంప్రదాయాన్నే నాటకములో మరొకచోటను శాస్త్రిగారుస్మరించారు. బిందుబిల్వములో రాధావల్లభాలయము నిర్మించి, అందు పరమభాగవతులనుచేర్చి అచ్చట హరివంశాదుల పఠనముఏర్పాటు చేయించాలని పద్మావతీజయదేవులు సంకల్పించారు. కాని హరివంశ విషయము భాగవతములో ఉన్న కృష్ణప్రశంస రాధను ఇంకా కల్పించి యుండలేదు. గోపికావల్లభుడు మాత్రమే రాధావల్లభుడు బ్రహ్మ వైవర్తనములోగదా అయినాడు.

శివశంకరశాస్త్రిగారు చేసిన ఈ సమాధాననిర్వచనము జయదేవునిమనస్సులోఉందా? "యద్గాంధర్వ కళాసుకౌశలం" "శ్రీవాసుదేవరతికేలికథాసమేతం" అని చెప్పిన వానిమనస్సులో ఈ వేదాంతజీవేశ్వరైక్యమేనా ఉన్నది?

ఏమో కళా (art) పేరుయూ, ఇట్టిదోషచర్చ అంగీకారమా అనే ప్రశ్న ఉంది. దోషాలకు ఏమైనా స్థానము అవకాశ మున్నట్లా లేక కేవలము నీలాపనిందలా? ఎంత చక్కని సమాధానాలు చెప్పగలిగినా సమాధానాలు సమాధానాలే గదా! దోషాలు ఏమాత్రమో ఉన్నట్లే గదా! దోషముల స్మరణవల్ల గుణములనుండి దృష్టి దోషాలపై మర్లుతుందిగదా!

అట్టి సందర్భములో నాటికయొక్క ముఖ్య ప్రయోజనమైన కావ్యగుణ ప్రశంసకు లోపమువచ్చి తీరుతుంది. గీతగోవిందముపై సాధారణపాఠకులకు శ్రోతలకు ఆదరదృష్టే కలదు. దానిమూలాలను ఎక్కడనో పడియున్న విన్నీ, ఎవరికో కొద్దిమంది విమర్శకులకుమాత్రమే తెలియగలిగినవిన్నీ, ఈ దోషాలనువాటికి స్మరణ లేక వదలివేసినచో నాటికప్రయోజనము ఎక్కువ చక్కగా నెరవేరియుండును. కుర్రవాళ్లకు పాఠము చెప్పుడములో తప్పులు చెప్పి, వాటిని దిద్దించి ఒప్పులు నేర్పడము ఎట్లు కార్యసాధనము కాదో అట్లే ఈ దోష సమాధానపద్ధతికూడ. కళా శిల్పముల అపేక్ష యా భావోద్రేకమును చెదరకుండా నిలుపవలసిన నాటకమునకు లోపమనే నా అభిప్రాయముతో శిల్పనిపుణులైన శాస్త్రిగారు అంగీకరింతురని తలుస్తాను. దోషాలని వాస్తవముగా నమ్మి మహేశ్వరభట్టు మొదలైన పండితులు ఆ దోషప్రకటన చేశారా లేక కేవలము కౌతుకమనిచేశారా. కౌతుకానికేఅంటే పాత్రల శీలానికి అనౌచిత్యము పట్టదా. వాస్తవ మని తలచినవారివలె వారికెవరికిన్నీ అభినివేశము లేకుండెను.

పద్మావతి చేసిన పూర్వపక్షాన్ని ఈ పండితులు ఎవరూచేయలేదు. పద్మావతిచేసివేసిందని వారు మానివేసినారా? వీరివలె పద్మావతి నీటి ముగ్గవేసి తనవాదాన్ని మార్చుకొని స్తోత్రపాఠము పాడలేదు. జయదేవుడుమాత్రము సభనుండిరాగానే దీన్ని జ్ఞాపకము తెచ్చాడు చూశావా నీ పేరుకేగదా ఈ అమూల్యాభరణాలు మనకువచ్చేయి అని. గీతగోవింద ప్రశంసచేసిన పండితులెవరూకూడా పద్మావతిగురించి ప్రశంసించలేదు. మహారాజుమాత్రము పద్మావతికికూడా బహుమతిఇచ్చాడు. కావ్యరచనకున్నూ పద్మావతికిన్నీగల సంబంధము పండితులకు ఏలాగు తెలియగలదు! పద్మావతి అంటే లక్ష్మిఅని పండితులు అర్థంచేసుకొన్నారా! పద్మావతీ రమణ అన్నచోట్ల అది కుదరదు. శాస్త్రిగారు ఈచిక్కుదాటడానికి మార్గము కనిపెట్టలేక ఆ చిక్కును స్మరించక ఊరుకొన్నారా! ఆ సభ అంతటిలోను ఎక్కడాకూడా సూచనైనాలేని ఈ అంశమును మహారాజు

ఆకస్మికముగా ప్రవేశపెట్టి 'పద్మావతీ చరణచారణుండు' అని బిరుదు ఇస్తే సభాసదులందరూ హర్షధ్వానులుచేశారు. అప్పుడైనా పద్మావతి నామోచ్చారణ బోధపడింది. బహుశః పద్మావతికి తట్టినట్లు వారికి ఆరోపము తట్టియుండకపోవచ్చును. జయదేవుడుమాత్రము దీనినిచూశావా నీపేరుకేఅని జ్ఞాపకము తెచ్చాడు. రాణి యెక్కడఉన్నది? "ప్రభు వరేణ్యపార్శ్వభాగమం దున్న కక్ష్యలోగూర్చుండి కావ్యంబు వినుచు," ఏమి రాజుపార్శ్వమందు ఎందుకు కూర్చోలేదోగదా.

పద్మావతిపే రున్న మూడుస్థలాలలోను, ప్రత్యేకబహుమతులు మూడు. ప్రత్యేకముగా ముగ్గురున్నూ రాజు రాణి రాకుమారి పంచిపెట్టి ఇచ్చారు. చరణచారణుండు అన్నందుకు నాట్యోపయోగమైన నూపు రాలు పంపిందిరాణి మధురశింజనము చేయడానికి. రమణ అన్న సమయములో శృంగారానికి యౌవ్వన సూచనచేస్తూ రాకుమారి తాటంకము లను పంపింది. సుఖసమాజానికి రాజు కంకణాదులుఇచ్చాడు. పంపకము సరసముగా ఉందికదూ!

మూడోరంగములోపరాశరునిచేత చెప్పించిన రాజసభావృత్తాంతము జరిగిపోయిన కథఅయి, నాటకలక్షణమునకు విరుద్ధమైనది. ఏదోమధ్య మధ్య కథ నడవాలని పద్మావతిచేత రెండుమాటలాడించినా అదినాటక లక్షణసంభాషణ కానేరదు. పద్మావతి ఒక పద్యగతిలోను, పరాశరుడు మరియొకదానిలోను మాటలాడడమువలన చదవడానికి చక్కగాఉంది. బాగా నడుస్తుంది. ఈనాటిక భాగాలకు రంగములని పిలిచినారు. అంకము అనకుండా రంగముఅనడానికి ఉండేస్వారస్యము విశదపరచలేదు. రంగమువలన నాటకభాగము ద్యోతనకాలేదు. నాట్యస్థలమన్నా, నాట్య మన్నా, మూడింటికి ఉండవలసిన అంగాఅంగీసంబంధము స్ఫురించదు. మూడురంగాలు మూడు వేరువేరైన వవుతవికాబోలు. మూడురంగాలు అంటే మూడుస్థలాలుకావు. మొదటిది మూడోది జయదేవుని ఇంటివద్దనే. ఇంటిభాగాలు వేరువేరుఅంటే, మూడోరంగాన్ని రెండుగాచేస్తే పద్మా వతీపరాశరుల సంభాషణ ఒకటి. పద్మావతీజయదేవుల లీల మరొకటిగా

ఉండవలసింది. ఈ రెండు ఇంటి ఒకే స్థలములో జరిగియుండవుగదా. కథావస్తువులో కూడ భేదమున్నది. పారితోషికముల ప్రశంస ఒక భాగము, వాటి అనుభవానందము మరొకటన్నీ.

రెండోరంగములో మాత్రము ఏడుగురు అన్యోన్యసంభాషణ చేశారు. ఉన్న నాటకమంతా ఇద్దరేసి సంభాషణలతోనే నడిచింది. పద్మావతి జయదేవ పరాశరులు ఈముగ్గురే పాత్రలు. సంభాషణచర్చ తప్ప వ్యాపారము ఏదీలేదు. అందుచేతనే శీలనిర్వహణము చాలా కృశించినది. కేవలసంభాషణ అందులో ఏఇద్దరికి మాత్రమో అయినది. నాటకరూపము కాదని శాస్త్రీగారు అంగీకరించరా? నాటకము అత్తని ఉత్ప్రేక్షాతిశయోక్తులను ప్రబంధశైలికి సరిపోవు వర్ణనలు ఈ నాటికలో శాస్త్రీగారు ప్రవేశపెట్టినారు. "ఫలరసంబులు నేల ప్రవహించుచుండు?"

పారితోషకములవర్ణన రెండుమార్లు ఎందుకో. పరాశరుడు జయదేవుడు ఇద్దరూ చెప్పనక్కరలేదుగదా! రెండోరంగము చివరను గీతగోవిందములోని జయదేవ కృతశ్లోకాలు చదివి జయదేవుని శ్లాఘించారు. రచనచమత్కారము నిజమే. అవి నాటకపద్ధతికి ఎట్లుసరిపోతవి? ఆశ్లోకాలలో కొన్నిభాగాలుమాత్రమే ప్రస్తుతములు. ఆఖరున చదివిన కవిత్వమస్తు అనేస్వస్తివాచకము నాటకాంతమున అయితే సమర్థించవచ్చు.

పరాశరుడు మొదటి మూడురంగములలో కనబడి, పద్మావతీ జయదేవులమధ్య సేవకస్నేహితులను మధ్యస్థపాత్రవలె ప్రవర్తిస్తాడు. జయదేవుడు పద్మావతీపూర్వపక్షానికి సమాధానము సంతృప్తికరముగా చెప్పలేకుండాఉండే సమయాన వచ్చి, వేళఅయింది పదమని జయదేవుని తీసుకొని వెళ్తాడు. జయదేవునికంటె ముందుగా సభనుండి ఇల్లుచేరుకొని, సభావృత్తాంతమంతా పద్మావతికిచెప్పి, జయదేవుని విజయాగమనమునకు తయారుచేస్తాడు. కథ చక్కగా చెప్తాడు. వర్ణనలు ఇంపుగా చేస్తాడు. జయదేవుని ప్రవేశపెట్టి నిష్క్రమిస్తాడు. పరాశరుడు కేవలకల్పితపాత్ర

కాదు. జయదేవుడు గీతగోవిందములో ఇతనిని తనప్రియవర్గములోచేర్చి 'పరాశరాదిప్రియవర్గకంఠే శ్రీ గీతగోవింద కవిత్వమస్తు' అని గ్రంథ పూర్తిచేశాడు. ఈ శ్లోకము ప్రక్షిప్తశ్లోకము కావచ్చు. గానసమయ మందు సభలో విపంచి మేళవించి సహాయము చేసినవాడు అని శాస్త్రి గారు సమన్వయించినారు.

లక్ష్మణసేనమహారాజుసభ విక్రమాదిత్య హర్ష సభలతో సమా నమని ఒప్పించడానికి కాబోలు దాక్షిణాత్యపండితులను కావ్యసమీక్ష సభలో శాస్త్రిగారు ప్రవేశపెట్టారు. లేదా తనకుగల దేశాభిమానము వెల్లడిచేయడానికా "దాక్షిణాత్యులు సకలవిద్యాప్రవీణులు అధిక మేధా నిధులు" అందరు దాక్షిణాత్యులనికాదు, అసభకువచ్చిన దాక్షిణాత్య పండితులుమాత్రమే. సభలో చర్చచేసినవారిలో పూర్వపక్షము నడిపిన వారందరా? అంచలో కొందరా? స్పష్టముగా చెప్పలేము. దీక్షితదాక్షి ణాత్యపదమే. భట్టుముఖి గురించి సందేహ మున్నది. దాక్షిణాత్య అనే దానికి బదులుగా ఆంధ్రదేశపు అనిఎందుకు అనలేదని నాకు ఒక సందే హము కలిగినది. కావ్యమీమాంసలో దాక్షిణాత్యపండితులు గట్టివా రున్నారు. నిజమే. విశ్వనాథుడు, అప్పయ్యదీక్షితుడు, జగన్నాథపండి తుడు ఈ మొదలైన పేర్లను సగర్వముగా దలచుకొనవలసినదే. కాని వీరిచేత దోషములు చూపించడమువల్ల తప్పులుపట్టడానికి వీరు ఘనులని సూచనరాదా అని ఒక సంశయము కలిగింది.

భద్రగజము నెక్కి వెళ్ళుమని మహారాజు ఆజ్ఞాపిస్తే, వెంటచను దెంచిన పండితుల నందరితోనూ కలిసి నడిచినాడు జయదేవుడు. సహజమైన సౌజన్యత వినయములు జయదేవునికి ఎక్కువ గౌరవమును తెచ్చినవి. కొన్నిచోట్ల కవిత్వము చాలాఇంపుగా ఉంటున్నది. పదములను కూర్చుటలో ఏస్థలములో ఏపదము ఉండాలో నిర్ణయించడములో భావ మునకు రంజకత్వము సంపాదించబడినది. ఆఖరిమాట వచ్చేవరకు ఏమి చెప్పనిశ్చయించినదీ వెల్లడికాదు.-(భారతి 54.)

కాని ఆధునికసంప్రదాయము ననుసరించి రచనచేసే మా శాస్త్రులు గారు యడాగమాదులు మానినారుకారు. ఈ ఆగమాలు కొన్నిచోట్ల చాలా ఉచితముగా విడిచివేసినారే! అన్నిచోట్ల మానివేసివుంటే అర్థభావస్ఫూర్తి అయేటట్లు ఉచ్చారణాదులు నడపవలసే నటకునికి ఈ యడాగమాదులు నిరర్థకయాటంకములుగదా! పద్యములో వ్రాయడమువల్ల కవిగారు భాషను స్వేచ్ఛగా నడపలేకపోయినారు.

"కావ్యదోషములున్న నిష్కారణముగను
బయలుపెట్టరె పండిత ప్రవరులపుడు?" ఎందుకు ?



# ౪

# భీష్మప్రతిజ్ఞ

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారు "భీష్మప్రతిజ్ఞ" ఉరఫు "ప్రతిజ్ఞాశాంతనవము" అనే నాటకము రచింపకపూర్వమే ఆంధ్రవాఙ్మయప్రపంచమున సుప్రసిద్ధులు. "సంస్కృతకవుల జీవితములు" "భాసనాటక కథలు" "ఆంధ్రదశరూపకము" "సత్యకీర్తి నాటిక" ఈ మొదలైన గ్రంథములవలన వారి పాండిత్యము ఎట్లు ఉభయభాషలను స్వాధీనము చేసుకొన్నదో స్పష్టమవుతున్నది. "సమధిగతశబ్దవేదాంత శాస్త్ర సంస్కృతాంధ్రసాహిత్య సత్కవితాప్రాంచితులు" "గద్యపద్యానేక కావ్యకర్తలు" అగు శాస్త్రిలవారు కవితాప్రతిజ్ఞగా వ్రాసిన ఈ క్రొత్తనాటకమును విమర్శింప బూనుటలో కొంత సాహసము నాయందు కలదని నేనే ఎరిగినప్పటికీ, నా "రసాస్వాదనాభినివేశమును సార్థకము" చేసుకొనవలసి ఉన్నదని ఇందుమూలమున వ్యక్తము చేస్తున్నాను. కృతిని చక్కగా మథిస్తేనేకాని కవిహృదయము లెస్సగా గ్రహించ వీలుకాదనిన్నీ, ఆలాగు చేస్తేనేకాని రసాస్వాదనసుఖము పొంద వీలుండదనిన్నీ విమర్శకు లందరూ ఎరుగుదురు. విమర్శనప్రయోజనము తప్పులనుబట్టి కృతిని నిరసించుటకాదనిన్నీ, కృతియొక్క ఆహ్లాదకరత్వమును విమర్శకునికి తెలిసినంతవఱకు వెల్లడి చేయుటనిన్నీ నేను గ్రహించిఉండే ఈ వ్యాసమును వ్రాయ సఘకట్టినాను. ఈ వ్యాసములో చర్చకంతకూ అదే ప్రయోజనము.

ఈ నాటకమునకు ఇతివృత్తమును మహాభారతమునుండి గ్రహించినట్లు కవే స్పష్టముగా ప్రస్తావనలో చెప్పినారు. ఆకథ అందరికీ తెలిసినదే. దీనిని రూపకముగా వివరించుటకు పూనుకొన్న శాస్త్రిలుగారు కృతకృత్యులని చెప్పవలెను. ఇతివృత్తము చాలా చక్కనిది. విషయములో గాంభీర్యము కలిగి రసావిర్భావమునకు పాత్రపోషణమునకు చక్కగా అమిరిఉండి, కథారచనకు వీలిస్తూ ఉన్నభాగమిది. ప్రస్తావనలో సూత్రధారుడు "భీష్మునిచరిత్ర మిప్పుడు ప్రద

ర్శనపాత్ర" మని చెప్పగా, నటి నవ్వి "భీష్మచరిత్ర మనగా నెంతయో కలదు. అదంతయు నభినయముగా ప్రదర్శించుట శక్యమగునా" అని సాశ్చర్యముగా అడగగా, సూత్రధారుడు ఈకథాభాగమునే * నిర్వచించి చెప్పినాడు. వారిసంభాషణములో ఉట్టంకించిన కారణము, నేను సూచించే కారణము ఒకటికాకున్నా, భీష్ముడెంతో పవిత్రచరిత్రుడని అతని చరిత్రనంతనూ రూపకముగా చేయకుండా ఈభాగముతోనే విరమించిన కవియొక్క రచనారుచిని మనము మెచ్చుకోవలసినదే. చరిత్రనంతనూ నాటకముగా చేసేటప్పుడు ఉండేగుంభన వేరు. ఈ ఒక్క అంశమునే ఎంచినపుడు ఉండేగుంభన వేరు. ఈ రుచివిశేషమును మరికొంచెము సూక్ష్మముగా కవి చూపించియుండెనా మరీ బాగుండియుండును. దేవవ్రతచరిత్రలోని ఈ ప్రతిజ్ఞాంశము నొక్కదానినే ఎంచి, చరిత్రతో సంబంధించిన మిగిలిన అంశములను విడిచిపెట్టుట కెట్టిసబబులు కలవో అవన్నీకూడా ప్రతిజ్ఞాపూర్వకమైన అంశములను విడవవలసి వచ్చుటకున్నూ వర్తించునుకదా. దేవవ్రతునిజన్మ మొదలైనవి ఎట్లు అప్రస్తుతములో, ఆలాగే దేవవ్రతుని శంతనుడు గంగాదేవినుండి సంపాదించి తన నగరమునకు తీసుకొనిపోవుటకూడా ప్రతిజ్ఞాకథకు అప్రస్తుతము. దేవవ్రతచరిత్ర ఎప్పుడైతే నాటకవస్తువుకాలేదో అప్పుడే ఈ భాగముకూడా విసర్జనీయము; దీనినికూడా విడిచే నాటకము ప్రారంభించియుండునా, సూత్రధారుని 'మాటలలోగల రుచివిశేషము బాగా వ్యక్తమై ఉండును. ఈ కథాంశముతో భారతమందున్న కథావర్ణన ప్రారంభ మగుటచేత కవిచేతులలో నాటకముగా మారేటప్పుడుకూడా ఈభాగము విడవక అంటిపెట్టుకొని ఉండిపోయినా అనేసంశయము న్యాయముకాదు కాబోలు! లేదా రసపోషణకై దీనిని ప్రయోజన

---

* శంతనునకు సత్యవతిపై మోహము కలుగుట; ఆమెయందు పుట్టేవానికి రాజ్యము పట్టముకట్టే షరతుపై వివాహము పొసగు నని దాశరాజు చెప్పుట; ఆసంగతి విన్న దేవవ్రతుడు శాశ్వత బ్రహ్మచర్యము పూనుట; సత్యవతీశంతనుల వివాహము. ఇది నాటకకథాభాగము.

పూర్వకముగా నిలిపియుంచెనని ఊహించ సాధ్యము. రసవిషయమై ఈ భాగ మెంత ఆవశ్యకమో ముందు చర్చిస్తాము గాని ఇక్కడ మాత్రము కథారచన కిది అనర్థదాయకమని చెప్పకతీరదు. అదెట్లో ముందుముందు చర్చింతము.

మూలకథకున్నూ, రూపకకథకున్నూ భేదము లున్నవి. "భారతమం దీకథ మిక్కిలి సంగ్రహముగా నున్నది. కావునఁ గొన్ని క్రొత్త విషయములను గల్పించియు, మూలకథలోని కొన్ని యనుచితవిషయములను వదలియు, మరికొన్నిటిని జక్కబఱచియు, కథౌచిత్యమును బాత్రౌచిత్యమును బాటించి శాస్త్రులవారీ నాటకమును వీరరసప్రధానముగా, నతిమనోహరముగా రచించిరి." అని పీరికాకారులు వ్రాసినారు. తెలుగుభారతములో 32 పద్యములలోను, సంస్కృతములో సుమారు 100 శ్లోకములలోను ఉన్నకథను ఆ రంకముల నాటకముగా సవరించేటప్పుడు, క్రొత్తగా చేర్చినవేవో, సవరించినవేవో విడదీసి చెప్పుట సాధ్యముకాదు. మూలములో ఒక్కమాటలో సూచితమైనసంగతిని ఒక అంశముగా నాటకములో కల్పించేటప్పుడు, అదిక్రొత్తదా, లేక సవరణా ఎట్లు చెప్పగలము ? ఇట్టి చిన్నసంగతులు చాలాఉన్నవని అంగీకరించి, వాటిలోముఖ్యమైనవాటినే లెక్కవేయగలము. మొదటి అంకములోని అశ్వమేధదిగ్విజయము, పరశురామునిఆశ్రమము; రెండో అంకములోని పాంథాశ్రమము, గాంధర్వవివాహ ప్రయత్నము; మూడోదానిలోని దేవవ్రతుని దిగ్విజయము; నాల్గోదానిలోని సత్యవతీ-అయోగశృంగారము; ఐదోదానిలోని శంతనుని మనోభీష్టప్రకటనపద్ధతి; ఆరోదానిలోని దేవవ్రత దాశరాజసమాగమవర్ణనము- ఇవి ముఖ్యమైనవి.

ఈ స్వంతకల్పనలో కెల్ల మొదటి అంకములోని దిగ్విజయకథ చాల ముఖ్యమైనది. దీనిరచనకై కవి, చాల శ్రద్ధ తీసికొని యుండవలెనని నా ఊహ. దీనికి మూలము ఇట్లున్నది. "అతం డొకనాడు మృగయావ్యాజంబున గంగాసమీపమునం జనువాడు ; కడు స్వల్పప్రవాహంబై యున్నదాని గంగానదింజూచి, యిది యేమినిమిత్తంబో

యనుచు గొండొకసేల యరిగి కనియె ముందట ధను వభ్యసించుచు శాణసంహతి సేతుగా గట్టియున్న కుమారు. అప్డు డెఱుంగనేరక విస్మయాకులితచిత్తుం డయి యుండె. అంత కోమలాంగి దివ్యనది ప్రీతితో జనుదెంచి, పతికి సుతు నిచ్చి గంగసనిన, తనయు తోడు కొనుచు భూవిభుండు తనపురంబునకు వచ్చె.'' శరసేతు నిర్మాణము, గంగాశంతనులు కలుసుకొనుట దేవవ్రతుని తండ్రికి ఇచ్చుట మూలము లోనివే. వీటికి పరశురామాశ్రమము, దిగ్విజయసంరంభము కలిపి కథను ననుసరించి మొదటిఅంకమును కవి రచించెను. పరశురామాశ్రియము దిగ్విజయమంత కల్పితముకాదు. (మా. తెనుగు భారతము ఆది 70-169)
* వీరపోషణము కాబట్టి దిగ్విజయము, దిగ్విజయముకాబట్టి ధనుర్విద్య,

---

* ఈ పద్యము కవినాటకములో ఎట్లు ఉపయోగించెనో కొంచెము విమర్శింతము. దేవవ్రతుని విద్యాసంపాదనము, వర్ణితాంశము. అందుచేత ఇది చరిత్రసంబంధమైనదై ప్రమాణభూత మగుచున్నది. ఈవర్ణనలో తెలుగు సంస్కృత భారతములకు భేద మున్నది. నన్నయ్యకు ఆధారమేదో నాకు ప్రస్తుతముకాదు. కాని, నాటకకర్తకు తెనుగో సంస్కృతమో ప్రమాణము కావలెను. అట్లాకాకుండా వారివర్ణన స్వంతమైనది. ఎందుకీమార్పుచేసిరో నాకు తెలియలేదు. ఆలాగని మూలములను అనుసరించలేదని చెప్పలేము. సముడని అనుటకంటె నేర్చుకొనెనంటె ఎక్కువ సమంజసమనా ?సంస్కృతము: ఆది. 100.35-39. 1. వసిష్ఠునుండి సాంగవేదములు నేర్చెను. 2. అస్త్రములలోను, యుద్ధములలోను ఇంద్రునితో సముడు. 3. శుక్రునికి తెలిసినశాస్త్రము లితనికి తెలుసును. 4. అస్త్రములలో పరశురాముడంతవాడు. తెను: ఆది 4-169. 1. సకల వేదంబులు చదివె వసిష్ఠునితో 2. శాస్త్రముల్ శుక్రబృహస్పతుల్ నేర్చినయట్లై 3. అస్త్రవిద్యను పరశురాము డంత దక్షుడు 4. ఆత్మవిజ్ఞానంబునందు సనత్కుమారాదుల.

నాటకము: 5. పుటలోని పద్యము. 1. ప్రాంజదువులు నాలుగు పరాశరునియొద్ద 2. ప్రసిద్ధశాస్త్రముల్ వసిష్ఠునొద్ద 3. సాస్త్రీకక్షి విద్యలుభార్గవునియొద్ద 4. ఆత్మవిద్యారహస్యంబు సనకసనందాదిమునుల యొద్ద 5. ధనుర్వేదము పరశురామువద్ద.

కాబట్టి గురువు, కాబట్టి అతని ఆశ్రమము, పరంపరగా పరిణమించి ఈసవరణ సిద్ధమైనదని చెప్పవచ్చునేమో. కాని పరశురామునితో నివసించి ఉండునట్లు కాని, అతనినుండి అస్త్రవిద్య నేర్చుకొనినట్లు కాని మూలములో లేదు. మూలములో ఉన్న శరసేతునిర్మాణమును కల్పితమైన దిగ్విజయమునకు అంగముగా కవి సవరించెను కాని రెండింటికి కథారచనలో ఎట్టి సంబంధమూ కానరాదు. ఇంతకూ శరసేతు వెందుకు?

ఈ దిగ్విజయవర్ణన ఉత్తరరామాయణములోని కుశలవులకథను అనుకరించెనా అని స్ఫురిస్తున్నది. "పుత్రాదిచ్ఛేత్ పరాజయం" అనే న్యాయమును అనుసరించి చేసిన ఈ వర్ణన బాగానే ఉండవచ్చును. దేవవ్రత సంప్రాప్తికథయొక్క ఆవశ్యకతమాట అటుండనిచ్చి, ఆ కథ చెప్ప నిశ్చయించినపుడు మూలములో నున్న మార్గముకంటె నాటకములోని సాధనము ఎక్కువ ఆహ్లాదకరముగా ఉన్నదని చెప్పగలము. నాటకములోని మార్పు దిగ్విజయముతో అత్తునట్లుగా ఉన్నది. వీరభటులు, సేనాని, పరాజితులుకాగా శంతనుడు సమీపించి బాలుని విజృంభణమును శరీరాకృతినిచూచి, ప్రథమదర్శనమునుంచి ఉద్భవించిన వాత్సల్యమునకు వశుడై యుద్ధమును ఆపినవాడై పిల్లవాని ఊరుపేరు అడిగి, గంగాదేవి సమాగమ పూర్వవృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొని ఆ బాలుడే తన కుమారుడని గ్రహించుట; ఆ తరువాతనే పరశురాముడు స్పష్టపరచుట; గంగాదేవి అప్పగించుట; ఈ కథంతా రంగముపై మనోరంజకముగా ఉంటుంది. కాని ఒక చిక్కు ఉన్నది. నగరములో ఉండవలసినరాజు అశ్వముతో పోవుసేనలో ఉండుట ఒక అప్రసిద్ధమైన ఏర్పాటు అవుతున్నది. అలాగుగాక, ముని బాలునిచే సంభవించిన సేనానీపరాజయవృత్తాంతమును విని శంతనుడు పట్టణమునుండి బయలుదేరివచ్చెనని సమాధానము చెప్పితే రాజనగరమైన హస్తినాపురమునకున్నూ ఈ ఆశ్రమస్థానమునకున్నూ ఉన్న దూరము చాల తక్కువని చెప్పవలసి వస్తుంది. నాటకములోని కాలసూచనలు చూడండి. శరసేతువు పూర్తిఅయ్యేసరికి జాముప్రొద్దెక్కింది.

గురుడు వచ్చేవేళ అయినది (చూ॥ 5 పుట): సంరంభము పూర్తిచెందే సరికి గురువర్యుడు శరసేతువు సమీపించినాడు. ఈ రెండింటికి అంతర మైన స్వల్పకాలములోనే ఈ దిగ్విజయ పరాజయము పూర్తిఅయినది. జయసింహునివీగు, శంతనునికి వార్త, వానిరాక ఈ స్వల్పకాలములో జరిగినప్పుడు పట్టణమునకున్నూ ఆశ్రమమునకున్నూ దూరము తక్కువని చెప్పకతీరదు. అంతదగ్గరనే ఉన్న ఈ యాశ్రమము, ఈ బాలునిసంగతి ఇదివర కెన్నడూ శంతనునికి వినికిడి కాలేదా ? కవి బాలునిచే వేయించిన ప్రశ్న చాల సరసమైనది. ఊరు, పల్లె, ఆశ్రమము, ఉగ్ర వనంబు– ఇవా దుందుభిప్రతిష్ఠకు స్థానములు ? అక్కడా వీరు లుండే స్థలము ? అచ్చోటికా అశ్వము వెళ్లును ? వెళ్లినా అచ్చటా వారి వీర ఘోషణము ? ఈ వర్ణనకుగల ఔచిత్యమెంతో విమర్శకులు విచారించవలసిందేకదా ! మరొకసంగతి. శంతనుడు భార్యారహితుడై యుండ అశ్వమేధ మెట్లు తలపెట్టినాడు ? రాముడు ప్రారంభించి నపుడు సువర్ణసీతను సమీపమం దుంచుకొనెనట. శంతనుడో ! ఇంతకూ ఈ దిగ్విజయకథకున్నూ లేదా దేవవ్రతప్రాప్తికథకున్నూ, నాటకవస్తు వైన ప్రతిజ్ఞాకథకున్నూ ఎట్టి సంబంధమూ కానరాదు. దీనిని విడిచి వేస్తే నాటక మెట్లు చెడును ? చెడదు సరేకద్దా బాగుపడుననికూడా చెప్పవలసివచ్చును కాబోలు !

మొదటిఅంకములో శంతనుడు ప్రారంభించిన అశ్వమేధాంగ మైన దిగ్విజయము, మూడో అంకముతో పూర్తియైన దేవవ్రతుని దిగ్విజయము ఒకటేనా, ఒకదాని అనుబంధము ఒకటా లేక వేరువేరా ? ఈ రెండింటికి కథలో ఎట్టి సంబంధమూ కానరాదు. కాని రెండింటికీ ప్రయోజనము ఒక్కటే అంటే అది కథారచనకై కాక, రసపోషణమునకై కావలసి ఉంటుంది. ఏదైనా కథారచనను గురించి ఆలోచించవలెను. మనము పరిశీలించవలసిన విషయము లున్నవి. ముఖ్యముగా పాత్రలశీలవర్ణనము, మొదటి అంకములోనిది శంతనుని దిగ్విజయమైనా శంతనునిప్రభ ప్రత్యక్షముగా ఎక్కడా చూపలేదు.

రాజాధిరాజేశ్వరుడుగాక అన్యుడెవ్వడైనా అశ్వమేధము తలపెట్టగలడా అనే సూచనద్వారా కాక వేరుగా శంతనుని ప్రభ నాటకములో ఎక్కడా కానరాదు. లేకున్నా సూచనయైన ప్రభకు కళంకము రాకుండా కవి వర్ణించెనని అంగీకరింతుము. శంతనుడు వీగిపోలేదు. దేవవ్రతుని గెలుపంతా సోమపాలునిపైని జయసింహునిపైనిన్నీ. ఇంతకూ ప్రకంపనాస్త్రము ప్రయోగించి దేవవ్రతుడు యుద్ధము తప్పించుకొన్నాడని మనము మరచిపోకూడదు. ముఖ్యవీరులతో పోరాటము జరుగనేలేదు. రెండోమారు వర్ణించిన దిగ్విజయము వాస్తవమైన విజయమే! చాలమంది సామంతరాజులను జయించి సామ్రాజ్యము స్థాపించినాడు. ఇదంతా దేవవ్రతుని వీరాగ్రేసరత్వమే. దేవవ్రతుడు దండయాత్రకు పోగా శంతనుడు మన్మథసేవలో పడి యుండును. అట్టి వర్ణనవలన శంతనునిశీలమునకు కళంకము రాలేదా ఏమి? మొదటిఅంకములో సూచనలుగా నున్న శంతనుని వీరత్వము ఇప్పు డేమైనట్లు? దేవవ్రతుడు, యువరాజు కాని రారాజు కాడు. యువరాజు తెచ్చినదంతా రాజుకే చేరుననే వ్యవహారధర్మము ననుసరించి ఈ అంకములోని దిగ్విజయములమాట ఎట్లు? మొదటిదాని ద్వారా దేవవ్రతునిప్రాప్తి కలిగినది. ఇక రెండోదో? రెండో అంకములో ప్రారంభమైన సత్యవతికథంతా ఒకే ఊపున చెప్పివేయనక్కర లేకుండా ఉండేటందుకు ఈ రెండో దిగ్విజయముకూడా శంతనునికే చెందవలెను; అట్లు చేకూరిన వీర్యము శంతనునికి చెల్లదా అని అడుగ వచ్చును. పాత్రశీలవర్ణన అలాగుండగా కథారచనవిషయమై ఈ రెండో దిగ్విజయవర్ణన ఉపచరిస్తుందని చెప్పవచ్చును. రెండో అంకముయొక్క విష్కంభకములో దండయాత్ర సూచన అగును; అంకమంతా సత్యవతిదర్శనకథే వర్ణిస్తుంది. మూడోదానిలో మొదట సంకీర్ణవిష్కంభకము, ఆ తరువాత అంకములోని ఒక రంగము మొత్తముపైని నాల్గుపేజీల వినగా అంకమంతా అయోగశృంగారమునే వర్ణిస్తుంది. రెండుమూడంకములు కలిపితే మొదటికొస దండయాత్ర

మధ్యదంతా సత్యవతీకథ ఉంటవి. కథారచనలో ఈవ్యత్యాసము ఒక పెద్దలాభము కాదు. ఎందుకంటే మిగిలిన మూడంకములలోను కథ ఒక్కటేయైనా ఎట్లు రంగము మార్చుటచేత వర్ణన నడిచిందో అలాగే ఈ రెండుచోట్ల దండయాత్రసూచనలు విడిచిపెట్టి కథ నడప వీలున్నది. అదే బాగుండు నేమో ?

"కథౌచిత్యమును పాత్రౌచిత్యమును పాటించి... ఇందుకు ఉదాహరణము, మూలమునందుఁ దనకుమారునితోఁ దనపెండ్లిమాట చెప్పుచు శంతనుడు చేసినసంభాషణ మనుచితముగా నుండుటచే దానిని చక్కగా సవరించి శంతనుని ధీరోదాత్తునిగా మార్చుట యొకయుదాహరణము" అని పీఠికాకారులు వ్రాసినారు. శాస్త్రిలుగారు చేసినమార్పులలో ఇదొక టనేకాకుండా, ఇది చాలా ముఖ్యమైన దనికూడా చెప్పుతున్నారు. దీనిలో శంతనునిశీలము చక్కగా వ్యక్తమవుతూఉన్నదని వారి అభిప్రాయము. మూలములో ఈసంగతి ఎట్లు ఉన్నదో చూదాము. దాశరాజు తనఅభిప్రాయము చెప్పగా "గాంగేయ యువరాజుఁ దలచి" "అదితప్పు నొండు వేడుమ యిచ్చెదను." అనిపల్కెను. కాని దాశరాజు అంగీకరించనందున, విఫలమనోరథుడై ఇంటికి వచ్చి, చింతాక్రాంతుడై యున్న తండ్రిని చూచి, "నీ కన్నివిధముల సౌఖ్యసాధనములే ఉండగా నీ కీ పరితాప మెందుకు" అని దేవవ్రతుడు అడగగా, తండ్రి తనమనోరథమును వ్యక్తపరుస్తూ కారణములు చెప్పెను. ఏకపుత్రుడున్నూ అనపత్యుడున్నూ ఒక్కటేమో స్త్రరే అని ఉండుటచేతనున్నూ, సంతానము అగ్నిహోత్రములవలెనే పెద్దవారికికూడా ఎడతెగకుండా ఉండవనిన్నీ, దేవవ్రతుడు యుద్ధప్రియుఁ డగుటచేత వాని "ఉనికి నమ్మగానోపఁ" అనిన్నీ, కారణములుగా చెప్పి, "బహుపుత్రార్థంబు యత్నంబు సేయ వలయు వివాహం బయ్యెదను" అని పలికెను. ఆతరువాత "గాంగేయుడు వృద్ధామాత్య పురోహిత సుహృజ్జనంబులతో విచారించి, యోజనగంధి రాజు చిత్తంబునం గలుగుటఁ యెఱింగి" దాశరాజువద్దకు అనేక సేనలతో వెళ్ళెను. ఇది తెనుగుభారతమునుండి సంగ్రహించినది; సంస్కృతము

నకు సరిగానే ఉన్నది. దీనిని నాటకములో ఎట్లుమార్చినారో సంగ్రహముగా చెప్పెదను. రెండో అంకములో యమునాతీరమునకు వేటకై వెళ్లుట; అక్కడ సురభిచే తీసుకొనిపోబడి పాంథాశ్రమముచేరి, అక్కడ శకుంతలా పరిణయవృత్తాంతము ప్రకారము (నాయకునికి మాటలురాక చదువుకొన్న శకుంతలకథే జ్ఞప్తికివచ్చినదా అన్నట్లు) సుగంధితో మాట్లాడి, వృత్తాంతమును తెలుసుకొని, తండ్రిదగ్గరికి పోవును. ఇంతవరకు మూలమునుండి గలభేదమంతా ఈ పాంథాశ్రమము. దానిలో శకుంతలాపరిణయానుకరణముతప్ప మరేమిన్నీ లేదు. మూడో అంకము ప్రారంభిస్తుంది. అయోగశృంగారబాధకు ఓర్వజాలక శంతనుడు బాధపడుచుండెనని మూలములో ఉన్నది. ఈవాక్యస్థకథను ఒక అంకముగా విస్తరించుటకు సహాయులైన మంత్రిపురోహితులను ప్రవేశపెట్టి, శంతనునిచే "అమాత్యా! ఏదోవచ్చినది, వచ్చినది వచ్చినట్లే యణగినది. అడగినబెడద మరలత్రవ్వనేల ?" అని తనబాధ కారణము సూచింపచేసెను. పెండ్లికిగదా అని పురోహితుడు కంపించెను. ఇట్లు పలుకుట గంభీరత అని కాబోలు. ఈ గాంభీర్యమునకును, పూర్వము ఆ అంకములోనే స్వగతమున వర్ణించిన శృగారబాధకున్ను సామరస్యము లేదు. అప్పుడేదో ఒకటి అసత్యము కావలసివచ్చును. స్త్రీతోనే కాకుండా స్త్రీవిషయమైన అసత్యమేదిన్నీ నీతిబాహ్యము కాదని అభిప్రాయమా ? ఇంతకూ శంతనుడు ధీరోదాత్తుడైనపుడు ఈ అసత్యమును ఒప్పుకొందుమా ? మూలములో శంతనుడు చెప్పిన ఏకపుత్రాదితర్కములన్నీ నాటకములో యజ్ఞతీర్థసుమంతులు అందురు. వీటిని శంతనుడు సహేతుకముగాను, నిరుత్తరముగాకూడా ఖండించి వేయును. మూలములో చక్కగా అత్తిన ఈ కారణములు నాటకములో సరిపడకపోతే, శంతనుని వివాహేచ్ఛకు కామబాధేతరము ఏదిన్నీ కారణముగా కనబడదు. అంతకంటె ఉదారభావమేదిన్నీ లేనియెడల శంతనుడు "ధీరోదాత్తు" డెట్లు ? శంతనుని వయస్సెంత? ౧. పడుచుతన

౧. ఇష్టోపభోగంబులం బెద్దకాలంబు సనిన...ఆది. 4–162

ములో లేఁడే కామబాధకు లొంగుటకు; శంతనుడు ధీరుఁడే అయితే కాదని నిశ్చయించినదానిని తిరిప్పుతూ ఆసంగతి పదేపదే జ్ఞాపకము తెచ్చుకొంటూ పైకి వ్యక్తమయేటట్లునూ, తనవల్ల సాక్షాత్తుగా కాకుండా పైవారు పోల్చి కార్యము చేస్తే చాలుననే పేలవునివలె శంతనుడు ప్రవర్తించుట ఉత్తమనాయకలక్షణమునకు సరిపడదని చెప్పవలెను. "కుమారునిరాజ్యము కంటె నాకు బరిణయ మెక్కుడు గాదు. సర్వథా నే నా చింత వదలియుంటిని. కర్మవశంబునగాని యాలోచనము గలిగి యది ప్రమాదవశంబున బయటపడుటచేఁ గౌరవ గౌరవంబునకు గలంకము దెచ్చితిని అని, పెద్దలకుఁదలసూపనోడి కొందలపడుచున్నాఁడ" అని చెప్పినమాటలు సత్యమా, లేక శృంగార వికారమైన మురిపింపా ? జ్ఞానమార్గము కోరిన ఇతడు, శ్లేషతో "దేవవ్రతుడు నీ కుభయలోకసాధనమైన రాజమార్గము" అని యజ్ఞతీర్థుడు అన్నమాట. తన సత్యవతీ ప్రాప్తిసాధనముగా అన్వయించుకొనుట ధీరోదాత్తునికి ఉచితశీలమా ? శంతనుడు వాస్తవముగా ధీరుఁడేయైతే తానన్న మాటలు నిశ్చయమే యైతే, దిగ్విజయమునుండి వచ్చిన దేవవ్రతునికికూడా తన శోకము ఏల వ్యక్తము కావలిసివచ్చింది? అతని శీలవర్ణనములో ఇది ఒక చిక్కేకదా. మరొక సంగతి; దేవవ్రతుడు తండ్రిమనోభీష్టమును కనుగొనుట మూలముకంటె వేరుగా నాటకములో సవరింపబడినది. దేవవ్రతుడు తనలో తాను తర్కించి, పక్షను లన్నిటిని విమర్శించి తుదకు వేటకేగినస్థలమును పట్టి "ఆ! మనోరథము ఇట్టిది గావుననే యింతగోప్యమై, వేదనాహేతు వగుచున్న" దని సూటిగా ఊహించ గల్గినాడు. దేవవ్రతుడు కనుకొనిగాని, చెప్పకూడదని అన్నివిధాల నిశ్చయించిన యజ్ఞతీర్థుకే దైవముమీద తప్పుమోపి చెప్పివేసినాడు. ఇందువలన కలిగే రసస్ఫూర్తి యేదో తెలియదు. ఇది చమత్కారముగా ఉన్న శంతనునిశీలము * మాత్రము ఈ సవరణవలన చక్కపడలేదు.

* యజ్ఞ : లోకాపవాదంబునకు జడిసి, యితడు పెండ్లి వలదనుచున్నాఁడుగాని నిరీహచేగాదు. (పుట 64)

ఈ మార్పువలన గంభీరతను సంపాదించితి మంటిర్హా ధీరోదాత్తున కుండవలసిన స్థైర్యమునకు దృఢవ్రతమునకు, మహాసత్యమునకు కూడా భంగము వచ్చితీరును. మూలములో తండ్రి కొడుకుతో చెప్పుట అనుచితమైతే [1] శంతనుడు ఇంత బేల అగుట ఉచితమా? అపత్యార్థము వివాహప్రయత్నము చేయుట ఆర్యమతదృష్టిలో అనుచితము కాదు. అపత్య మందుచేత ఒక తగిన కారణ మగుచున్నది; [2] కామాంధ్యము అంతకంటె ఉచితమైనకారణము కానేరదుగదా. తనబుద్ధిని స్థిరము చేసుకొనలేక, ఎన్నోమార్లు ప్రయత్నము చేసినా వైకల్యము పొందువాడు ఎట్టి ఉదారనాయకుడో ఇంతవరకు శంతనుని ధీరోదాత్తునిగాచేయ ఉద్యుక్తులైనా రని ఊహించే విమర్శించినాను. కాని, పీఠికాకారులుమాత్రము "ధీరోదారు"డని వ్రాసినారు. అలంకారశాస్త్రములో నాకీప్రయోగము కానరానందున, శంతనుని శీలలక్షణము ప్రాచీన సంప్రదాయముగాక నవీనమా అనే సంశయము కలిగినది. నవీనమైనప్పుడు ఏ అర్థములో ఆమాటను ఉపయోగించినది స్పష్టముకాకుండా తగాయిదా పడకూడ దని నాఅభిప్రాయము.

ఇంకొక ముక్యాంశమున్నది. ఈ నాటకమునకు ప్రధానరసము వీర మని గ్రంథకర్త ప్రస్తావనలోను, పీఠికాకారులు వారి వ్యాసములోను నొక్కి చెప్పియున్నారు. వీరరసమును కొందరు ఆలంకారికులు దాన దయా యుద్ధము లనెడి మూడురకములుగాను, ధర్మ వీరమును కలిపి కొందరు నాలుగురకములుగాను విభజించియున్నారు. రసగంగాధర మతానుసారముగా కూడా ఈ నాల్గింటిలోనే మిగిలిన పాండిత్యాదుల రకములకు అంతర్భావము చెప్పితే, మననాటకములో వర్ణించిన వీరరస

[1] ఇవన్నీ ఇప్పటివాసనలు కాబోలు. సత్యవతి తనకు వ్యాసుడు పుట్టినవృత్తాంతము భీష్మునితో చెప్పినది. అలాగే కుంతి కర్ణునిజన్మవృత్తాంతము చెప్పినది. ఎన్నో ఇట్టిసంగతు లున్నవిగదా.

[2] వంశాభివృద్ధి, ధర్మాచరణము శంతనునకే చెల్లునా, దేవవ్రతునికి చెల్లవా?

మేదియై ఉండునో ఆలోచింతము. దయాధర్మములు కావుగదా! దానము కూడా కాదని చెప్పవచ్చును. దాన వీరమునకు బలిచక్రవర్తిని లక్ష్యముగా చెప్పియున్నారు. అట్టి యే దానము నాటకములో వర్ణితమైయుండ లేదు. అందుచేత యుద్ధమే ఇందలి వీరరస మని చెప్పవలసివచ్చును. మీద నుదహరించిన రెండు దిగ్విజయములే ఈ వీరరసవ్యంజకము లగును. ఇందులో మొదటి అంకములోని వీరరసోత్కర్షను చక్కగా విమర్శించ వలసి ఉంటుంది. ఎందుచేతననగా కథారచన ననుసరించి విచారించినచో ఈ అంకకథకు ఎట్టిప్రయోజనము కానరాలేదని మీదను చెప్పినప్పుడు, ఈ అంకము ఏల ఎందుకు నాటకములో ప్రవేశించి ఉండవలెనో పూర్తిగా చర్చించక ఇప్పటికి నిలిపి ఉంచివేసితిని. వీరరసప్రధానమైన నాటకమును వ్రాయవలెనని నిశ్చయించిన కవికి వీరరసముతో నాటకమును ప్రారంభించుట సమంజసమే. ఈ అంకములో ఏరసమైనా ప్రధానమైతే అది వీరమే అని ఒప్పుకొనవలెను. నాయకుడు దేవవ్రతుడా, లేక శంతనుడా అనే ప్రశ్న ఇప్పుడు అప్రస్తుతము. కాని ఈ దిగ్విజయకథ ద్వారానే నాయకుని వీరత్వప్రకర్ష వెల్లడి కావలసిఉన్నది. దేవవ్రతుడు నాయకుడైనా కాకపోయినా, అతని వీరము ఉప్పొంగుచుండుటచేత ప్రతిపక్షము లేనప్పుడుకూడా శరసేతునిర్మాణముద్వారా పైకిప్రవహిస్తూ ఉండెనని చెప్పి, శరసేతుకథకు ప్రయోజనము కల్పింతాము. కాని, ఏకరసానుభావములుగా శరసేతువుకున్నూ దిగ్విజయమునకున్నూ సంబంధమున్న దన్నా, సాక్షాత్తుగా రెండు అంశములకు ఎట్టి సంబంధమూ లేద నేవాదము నిలిచి ఉండవలసినదే. దిగ్విజయముచే పోషితమయే వీరమునకు శరసేతువు ఏవిధానా ఆవశ్యకము కాదు సరేకదా, ముందొక శరసేతువర్ణన లేకుండా దిగ్విజయసంరంభ కోలాహలములోనే తెర లేచేటప్పుడు ప్రదర్శనమునకు వచ్చేవన్నె ఈ చప్పని దేవవ్రతుని స్వాగతముతో రాదనిచెప్పే రంగరచకుల అభిప్రాయముతో మనముకూడా ఏకీభవించవలసి ఉంటుంది. రసోద్రేకమున కని చెప్పాలన్నా దిగ్విజయసంరంభములో గల రసముకంటె ఎక్కువ ఏమిన్నీ ఈ శరసేతునిర్మితిలో స్ఫురించదు. రెండింటిని కలిపి

ఏకరసాంగములుగా చెప్పాదామంటే విభావానుభావస్థాయీభావాదులలో దేనికైనా ఈశరసేతువు ఏవిధాన ఉపచరించదు. ఇంతకూ పూర్వపు సంప్రదాయము ననుసరించి కొబోలు యుద్ధము రంగముపై చూపక అంతా మాటలలో వెళ్లపుచ్చినారు. జరిగినయుద్ధముకూడా అతిస్వల్పము. రెండుపక్షములలో సమానులు యుద్ధమునకు జోరుకోలేదు. యుద్ధమునకు సమపడిన చంద్రశేఖరునిభుజములు ఆరంభములోనే అరికట్టబడినవి. సోమపాలుడు ఇటు అటు పరుగెత్తడమేకాని యుద్ధమా చేయనేలేదు. వచ్చిన జయసింహుడు కూడా ఆర్భాటమే చేసినాడు; పతాకము తెగింది; ఏను గుకు ములికినాటింది; శరములన్నీ తునకలైనవి; సైనికులు బూరుగు దూదిగా ఎగిరిపోయిరి; కంపనాస్త్రము అందరిని పడవేసింది; అని తెరలో జరిగినట్లు చెప్పిన దేదో అదే ఈఅంకములోని యుద్ధమంతా. దేవవ్రతు నికి ఒక్కమారైనా శరముసోకనైనా సోకలేదు. ఈ యుద్ధవర్ణన వీరరస పోషక మని మనము భావించవలసి ఉన్నది.

అంతే కాకుండా ఈ అంకములోని వీరము కళంకితమైనది. అలంకారికుల మతములో విరుద్ధములనే వీర శాంత కరుణ రసములకు మైత్రిని కవి కల్పించ యత్నించెను. వీటికి మైత్రి అసంభవమని ప్రధానసూత్రము లలో అలంకారికు లందరూ ఘోషిస్తూ ఉన్నప్పటికీ, కవి వాటికి ఏకీ భావము కల్పించబూని చాలాప్రయాసపడినారు. అవును; అలంకారికులు కూడా తుదకు కొన్ని సిద్ధకవిప్రయోగములను తీసి, ఈ సహజవిరుద్ధము లైన వీరశాంతములకు అనుగుణ్యా మున్నట్లు చూపియున్నారు. ఆగుణమునే వీరు ప్రధానముగా చేసుకొన్నట్లు నాటకములో శబ్దతః ఉట్టంకించి ఉన్నారు. దేవవ్రతు కిందు సోమపాలుడు (పుట 8); శంతనుడు స్వగత మున తనవిషయమై (పుట 16); దేవవ్రతుని విషయమై (పుట 17); దేవ వ్రతుడు శంతనుని విషయమై స్వగతమున (పుటలు 17, 18, 20); ఈ స్థలములలో వీరకరుణశాంతములకున్నూ, శంతనునిలో (పుట 19) వీరశృంగారములకున్నూ సామానాధికరణ్యము కవి వర్ణించిన్నీ, శబ్దతః చెప్పిన్నీ ఉన్నారు. ఇవన్నీ శబ్దదోషము లగునో కావో అలంకారశాస్త్ర

పండితులు పరిష్కరింతురుగాక. ఇట్టి వర్ణనకు ఉదాహరణము లున్నా, శాస్త్రసూత్రములు గౌణముగా అంగీకరించినా, ఇన్నిమార్లు దప్పు వాయించినట్లు ప్రకటించవలసిన అవసరముగాని, రుచివిశేషముగాని కానరాకున్నది. ఈ రసముల సామానాధికరణ్యమునకు అనుగ్రహ మున్నా అట్టిస్థితికి "ఏకీభావము" అనవచ్చునా అని నాకు శంక కలుగుచున్నది. ఒకవేళ ఏకీభావము అనడానికికూడా ప్రమాణమున్నా "వీరము శాంతమై, శాంతము కరుణమైన" దనే వర్ణనములోని పరిణామమునకు ఆధార మెక్కడిదో తెలియకున్నది. ఇక్కడికి మూడురసము లైనవి. ఇక మిగిలిన రసములకు కూడా ఏకీభావము కవి సమకట్టినట్లు వర్ణించినారు. పరశురాముని కలిసినతరువాత శంతనదేవవ్రతులు చూపిన వినయము, ఒక్కచోట (చూ. పుట 23) కనబరచిన భయము; పరశురాముడు చూపిన రౌద్రము, దీని సంతటిని పరిహాసముక్రింద సమన్వయము చేయుట (చూ. పుట 23) గంగాదేవి వచ్చినతరువాత శంతనుడు జహ్నుకన్య మొగము చూడ సిగ్గుపడుట; తల్లిదండ్రులు పుత్రునిపై చూపిన వాత్సల్యము; ఇవన్నీ వీరరసప్రవాహములో నడ్డముగా వచ్చుచుండిన తునకలు. వీటిలో వ్యక్తమైన శృంగారాదులతో బీభత్సక్రోధ అద్భుతము లను మాత్రము కలపకపోవుటచేత నవరసముల ఏకీభావమునకు సమయ మొకటి పోయినట్లైనది. ఇట్టి రసముల ప్రయోగముకూడా అలంకారశాస్త్రము ఒప్పునా, ప్రాచీనసంస్కృతనాటకములలో సంప్రదాయమున్నదా అనే ప్రశ్నలకు తగిన విమర్శనచేయ నాకు పాండిత్యావకాశములు చాలవు.

ఈలాగున్నది మొదటిఅంకములోని వీరరసము. ఇక రెండో దిగ్విజయ వర్ణనావసరమున స్ఫురించే వీర మెట్లున్నదో చూదాము. యుద్ధము యొక్క జయఫలము, విజయోత్సవముల సంగతి వింటాము. అంతకంటె యుద్ధసంబంధమైన కోలాహలముతో ప్రేక్షకుల వీనులు మనస్సులు పర్యాప్తము పొందవు. అప్పటికిగాని రసాస్వాదన మైనట్లు ఎట్లు చెప్పగలము? ప్రతాపమనే విభావము, యుద్ధమనే అనుభావము, గర్వధృతి మర్షములనే భావములు, ఉత్సాహమనేస్థాయి, ఉచితమైన ఆలంబనోద్దీప

నములు [దశరూపకము VI. 73] ఈమొదలైన అంగములతో పొంగి పొర్లుతూ నాటకమంతా, రంగమంతా కప్పి, ప్రేక్షకులను పూర్తిగ ముంచి వేయునపుడుగదా వీరరసము నాటకరసము అగును. మనోనుకూలమైన అర్థమందు ప్రవర్తకము; కార్యారంభములందు సంరంభమైన ఉత్సాహము ఇవేవిన్నీ కానరావు. వీరరసమునకు తగిన ఉదాహరణము వేణీసంహారము. దానిలో వర్ణితమైన రసోద్రేకము, అది ప్రేక్షకులను ఆకర్షించిన విధము ఈ నాటకములో వ్యక్తమవుతున్నవా అని అడుగుతున్నాను. ఏమాత్రమైనా వీరరసముంటే అది ఏకదేశమవుతున్నది. ఎట్లుచూచినా భీష్ముడొక్కడే తగిన వీరపాత్ర; వీరసహాయుడైన సుహృత్ కుమారాటవికులు, సామంతసైనికాద్యులు [దర్పణ 77 కారిక] ఎవరూ పాత్రలు కానరారు. మొదటి అంకములో వీరునివలె సూచితమైన శంతనుడు ఆ అంకము దాటినదగ్గిరనుంచి తుదకు నాటకాంతమువరకు శృంగార పాత్ర అవుతున్నాడు. ఇక శంతనుని సైనికులు, సోమపాల చంద్రశేఖర జయసింహులు మాత్రమే ఉన్నారు. వారొక లెక్కకాదు. పరశురాముడు కూడా వీరపాత్రే అని చెప్పగలమా? భీష్ముడైనా వీరపాత్రగానే తుదవరకు ఉండెనా అంటే చెప్పలేకున్నాము.

నాటకములో భీష్ముడు ప్రతిజ్ఞకై వచ్చియున్నాడు. భీష్మప్రతిజ్ఞ పామరుల కొకవేళ వీరమన్నట్లు ద్యోతకమైనా, నాటకకర్త పండితులు అలంకారశాస్త్రరీత్యాగాని, లేక లోకానుభవమునుబట్టిగాని, ప్రతిజ్ఞ వీరరసభావముగా భావించరుగదా! భీష్ముడొనరించినది స్వార్థత్యాగము; అందుకొరకు చూపిన దీక్ష, పడినకష్టములు, నాటకవస్తువులోకి చేరే ఉంటే ప్రేక్షకుల హృదయమును కరిగింప వచ్చును. స్వార్థత్యాగమును బుద్ధిపూర్వకముగా పట్టుదలతో చేసేవారు ధైర్యశాలులు, అసాధారణ మహనీయులు. ఆ త్యాగమును వివరముగా వర్ణించిఉంటే, ఆ రసమే మగునో అనే ప్రశ్న అప్రస్తుతము. నాటకములో ప్రతిజ్ఞ చేసినట్లు, చెప్పియుండుట కంటె ఆ ప్రతిజ్ఞకు అంతకంటె ఎక్కువస్థానమును నాటకములో కల్పించలేదు. ప్రతిజ్ఞ స్వార్థత్యాగమువలెనే వీరము కానేరదు.

అగునంటే ప్రాయోపవేశము, సహగమనము కూడా వీరములు అయి తీర్పవలసి ఉంటుంది. హరిశ్చంద్రులు, శిబిచక్రవర్తి, లక్ష్మణుడు, రాముడు బుద్ధుడు, యయాతికొడుకు, వీరందరూ వీరులే కావలసివచ్చును. దేవవ్రతుని ప్రతిజ్ఞకూడా అట్టిదే. ఇందులో మెచ్చుకోదగినది, అసాధారణమైనది లేకపోలేదు. అంతమాత్రాన వీర మనిపించుకోదు. అందుకు ప్రాచీనసంప్రదాయము, అలంకారశాస్త్రసమ్మతము ఉండితీరవలెను. అంతేకాకుండా ప్రతిజ్ఞ వీరరసముయొక్క ఆవిర్భావమే అంటే; ఈ ప్రతిజ్ఞకున్నూ మిగిలిన ఆవిర్భావములైన దిగ్విజయమునకున్నూ ఎట్టి సంబంధమూ లేదు. రెండూ వేరు వేరు సంగతు లైనపుడు ప్రధానరసమైన వీరముయొక్క ఆవిర్భావములుగా అవి, నాటకములో ఎట్లు పొసగును? ప్రతిజ్ఞే వీరమంటే, మూలములో లేక దానికి నైరంతర్య మెక్కడ కుదురును? ఏ విధాన పొసగకుండా ఉన్న ఈ దిగ్విజయములకల్పన ఎందుకు? అంతే కాకుండా ఈ ఫలమైన ప్రతిజ్ఞయొక్క ఆరంభమెక్కడ? అట్టి ప్రతిజ్ఞకు ఔత్సుక్య ముండదుకదా. ఒకవేళ అసాధారణప్రజ్ఞగల ఈ శాశ్వతబ్రహ్మచారికి అట్టి ఔత్సుక్యము ఉండునన్నా, అది కొనసాగి తీరవలెననే పట్టుదల ఉండదుకదా. అందుచేత ఆరంభాదులు దానియందెట్లుపట్టును? ఇంతకూ ఆ ప్రతిజ్ఞ ఒకకార్యసాధక మవుతున్నది. సాధన మెప్పుడూ కార్యమునకు అంగమగుటచేత, దానిరసముకూడా కార్యరసమునకు అంగమై పోవును. కార్యము ఈ నాటకములో శృంగారరసప్రధాన మైనది. అట్టి సంబంధమును కృతికర్త ప్రస్తావనములోను, వారి హృదయమును బాగా ఎరిగినవారి మిత్రులు పీఠికలోను స్పష్టము చేసినారు. "శాంతనవుని బ్రహ్మచర్య ప్రతిజ్ఞయే ప్రధానముగా నెఱవేఱిన సత్యవతీశంతనుల పరిణయము" (పుట 2) "శంతనుపుత్రుని బ్రహ్మచర్య ప్రతిజ్ఞయే ప్రధానకారణముగా వారి పరిణయమనోరథము నెఱవేఱుట" (పీఠిక) ఇట్లైనపుడు ప్రధాన మేదో అంగమేదో వేరే చెప్పవలెనా? ప్రధానరసము ప్రధానవిషయమునుపట్టి ఉండునా, లేక అంగమునుపట్టి ఉండునా?

నాటకమునకు శృంగారమో, వీరమో ఏదో ఒకరసమని అలంకారికులు అభిప్రాయము [దశరూపక 3-33]; మిగిలినవి అంగములు గాను, ప్రాసంగికములుగాను వైరుధ్యము లేకుండా ఉండవచ్చును. "నాటకే శృంగారవీరరసయో రన్యతరస్య ప్రాధాన్యం; అన్యేషాం రసానాం అంగత్వేనానుప్రవేశః" [ప్రతాపరుద్రీయము III 5,1.] ఆలాగైనపుడు శృంగారవీరములు రెండుండి ఒకదాని కొకటి అంగముగాగాని, ప్రాసంగికముగా గాని ఉండవచ్చునా అనే ఆక్షేపను చాలా ముఖ్యమైనదగునుకదా! శృంగారమునకు వీరము విరుద్ధమగునా కాదా అని నాకొక ప్రశ్నగలిగి, నా సామాన్యజ్ఞానమును అనుసరించి విమర్శించుటకంటె ప్రాచీనుల ఆలంకారశాస్త్రజ్ఞుల మతమేమో కనుగొనుటకు ప్రయత్నించినాను. ఈ వైరుధ్యచర్చ ఎక్కడచూచినా, ఏకదేశవ్యాపకమైనదే కాని నాటకము మొత్తముపైని చేసినఉదాహరణ మొకటైనా కానరాలేదు. ఒకశ్లోకములో వైరుధ్య మున్నదాలేదా అని వారుచేసినతర్కము నా ప్రస్తుతప్రశ్నకుసరిపోలేదు. మొత్తముమీద చాలాచోట్ల వైరుధ్య పరిహారమునుచేయుటకే వ్యాఖ్యాతప్రయత్నము. కాళిదాస భవభూత్యాది మహాకవుల ప్రయోగములు ప్రమాణములు, శాస్త్రమర్యాదాకల్పనములు కావున, ఈ వైరుధ్యలక్షణమునకు లక్ష్యములుగా చెప్పలేక పరిహారమును చేసినారు. ఐనా శృంగారవీరములకు వైరుధ్యము చెప్పినారా లేదా అని చూడగా, శృంగారముతో వీరమునకు పరస్పరవిరోధము చెప్పి, వీరమునకు విరోధులను చెప్పుటలో మాత్రము శృంగారమును ఉల్లేఖించలేదు. [దర్పణ. 242 కారిక "ఆద్యః కరుణబీభత్స రౌద్రవీరభయానకైః; భయానకేన శాంతేన తథావీరరసః] ఇట్లు చెప్పుటలో సారస్యమును కనిపెట్టి శృంగారము ప్రధానమైతే వీరము విరుద్ధమగును కాని, వీరమే ప్రధాన

---

1 కాని నాటకమునకు ప్రతిజ్ఞాశాంతనవమని ప్రధాననామముంచి అభిజ్ఞానశాకుంతలమునకు అనుకరణమా ఏమి? — నాటకము వీరరస ప్రధానమని చెప్పుటచేత, ప్రతిజ్ఞ వీరరసవ్యంజకముగా నాటకకర్త కూడా భావించినారా అని ఒక అనుమానము పుట్టకమానదు.

మైనయెడల శృంగారము కాదనివాదించెదరేమో, ఇదమిత్థమని నేను చెప్పలేనుకాని, ఎక్కడైనా రెండురసము లుంటే, ఒకటిప్రధానము రెండోది అంగము అగును. అంగము ప్రధానమును పరిపోషించి, దాని ఉత్కర్షను తేవలెను. ఇక్కడ ఈ అంగాంగీసంబంధమే కుదరదు. కాన పుడు రెండూ స్వతంత్రములందమా? అట్టి ఏర్పాటు సంప్రదాయసిద్ధమా? కాదేమోఅని నాభయము. ప్రాచీనులమతములోకూడా ఇట్టి వైరుధ్యమును ఆశ్రయాలంబనములు మార్చి పరిహరించవచ్చును. అనగా వీరమునకు దేవవ్రతుని, శృంగారమునకు శంతనుని ఆశ్రయములుగా చేసినచో, రెండు రసములు, ఇద్దరునాయకులు సిద్ధమగుదురు. అందులో ఒకరిని ఉపనాయకుడందమంటె నాయకోపనాయకులకు ఒకకథ ఒకరసము ప్రతిబింబించవలెను. దేవవ్రతశంతనులకు అట్టిసంబంధము సందర్భించదు. ఒకవేళ కుదరవలెనంటె, శంతనుడు నాయకుడు, దేవవ్రతుడు ఉపనాయకుడు కావలసివచ్చును. అప్పుడు శృంగారము ప్రధానరస మగును. సత్యవతి నాయిక అగును. వీరరసము ప్రధాన మంటే నాయిక లేకపోవును. కాని నాటకముచదివేవారికి సత్యవతి నాయికవలె తోచకతప్పదు. వేరే మరొక నాయిక లేనందున ఎట్టి సామరస్యము కుదరకుండా ఉన్నది.

శృంగారమే ప్రధానమంటే స్థాయీభావాది రసావస్థలు, ఔత్సుక్యాదికార్యావస్థలు చక్కగా అత్తునుక్కొంటోల్లు. ఒకకథ ఒకజత నాయికానాయకులు కనబడుదురు. కథకు ఆరంభము, ఉపసంహారములు వ్యక్తమగును. గ్రంథవిస్తృతిని పట్టిచూచినా శృంగారకథే ఎక్కువస్థలమును, ఎక్కువకాలమును ఆక్రమించును. సత్యవతీపరిణయకథ శృంగారకథగదా. మొదటి అంకము 24 పుటలు (5-28); రెండోదానిలోని విష్కంభము 4 పుటలు (29-32); మూడో దానిలో ఆఖరి రెండురంగములు 3 పుటలు (65-67) మొత్తము 31 పుటలు వీరరసకథ. మిగిలిన 67 పుటలు శృంగారరసకథ. ఇట్లుండగా శృంగారరసకథను ప్రాసంగికమనడమెట్లో తెలియదు. పోనీ శృంగారమే ప్రధాన మందామంటే అదికూడా ప్రేక్షకులు ఒడలుమరచేటట్లు నిండుగా వర్ణితముకాలేదు. దానినైనా బాగా పోషించలేదు. ప్రథమదర్శనమపుడు ఒలికేశృంగారములేనే లేదు.

మాలిని ప్రియంవదానసూయలను, శంతనుడు దుష్యంతుని, గంధవతి శకుంతలను, పాంథాశ్రమము కణ్వాశ్రమమును పోలియుండే వర్ణనలోను, పొదచాటున దాగుకొనుటలోను, జాతిసంబంధమైన చర్చలోను, ఒకరి వృత్తాంతము ఒకరికి చెప్పుటలోను ఇట్లు అనేకాంశములలో ఈ భాగము శాకుంతలమును అనుకరించినా, కాళిదాసు పోషించిన ఆ నిండుశృంగారమును శాస్త్రిలవారు తేలేకపోయినారని చెప్పినచో శాస్త్రిలుగారు క్షమింతురుగాక. శాకుంతలమును మనస్సులో ఉంచుకొని, ఈభాగము వ్రాసినట్లు గ్రంథకర్త అంగీకరించినారు. "శంతనుడు-సుదతీ! నీవు శకుంతలాపరిణయ వృత్తాంతము వింటివా." ౧ (పుట 47) మూడో అంకములోకూడా శృంగారవర్ణనకంటె శృంగారవిషయికచర్చ హెచ్చు, ఈ తర్కము మరొకరసము కానందున శృంగారమే అని అన్వయించవలసి ఉంటుంది. శకుంతలకూడా గురుజనులఆజ్ఞ అవశ్యముకాదా అని చెప్పినప్పుడు దుష్యంతుడు శంతనునివలె తలవంచుకొని "అయితే అడిగిస్తాను" అని ప్రియసఖిని విడిచిపోలేదు. అవును; ముందు ప్రతిజ్ఞ జరగవలసిఉన్నది కాబట్టి, గాంధర్వమున వివాహమెట్లు అని శంకించేవారికి ప్రత్యుత్తరముగా నేనుచెప్పేదిలేదు. ౨ నాటకముగా; రచించువారు ఎట్లు రసహీనము

---

౧. శాస్త్రిలుగారు ప్రయోగించిన సొగసులను చదువరులు గ్రహించ లేరని భయము కలిగికాబోలు, అనేకస్థలములలో ఆసొగసులను శబ్దతః ఉట్టంకిస్తూ ఉందురు.

౨. మూలములోని గాంధర్వరాక్షస వివాహములచర్చ శాస్త్రిలుగారు నాటకములోనికి తెచ్చిపెట్టినారు. గాంధర్వమా నాయిక కిష్టము లేకపోయింది; రాక్షసమా రాజు కిష్టములేదట. తండ్రి అనుజ్ఞలేకపోవుటచేత నాయిక గాంధర్వము అంగీకరించలేదు; పోనీ; వలచిన హృదయమున్నదా? ఉన్నప్పుడు రాజు రాక్షసమంగీకరించుటకు ఆటంకమేమున్నది? క్షత్రియులకు రాక్షసము ప్రశస్తమేగదా! నాయికావిషయమై కారణము చెప్పినట్లు రాజువిషయమై ఏదీ చెప్పలేదు. ఏ ఉపపత్తీ కానరాదు. ఇంతకూ నాటకము నడవాలిగదా!

కాకుండా ఆభాగమును పొందుపరుస్తాడో వారిపూచీ. మూలము మార్చ మని నియమము లేదుకదా. ఇంతకూ రసస్ఫూర్తికి వివాహమైతీరవలెననే షరతు లేదు. రసప్రాదుర్భావము చేసి విడిచి, భావవిచ్ఛేదదోషమునకు లక్ష్యముకాకుండా రసమును పోషించకపోతే నాటకముఖ్య ప్రయోజన ములలో ఒకటి చెడుతుంది. ఇందుకు సహృదయులే ప్రమాణము. ఇక్కడ శాకుంతలను, మొదటిఅంకములో ఉత్తరరామాయణమును, అయోగశృంగారవర్ణనలో రత్నావళిని నాటకకర్త మనస్సున ఉంచుకొని నారా ఏమి? కావచ్చు. అది మంచిసంగతే.

నాటకములో రసము వెల్తిగా ఉండిపోవుటకు నాటకకర్తగారి నియమములే కారణ మని నా సమాధానము. వీరరసప్రధానమైన నాట కము వ్రాయవలెనని ఉద్దేశించి, స్వతఃశృంగారప్రధాన మైన ఇతివృత్త మునుఎంచుటచేత రసద్వైవిధ్యము సంభవించినది. మూలములో లేని వీరము తెచ్చిపెట్టుకొనుట, సరళముగాఉన్న శృంగారమును అప్రధాన మనిగాని, అంగమని కాని, ప్రాసంగికమనిగాని ఉపేక్షించప్రయత్నించుట, ప్రతిజ్ఞ వీర మని భ్రమపడుట, ఆ వీరము చాలదని, అతని దిగ్విజయములను వీరపోషణమునకై ప్రవేశపెట్టుట, మొత్తముమీద ఏ రసమును నిండుగా పోషించ లేక పోవుట, ఈ యిక్కట్లన్నీ సంభవించినవి. వీరరసప్రధాన మైననాటకమే వ్రాయవలె నని ప్రతిజ్ఞఅయినచో మరొకఇతివృత్తము లేకపోలేదే.

ఇప్పటికే విమర్శనము అతివిస్తార మైనదని మిగిలిన అంశములను చర్చించకుండా పేర్కొనివిడిచిపెట్టుతాను. నాటకములోని అంకములు నవీనప్రాచీనసంప్రదాయములమధ్య పడినవి. ప్రాచీనులమతములో ఒక అంకములోని కథ, ఒకరోజున, ఒకస్థలమున, ఒకఊపున జరిగే ఇతి వృత్తము కావలెనని కనబడుతున్నది. అంకము పూర్తియైనదాకా తెర వాలదు. రంగములను నవీనపద్ధతిప్రకారము కల్పించేటప్పుడు, ఒకొక్కరంగము ఒకొక్కచిన్నచిన్న అంక మవుతుంది. ఒకఅంకములో తెరవాలని రంగములుఉంటే, ఏ సంప్రదాయము పొసగదుకదా. అంతే

కాకుండా రంగమునడుపుట ఎట్లో! ఒకటి, మూడు, నాల్గు అంకము లలో ఒకరంగమునుండి మరొకరంగమునకు పోవునపుడు, ఒకక్రమము లేనందున ముందుకు వెనకకు నడవవలసివచ్చే ట్లున్నది.. నాటకము త్రేతాయుగసంబంధమైన ప్రాచీననాగరికతకు చెందినదైనా కుర్చీలు, పడకకుర్చీలు వార్తాపత్రికలు మొదలైన సామగ్రి వాడుకలోకి కవి తెచ్చినారు. యౌవరాజ్యాభిషేకమప్పుడు శంతనుడు, సామంతరాజ్య పరిపాలనాచర్చ సమయమున దేవవ్రతుడుచేసిన పౌరజనసభలు, ఆ సభల లోని వాదప్రతివాదములు ఈ రోజులలో జరుగుతున్నసభల అనుకరణ ములా అని అడగవలసి ఉన్నది. అట్టివే కాబోలు నాటకము లని విజ యోత్సవములు కూడా. ఈ రెండుఅంశములు మనస్సులో ఉంచుకొనే కాబోలు "ఆధునిక నాటక రంగమున కిది యెంతయు నర్హమె" అని పీఠికలో వ్రాసినారు. కొన్ని మంచిసంగతులు లేకపోలేదు. పాత్రల వేషములను గ్రంథకర్త ఎట్లు వారిమనస్సులో చిత్రించుకొనిరో అందుకు సూచనలను నాటకములో పొందుపరచినారు. (చూ. "ఆ కావిబట్టగూడ కట్టువాడా" పుట 11) మొదటి అంక యుద్ధవర్ణనలో యుద్ధధర్మములను చక్కగా సూచించినారు. మొదటిఅంకము ప్రదర్శ నమున చాలా చిక్కుపెట్టేదైనా, నాటకకర్తయొక్క వర్ణనలను పొందుపరచి చూపించగలిగినారా ప్రదర్శనము రంజకముగా ఉంటుంది. ఇదేమోస్తరు సుగంధిదేవవ్రతదాశరాజుల సంభాషణసమయమున ప్రక్కగదిలో పొంచి ఉండుట. అది రంగమున ఎట్లు కుదురునో "దాశకుమారీ! ఇటరమ్ము" ఎక్కడ ఉన్నది ఆమె? గదిలోఉండి ఆడుచున్న స్వగతములు ప్రేక్షకులకు ఎట్లు వినబడును?

పాత్రశీలవర్ణనగురించి కొంత చర్చకు అవకాశమున్నా గ్రంథ విస్తృతిభీతిచే అన్నిటిని వదలి, ఒక్కఅంశమును సూచిస్తాను. సత్యవతికి శంతనునిపై మోహము ఉద్భవించినదో లేదో కాని, దేవవత్పుత్రిని చూడ గానే అతనిపై వలపుకలిగిందా, కలిగినదానిని మహాపాతక మని అణచి వేయ యత్నించిందా, ఎంత నిర్మూలముచేయ ప్రయత్నించినా లీన

చైతన్యములో నుండి ఆ వలపు ఉబుకుతూఉండెనా అనే ప్రశ్నలకు అవకాశ మిచ్చేటట్లు సత్యవతి కొన్నిమాటలు పలికింది చూడండి-

పుట 100. ఇట్టిమహోదారుడవు నీవు రాజ్యము సేయుట కోర్కె లేక కోరిన ట్లయింది. (విషాద మభినయించును.)

పుట 101. ఇంకేమి నాయనా నీకోర్కె దీరెగదా? (తత్తరముతో)

పుట 101. ఎంతపని చేసితివి? ఇట్లయిన లోకముహర్షించునా? దైవము సహించునా? అకటా! దీన నేమి రానున్నదో కదా!

103. ఎంతపని పుట్టెను? ఇప్పుడైన నితడు ఊరుకొనునా? ఇన్ని హిరణ్యాక్షవరములతోఁ బెండ్లియైన నేమి ప్రయోజనము? ఇపు డేమిగతి?

(అత్యాశ్చర్యముతో) ఆహా! ఇతడు మందాకినీనందనుడా?

103 (మనోవేదన నభినయించి) హా దైవమా! ఇట్టి లోకోత్తర చరితుడగు కుమారున కిహలోకసౌఖ్య మిసు మంతయు లేకుండ జేసితివా? అకటా!

"పుత్త్రు రునకొకఁ డెవ్వఁడే నరవరుం డను
మాటయ కల్గుగాని, యీ
వననిధివేష్టితోర్విపరిపాలన
మావె యొనర్తు వెమ్మెయిన్."

ఈ పలుకులన్నీ కరుణావాక్యములే కాక పోవచ్చు నని ఆధునిక లీన చైతన్యస్వరూపవేత్తలకు తెలియును. సత్యవతి శంకించిన పొరపాటు ముందు కలిగిన కౌరవవంశ నాశనముగా పరిణమించెనా యేమి? గ్రంథ కర్త ఈ అంశములను కనిపెట్టినచో, నాటకములో అట్లు ఉంచియుండ రని వేరే నేను చెప్పనక్కరలేదు.

నాటకముపైనే వేయవలసినది కాక పోయినా, మొదటిమూల కథకే చెందేదైనా ఒకప్రశ్న వేయవలసి ఉన్నది. ఒకమారు దేవవ్రతుడు యౌవరాజ్యాభిషిక్తుడైనవాడుగదా! అతడు శంతనుని తరువాత రాజు కాకుండా, వేరేవిధమునైనా జరుగుటకు, జరిపించుటకు ఎవ్వరికైనా అధికారము కలదా? ఇది వేరే విషయము కాబట్టి నాటక విమర్శనమును ఇంతతో చాలించెదను. నాటకము గ్రంథమగుటచేత చదువరుల అధీనమై యున్నది. దానిరసమును కల్పనాచమత్కారమును విమర్శించి ఆనందించేహక్కు అందరికీ కలదని విన్నవించుచున్నాను.



# ౨౮

# జయంతి గంగన్నగారి సుమబాల



ఆంధ్రకవిత్వమును నూతనావిర్భావము పొందుతూ ఉన్న సమయాన ఉదయించే కవన నక్షత్రములను తరచి తరచి అవలోకించుట చాల ముఖ్యమైన ధర్మము. వాటి కాంతి ఉదయకాలమందు మాత్రమే ప్రకాశించి చల్లారునదా, లేదా శాశ్వతముగా,—మనము ఆమాట ఇప్పుడప్పుడే నిర్ణయించలేమని—కొంతకాలము వరకైనా ప్రకాశిస్తూ ఉండేదా అనే సమస్య పరిష్కరించుటకు దానిని పోషించే రచనాంశము లను విమర్శించవలసి ఉంటుంది. దేశకాలసంకోచము లేకుండా మానవ హృదయాన్ని ఒకేలాగు రంజింపజేయగలిగే రసము; పశుసామ్యము నుండి లేవనెత్తగలిగే భావము; ఈ రసభావములకు అనుగుణమై యుండి, చెవికి ఇంపునిస్తూ, తరచినకొలదీ స్వారస్యమును వెలిబుచ్చే పదముల గుంభన; సామాన్యానుభవమునకు సానపెట్టే రూపకాదులను నిర్మించగలిగే భావన—వీటి మేళవింపేగదా కావ్యమునకు శాశ్వతత్వమును సంపాదించ గలదు. వీటిలో ఏవి ఏపాళ్ళలో ఎట్లు సుమబాలలో మేళవింపు పొంది యున్నవో చర్చించి చూదాము.

సుమబాలయొక్క గ్రంథవిస్తృతిని జూచి, ఖండకావ్యముగా కొందరు అభిప్రాయపడి యున్నారు. ఖండగ్రంధానికీ పూర్ణగ్రంథానికీ గల భేదమంతా విస్తృతిలోనే అయితే వారి అభిప్రాయాన్ని మనము ఆమోదిస్తాము. కావ్యానికి ఉండవలసిన లక్షణాలన్నీ సుమారుగా పట్టి యున్నవి. ఏదీ ఖండముగా స్ఫురించదు. కథ పూర్ణమైనది.; పాత్రల శీలము పోషింపబడి వ్యక్తమవుతూ ఉంటుంది; కావలసినన్ని వర్ణనలూ, కల్పనలూ ఉన్నవి; భావములూ, శైలీ గభీరముగ ఉండును. కాబట్టి ౧౭౦౨ ద్విపద పంక్తులే అయినా, విస్తృతికి చిన్నదిగా కనిపిస్తున్నా

సూచింప బడేదీ, భావనలో స్ఫురించేది విస్తారముగా ఉంటుంది. చదువుటకు రెండు గంటలకంటే ఎక్కువకాలము పట్టకపోయినా, చదవడము పూర్తియైన కొలదీ భావన, ఆలోచనలు ఎక్కువై, ఆ చదివినది ఎంతో లోతుగా ఉన్నట్లు తట్టుటచేత దాని కొక బాహ్యముకాని విస్తృతి ఉన్నట్లు తట్టుతుంది.

కవి అభిప్రాయములో గ్రంథవిస్తృతి ప్రాముఖ్యము వహించే ఉంటే, సులభముగా ఆ కార్యమును సాధించి ఉండగలడని ఊహించగలము. కథను పెంచి వర్ణించుటకు కవి ఒప్పుకొననట్లు తోస్తుంది; కథలో ఏ పట్టునా కూడా కథనముకొరకు విలంబనముచేయు రచన కానరాదు. ఇందు ముఖ్యహేతువును నేను ఇట్లు ఊహిస్తాను : కవి యొక్క ఆశయము కథాకథనము కాదనిన్నీ, సామాన్యకథారీతిని కవి అవలంబించి యుండలేదనిన్నీ స్పష్టమవుతూ ఉంటుంది. కావ్యము తొమ్మిది ఆశ్వాసములు కలది; ఒకొక్క ఆశ్వాసములో కథాభాగము ఒకదానిని వర్ణించెను. కాని ఒక ఆశ్వాసము నుండి రెండోదానికి—ఒక్కచోట తప్ప, ౭ నుంచి ౯ కి తప్ప—కథ సాక్షాత్తుగా నడవదు. ఏ ఆశ్వాసానికి ఆ ఆశ్వాసమే స్వతంత్రమా అని తోస్తుంది; దాని ఉపసంహారము దానిదే. ఒకొక్క ఆశ్వాసము ఒకొక్క ఖండకావ్యమా అని కొన్ని చోట్ల తోచక మానదు. విశుద్ధరత్నములను ప్రత్యేకముగా ఒకొక్క దానిని సంపాదించి, సానపెట్టి, తొమ్మిది అటువంటివి సమకూడిన తరువాత, నవరత్నమాలగా చేసే రత్నవర్తకుడా ఈ కవి అన్నట్లు తొమ్మిది ఖండకావ్యాలను ఒక కావ్యముగా గుప్పినాడని చెప్పినా చెప్పవచ్చును. ఈ సామ్యమువల్ల సంపాదించే యుక్తి ఒకటి కలదు; ఈ కావ్యములో ఆధునికయుగచిహ్నమైన ఖండకావ్యాన్ని, ప్రాచీనసంప్రదాయమైన పూర్ణకావ్యాన్ని మేళవించెనా అని చెప్పవచ్చును.

సమ్మేళనమును కవి అనేకరీతులు సంపాదించియున్నాడు. కవిలో ఈ సమ్మేళనము బాగా ఉన్నది. పాశ్చాత్య వాఙ్మయముల

ఫలములను పొందిన ఈ ఆంధ్రయువకునిలో ఈ సమ్మేళనము ఉద్భవించుట ఒక వింతకాదు! చాలచోట్ల నాటకపద్ధతిని, నవలలరీతిని, పురాణ ఫక్కీని, ఖండకావ్యాలధోరణిని అవలంబించి, రచనకు నూతనత్వమును సంపాదించినాడు! ఈ కథకు ముఖ్యపాత్రలు నాయికానాయకులు కుందవ విమలులు; కుందవకథ ౨, ౪, ౬, ౮ ఆశ్వాసాలలోను, విమలుని కథ ౧, ౩, ౫, ౭ ఆశ్వాసాలలోను నడుస్తూ, ౯వ ఆశ్వాసములో (అఖరుది) రెండు కథలూ ఇద్దరి సమావేశములతోపాటు కలిసిపోతవి.

పూర్వలక్షణము ప్రకారము, ఈ పాత్రలను ధీరోదాత్తులని వర్ణించవచ్చును. ఉదారహృదయులు; ఉన్నతాశయములు గలవారు; స్వాతంత్ర్యాభిలాషులు. భౌతికసుఖముకంటె ఎక్కువగా ఆత్మసుఖమును ఎంచినవారు, తనను హృదయపూర్వకముగా, అనన్యాపేక్షముగా, వరించినవానినే చేపట్ట నిశ్చయించుకొన్న క్షత్రియకన్య కుందవ. ఇక విమలుడో, స్వాతంత్ర్యముతో కూడుకొనియుండని ప్రేమ ప్రేమకాదని అతని మతము. 'రాజ్యంబు, దేహంబు, ప్రాణంబు నీవి. నా హృదయ మది యింక నా యధీనంబె.' ఇతని ధైర్యము, ధర్మబుద్ధి, ఔదార్యము మొదలైన గుణములు అన్ని అతని క్షాత్రశీలమునకు ఉచితములుగా ఉంటవి. కథనములో అంతగా కానరాకున్నా, కథకు కారకులైన రారాజు రాజేంద్రులు కూడా ఉన్నతాశయములు గలవారే. విజయము చేకూరెనని గాని, శత్రువు చెఱసాలలో ఉంచబడెననిగాని విఱ్ఱవీగే గర్వపోతులు కారు. వైరిని చంపక, తమ పిల్ల నిచ్చి పెళ్ళిచేసిన ఉదారులు ఆ చోళరాజులు.

ఈ పాత్ర లందరికంటె అనేకవిధముల ఆకర్షణీయురాలైన సుమబాల గురించి ప్రత్యేకముగా చర్చించవలెను. కవి హృదయములో కూడా ఈ పాత్రకే ప్రాముఖ్యము గలదని చెప్పవచ్చును. కవనమునకు నామధేయము ఈ బాలికవల్లనే గదా. ఇక పేరుయొక్క సార్థకము చూచినా చాలా ఆహ్లాదకరముగా ఉంటుంది. పువ్వులపిల్ల పెద్ద కుటుంబములోనిది కాదని మనము ఊహించినా, ఆమె ప్రవర్తనమూ,

ఆమె హృదయమూ ఆమె ఉన్నతశీలమును వ్యక్తపరుస్తవి. పూలుకోసి, దండలుచేసి, అర్హులైనవారికి ఇవ్వడమే ఆమె ప్రధానవృత్తి. మొదట కుందవ, తరువాత చెలియన్న విమలుడు, అంతమున అంబ—వీరు ఈమె పూలసేవకు పాత్రులైనవారు. కాని సుమబాల వాస్తవముగా గానబాలగా ప్రవర్తిస్తుంది. సుమములకూ గానమునకూ భావనాప్రపంచములో మంచి మైత్రి ఉన్నది. ఈ పిల్లశీలానికి ఉచితమైనవస్తువులే ఆ రెండున్నూ. ఈమెకు చక్కని కంఠమూ, సంగీతప్రావీణ్యమూ ఉన్నా, పాడడానికి తగిన పాటలు కావాలి; అందుకు గురువు చెలియన్న విమలుడు. పువ్వు లిచ్చి నేర్చిన పాటలు అవి; మనోహరములై తీరును. ఈ రెండు వస్తువుల వ్యాపారానికి అనుగుణమైన దింకొకటి ఆమెకు లభించినది. ఆమె ఒకపిల్ల; కాబట్టి ఎందుబోయినగాని, యేమి చేసినగాని, ఎవరి జేరినగాని యేమి పల్కినగాని తగు ననుచు, తగ దనుచు, ఇది చెప్పవచ్చు, అది చెప్పరాదని ఆమెను నిరోధింప అవకాశము లేకపోవుటచేత ఆమె సుమగానముల వ్యాపారానికి మంచి వీలు అమరింది. కాబట్టి కుందవ విమలుల అన్యోన్యపరిచయమునకు ఈమె సాధన మయింది; ఒకరి హృదయము ఒకరికి తనద్వారా ప్రతిఫలింపజేయ గలిగింది. ఆమె ద్వారానే గదా వీరి ఇరువురిప్రేమ ఉద్భవించి విరాజిల్లింది. నయనేంద్రియమునకు బదులు శ్రవణేంద్రియము ద్వారా హృదయమును స్వాధీనము చేసుకొన్నది వారిప్రేమ. కుంధువ విమలుల పెళ్ళి కుదరలేదని వినగానే ఈ అమాయికబాలిక పడ్డ మనోవ్యథవల్ల ఆమె వయస్సుకు చిన్నదే కాని ఊహలకు పెద్దదని తోచక మానదు. "ఆ దీనమగు నెలుంగా పెదవితొట్రుటు" మొదలైనవి (2, 130-135) ప్రౌఢాంగనావిలాసముల వలె తోచును. ఆ విధముగా చూస్తేనే ఆమె అంతయు అర్థమవుతుంది. దుర్గోపాసకురాలుగా ఉండిపోవడానికి తగిన వయస్సు మనస్సు కలది బాలిక కానేరదుగదా. ఆమె ఆడిన మాటలు, ఆమె చేసిన పనులు, ఆమె హృదయము, అన్నీ చూస్తే ప్రౌఢగా తోస్తుంది. అయితే సుమబాల బాలికా? ప్రౌఢా? అనే సందేహానికి పరిష్కారము ఎట్లు

కుదురుతుంది ? కవి పొరపాటు పడినాడా ? లేదా ముద్దులు బల్కుటకు బాలికను జేసి, గంభీరమునకు పాత్రధను చేసినాడా కవి? లేక ఆరంభమున బాలికయైనది తుదకు పెరగదా ఏమి? ఈ పెరుకవను (?) సాధించుటకు గాను కథనములోని ఒక్కొరోజు గణితము కాకుండా ఊహకు తగిన భావనాగణితమును ఉపయోగించాలి కాబోలు! ఈ హేతువులన్నిటిని బట్టి సుమబాల కేవల భౌతికప్రపంచవ్యక్తిగానే కవి ఊహించలేదేమో అని తోస్తుంది.

కథలోకూడ సుమబాలలేని కార్యమేదీ లేదు. కుందవవిమలుల ప్రేమకూ, తిరిగీ వారి వివాహానికీ కూడా ఆమె సాధనమై, అన్నిచోట్ల ప్రవర్తించింది. విమలునితో వివాహం కానివ్వకుండా చెసింది తానే అని కుందవ కుచ్చుకొంటూ ఉన్నపుడు, సుమబాల వచ్చి విమలుని గర్వసాహసములను నిరూపించింది. కుందవహృదయములో లేచిన కోలాహలమే మువ్వలబంతుల ఆటలోని కుందవతిరస్కారానికి కారణమైంది. ఉపవాసములు, ప్రాయశ్చిత్తార్థమై దేవీపూజ, అక్కడ తిరిగీ దయ్యంకథకు సుమబాలే కారకురాలు. కాని కలహప్రధానమైన బంతులాటలో మాత్రము ఈ నవనీతహృదయము గల బాలిక ప్రవేశించ లేదు; ఉచితమేగదా !

ఇట్లు ఒక విధాన్న అభౌతికమా అన్నట్లు తోచే శీలవ్యాపారము కలదీ, ఒక విధాన్న కార్యమునకు సాధనమాత్రముగా ప్రవర్తించేదీ కావడమువల్ల, ఈ పాత్రకు అట్టి అంతము సమంజసమైనది. ఏ కార్యముకొరకు వచ్చిందో, ఆ కార్యము పూర్తిజెందగానే అంత మొందినది. ఆమె పూలదండలకు, పాటలకు మరి ప్రయోజనము ఈ ప్రపంచములో లేదు. కుందవకు నీడగా అనన్యముగా ఉన్న ఈ పిల్ల కుందవనుండి విడిపోయి వ్యక్తిగా ఉండనోపదు. సుమబాలకు ఒక బావ ఉన్నా (2, ౧౧౭), ఆమె హృదయానికి తగిన కానుకగా ఒక పూలతీగె తెచ్చి ఇచ్చినా, ఆ బావపై ఆమెకు మనస్సు లగ్నము కాలేదు. విమలుడుకూడా ఆమెహృదయాన్ని ఆకర్షించినట్లు లేదు.

కుందవస్నేహము వినాగా ఆమె హృదయాన్ని మనము ఎరుగము. ఆమె పాటల గాంభీర్యమును పరీక్షించిచూస్తే ఆమెకు భౌతికానందము కంటె పరమైన సౌఖ్యవాసన ఉన్నట్లు కనబడుతుంది. ఏరీతిగా జూచినా సుమబాలకూ ఇతరపాత్రలకూ భేదముంది.

అందరి విమర్శకులను ఈ సుమబాల, * ఈమె పాడిన పాటలు ఆకర్షించినవి. ఈ కావ్యానికి "మేలు తిలకంబు దిద్ద నిర్మించినవా" ఇవి అన్నట్లు ఉన్నవి. వాటిభావాలు, భావన, వాటి ప్రయోజనము చాలా లోతుగా ఉంటవి. కథతో వాటికి సంబంధమున్నా వాటిని విడదీసి ప్రత్యేకముగా వాటియందున్న భావముల గౌరవానికని పాడుకోవచ్చును. కాబట్టి అవి చెప్పేదాని కంటె సూచించేదే ఎక్కువ ఆహ్లాదకరమైనది. కాని మూడో ఆశ్వాసములో ఉన్న "గగనమ" అన్నపాటఎవరు వ్రాసినది ? అనగా విమలుడు వ్రాసిందా ? ఎవరిపై అన్యాపదేశము? కుందవా లేక విమలుడా? సుమబాల పాడేటప్పుడు కలిగే సూచన ఏమిటి? ఇవి కొంచెము అన్యోన్యము అత్తవు. ఇందులో సూర్యచంద్రులు ఇద్దరూ ఆకాశాన్న వెలుగుతున్నారు. ఒకే కాలమందు కాదా? ఎట్లు ఆ భావన సూచనలు అత్తుతవి ? సామాన్యదృష్టికి అతీతముగా ఏదో ఉన్నది కాబోలు. దాని తరువాత పాట అలాగే ఉంటుంది "కని విని యెఱుగని కాంత" ఆమె. ఈ రెండు పాటలకూ మళ్లా ప్రసక్తి వస్తుంది. వీటివలెనే గంభీరమైనవి మరి రెండు ఉన్నవి. ౫, ౯ ఆశ్వాసాల అంతమున ఉన్నవి. ౯ వ ఆశ్వాసం కొసను అనగా గ్రంథాంతమందు ఉన్నది. సామాన్యదృష్టికి అతీతమైన ఆఖరి సుమ

---

* ఈ కవి సృజించిన ఈ సుమబాలకు మూల మెక్కడిది అనీ కొందరు చర్చించారు. బ్రౌనింగు కవివ్రాసిన పిప్పాఅని ఒకరు గానమును ప్రధానముగా జేసికొని ఊహించినారు. కాని ఇద్దరి వ్యాపారములలో చాలాచాలా వ్యత్యాసమున్నది. అలాగే లిట్టన్ వ్రాసిన లాస్టు డేస్ అఫ్ పాంపె (Last Days of Pompei) అనే నవలలోని పువ్వులమ్మిన పిల్లా అని నాకొక మూరుతోచింది, అందుకూ ఆధారముచాలలేదు.

గానము ఈ పాటలతో. అత్తనిది బంతులపాట; అది లేకుంటే ఏమి బాధ! మొత్తముమీద ఈ పాటలు ఈ కావ్యానికి బాగా వన్నె తెచ్చినవి.

ఆధునిక కావ్యాలలో, ముఖ్యముగా పాశ్చాత్యవాఙ్మయ పరిచితుల కవనములలో, ఎక్కువగా ఉండవలసిన మనోవృత్తుల నిరూపణ ఈ కావ్యములో సంతృప్తికరముగా లేదు. భావాదుల వర్ణనలలో తలగతమైనవాటినే కవి నిరూపించెనుగాని, కొంచెము లోతుకుపోయి హృదయమును, అంతరములైన ఆత్మసంబంధమైన వృత్తులను వివరించ లేదు. కుందవ సౌందర్యవర్ణన చూడండి రెండుచోట్ల నున్నది. 2, ౧-౨౩; 8, ౨౫-౨౭. ఈ రెండుచోట్ల వ్యక్తమయ్యేది శారీరక సౌందర్యముమాత్రమే. ఈబాహ్యసౌందర్యమేనా విమలుని ఆకర్షించింది? కుందవ గురించి సుమబాల విమలునికి ఏమి వర్ణించిందో మనకు తెలియ నందున, కావ్యములోఉన్న ఈ అంగసౌందర్యాన్నే వివరించి యుంటుం దని ఊహించుట సమంజసము. కుందవ విమలుల హృదయగాంభీర్యము తెలియదు; ఎందుచేత కవి దానిని స్పష్టపరచలేదు? ......సమావేశ మందు ౯వ ఆశ్వాసములో ప్రథమదర్శనసమయ మందు విమలునికి కలిగిన కుందవ పరిచయఘట్టమును సూక్ష్మముగా పరీక్షిస్తే పూర్వప్రబంధ ఫక్కీ ఎక్కువగా కనిపిస్తుంది. అది లోటు అని చెప్పలేదుగాని అది సహజముగా ఉన్నట్లుగానరాదు. ౧-౧౪ వరకు చేసిన విమర్శనలో విమలుడు పోల్చినట్లు సూచింపబడినది. తాను ఇన్నాళ్లు భావనలో చూస్తూఉన్న మోమును చూశాడు గదా. ౧౫-౪౯ వరకు చేసిన వర్ణన లన్నీ అందుకు సహకారులే. కాని ౫౧ నుండి ఆ ధోరణి మారిపోతుంది. ఆ చర్చంతా సమంజసంగా లేదు. పోనీ, విమలుడు సంప్రదాయ ధీరోదాత్తుడై, ఏ దుష్యంతునో పోలి సందేహములలో చిక్కుపడె నని చెప్పి సమన్వయించుకొందామంటే, ౭౬-౭౨ లోని భావములు అత్తవు. కేవలప్రేమే పరమనియమము. విమలుడు కుందవను పోల్చలేక పోవుట చేత ఈ విషమస్థితిలో ఉన్నాడని చెప్పవలెను; "కని విని యెఱుగని"

అనిచెప్పిన ప్రేమభావన దృష్టికి లోటు కలుగుతుంది. ౧-౧౮ పదరవు. ఇంతకీ, ఈ సందేహాలన్నిటినీ సమన్వయముచేసే చక్కని సూత్రిమును కవి సూచించలేదు......ఆ తరువాత సుమబాల దయ్యాంకథ చక్కగా అత్తదు. కథ తుదముట్టడానికి తెచ్చిన తంత్రము అది అని తోచక మానదు. ......చాళుక్యవిభుడు అడుగకముందే కథచెప్ప తొందర పడ్డాడు. ఏదో తప్పుచేసినవాడు క్షమాపణ చెప్పుకొందికి (?) ఆతురత చూపునట్లు మాట్లాడినాడు... ఈఅంతము 2, ౧౪౫-౯౦ లో విమలుడు చేసిన ప్రతిజ్ఞతో అత్తలేదు. ఆలాగే కుందవ 2, ౪౩-౧౧౦ చెప్పిన మాటలతోను అత్తదు. రాజేంద్రుడు అకస్మాత్తుగా మారిపోయాడు. కవి సమావేశమును సావకాశముగా జరిగించియుంటే ఈచిన్నలోటు లన్ని తీరిపోతవి. ఇవన్నీ అకస్మాత్తుగా కథ నడవడముకోసం జరిగిన సంగతులవలె కనిపిస్తవి. ఇట్టివి ఇంకాకొన్ని కనబడును. వాటిని పునర్విచారణలో కవి మార్చవచ్చును. ఇవి అట్టే పెద్ద విషయాలు కావు.

నా అభిప్రాయములో ఈకావ్యముయొక్క ఆధిక్యము కథలో గాని, పాత్రపోషణలోగాని అంతగా లేదు; రచనాశక్తిలోను, ముఖ్యముగా భావనసంబంధమైన వర్ణనలలోను ఎక్కువగా ఉన్నది. వీటిలో కవి నూతనత్వమును కురిపించివేసినాడు. యతిప్రాసలతోనే కవిత్వము కాదు అని చెప్పే సూత్రానికి నిదర్శనముగా ఈకావ్యాన్ని నిరూపించవచ్చును. కొత్తవర్ణనలను కల్పించుట; ప్రాచీనసంప్రదాయోపములను విడుచుట; అనుభవమునకు నచ్చిన సామ్యములను ఎంచుట; భావనలో ఔన్నత్యమును పొందు కల్పనలను చేయుట; వర్ణనలను వర్ణనకే కాకుండా భావపోషణకు, శీలవ్యక్తీకరణమునకు ఉపచరించేటట్లు చేయుట: ఇవి ఆ నూతనరీతిలోని కొన్ని అంశములు చూడండి:

3, ౨౨-౨౬; 3, ౫౫, 3, ౧౨౦-౧౩౨; 3, ౧౩౭-౧౩౭; 4, ౧౪౦-౧౪౮; 5, ౭౭-౪౨; 5, ౧౦౩-౧౦౯; 8, ౪౫; 5, ౩౪౮౨-౯౦; 5, ౧౬౦-౧౬౧.

ఆలాగని పూర్తిగా పూర్వసంప్రదాయ సిద్ధమైనవాటిని వదలలేక పోయినాడు. "తుమ్మెదల గెల్చుకనుపోయి", "కుడిభుజం అదరడం" ఈమొదలైన ఛాందసం తప్పదు కాబోలు.

కొత్తరీతిని శైలిలోను, వాక్యరచనలోను, విసంధులలోను, విరామపు గురుతులలోను, వ్యాకరణనియమములలోను కవి ధైర్యముగా ఉపయోగించినాడు. కాని కామాలు ఉంచనిశ్చయించుకొన్నప్పుడు విసంధిని పూర్తిగా అవలంబించాలి. లేకపోతే,

'దాటి' చేరినను దీర, మచట
ఆ దీన మగు నెలుం, గా పెదవి తొట్రు

ఇటువంటి వికృతులు తప్పవు. ద్విపదను ఉపయోగించుటలో కవి ఉద్దేశము స్వేచ్ఛసంపాదించడము, ప్రాస నియమముగా పాలించక పోవుట, సంచారపాదములు వాడుట, ఒక పంక్తినుండి మరొకదానికి అన్వయము ప్రసరించుట, పంక్తి మధ్యను విరామము ఉంచుట మొదలైన స్వేచ్ఛాకృతులు కావ్యములో కనిపిస్తవి. వీనిబట్టి కవికి నూతనత్వమే కాకుండా వ్యావహారికభాషా వాదముకూడా నచ్చినట్లుతోస్తుంది. వ్యావహారికపదాలు ప్రయోగాలు ఉన్నవి. కాని శైలిమాత్రము పూర్తిగా గ్రాంథికవిజృంభణమే. కొన్నిచోట్ల సంస్కృతభూయిష్ఠము, కొన్నిచోట్ల మారుమూల అచ్చుపదముల కురిపింపు, కొన్నిచోట్ల నన్నయకారకముల ప్రయోగము 3, ౪౧–౪3; 5, 3౭–౫౦; 5, ౪–౭; 9, ౧౧౦; 8,౯౫; 3, ౨౦౦ చూడండి: చూస్తే విచారము కలుగుతుంది. కవనానికి ఆరంభములో పాండిత్యప్రకటన ఎవరికీ తప్పదు కాబోలు. ఈ కావ్యములోకూడా మొదటి ఆశ్వాసాలలోకంటె కొసవి ఎక్కువ సాఫుగా ఉన్నాయి. పొల్లుమాటలు గణనిరోధ మున్నప్పుడు తప్పవు. చూ: 3, 3౨; 1, ౧౧; 8, ౨౭. అన్వయము ధారాళముగా ఉండదు కాబోలు. చూ: 1, 3౫; 2, ౧౯౧; 3. ౧౨౦–౧౨౬ అర్థము సరిగ్గ

తెలియని పదాలు ఉంటవి కొబోలు. చూ : 1, ౪౭; 3, ౧౫౦; 2, ౧౩౩. ఏవోకొన్ని చిన్న చిన్న లోపాలు ఉన్నావాటిని గ్రంథమును చదివి ఆనందించేటప్పుడు మనము పాటించము.

ఈ కథ చరిత్రాత్మకము. చోళచాళుక్య సమ్మేళనోదంతము. అనేకసమ్మేళనములు ఉన్నవి. ప్రాచీనాధునికరీతుల సమ్మేళనోదంతము అని చెప్పవచ్చును.



౬

# రవీంద్రనాథ ఠాకూరుగారి గోరా



బంగాళీసారస్వతమునుండి నవలలూ, నాటకాలూ తర్జుమాచేసి, ఆంధ్ర సారస్వత సంపదను వృద్ధిచేయుటకు ఈ యుగంలో చాలాప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి. భాషాంతరీకరణము స్వతంత్రకల్పనకంటె కూడా ఎక్కువకష్టమని సద్విమర్శకులు చెప్పుతుంటారు. ఎందుకంటే రెండుభాషలతోనూ చక్కనిపరిచయము ఉన్నప్పుడే గాని ఆపని సరసముగా నెరవేరదు. మూలభాషలో ఉండవలసిన పరిచయము దాని అక్షరజ్ఞానముకంటె చాలా ఎక్కువ కాదని అనుకొంటూ తర్జుమాలు ప్రారంభించేవారికి ఈ సూత్రము బాగా నచ్చచెప్పవలసి యున్నది. భాష చదవగలిగినంతమాత్రాన, నిఘంటువుల సాహాయ్యమున్నంతమాత్రాన, వాక్యాలలో ఉన్న పదాలు తెలిసినట్టున్నంతమాత్రాన, భాషాంతరీకరణయోగ్యత కలుగదు. భాషయొక్క జీవమంతా మాటలలోనే ఉండదు. మాటలు ఆ యా సందర్భాలలో స్ఫురింపజేసే ధ్వనివంటి సూక్ష్మార్థములపై కల్పనానైపుణ్యము ఎంతఉంటుందో, అంతకు తక్కువకానిది ప్రత్యయములలోనూ కారకములలోనూ ఉంటుంది. ఈ భాషాశక్తి ఆ భాషామతల్లి పుత్రులకున్నట్లు అన్యులకుండడము సంభవముకాదు. పండ్రెండు పదినాలుగు సంవత్సరాలు తదేకదీక్షతో అభ్యసించిన బి. ఏ. లకు, ఎం. ఏ. లకు గూడా ఆంగ్లభాషామర్మములు చక్కగా కొన్నిచోట్ల పట్టుబడకున్నవని సర్వాంగీకారము గదా. అట్టి సందర్భములో ఆంధ్రదేశములోనే ఉంటూ, ఏలాగో అక్షరాలు నేర్చుకొని, నిఘంటువులు చేర్చుకొని బంగాళీభాషను స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించుట సాహసము కాదా! బంగాళీభాష సంస్కృతభూయిష్ఠము ; సంస్కృతపదాలు మనకు స్వాధీనములే-అన్నధైర్యము ఈ సాహసానికి కొంత ప్రోద్బలమవుతూ ఉంటుందికాబోలు. కాని దీనిలో ఒక భ్రమఉన్నది.

సంస్కృతపదాలకు సంస్కృతములో నానార్థాలు ఉండగా దేశభాషలలో ఏ ఒకటి రెండు అర్థాలో స్ఫురిస్తవి. ఒక్క సంస్కృతమాటే తెనుగులో ఒకలాగు బంగాళీలో ఒకలాగు, స్ఫురించడము తటస్థిస్తుంది. భాషాంతరీకారులు ఈ భేదమును గ్రహించకపోతే, చదువరులకు కలిగే బాధ ఇంతంత కాదు.

ఈ చిక్కులు రవీంద్రనాథఠాకూరుగారి గ్రంథాల విషయమై అన్ని బంగాళీగ్రంథాలకంటె ఎక్కువ తీవ్రముగా ఉంటవి. ఠాకూరుగారు వ్యావహారికభాషను చాలా విచ్చలవిడిగాను, చాలా ఎక్కువగాను ఉపయోగిస్తారు. (దేశ్యపదాలను వాడుటలో అతనికిగల నిపుణత ధైర్యములను మన గ్రాంథికవాదులు ఒంటబట్టించుకొంటే చాలా సరసముగా ఉండును.) ఇదికాక పాతమాటలను కొత్తఅర్థకళలలో ఉపయోగించే కవిధర్మం అతనిసొమ్ము. ఆయన కల్పించే మాటలకు లెక్కలేదు. పదముల నిర్వచనములో ఎంతచిక్కు ఉందో అంతకు వెయ్యిరెట్లు అతనిభావప్రకటనలో గల నూతనత. అతనిరూపకాలు అసాధారణములు, సాధారణానుభవమునకు అతీతములు. ఈ చిక్కులు అసలుబంగాళీలనే బాధిస్తవనిన్నీ, అందరు బంగాళీలు అతనిగ్రంథాలను చదివి, ఆనందించకపోవడానికి ఇదే ముఖ్యహేతువనిన్నీ, బంగాళీలే చెప్పుతున్నారు. అట్టి ఠాకూరిగారి గ్రంథాన్ని భాషాంతరీకరించడానికి పూనుకొనేవారికి గల కష్టాలు ఇన్నీ అన్నీ కావు. అట్టి భాషాంతరీకారులకు ఆవశ్యకమైన గుణసామాగ్రి ఎట్టిదో వేరే ఇక వివరించ నక్కరలేదు.

బ్రహ్మశ్రీ వేంకటపార్వతీశ్వరకవులు ఆంధ్రలోకములో సారస్వతాభివృద్ధివిషయమై సంపాదించిన పేరుప్రతిష్ఠలు, వారు చేసిన గోరా భాషాంతరీకరణము గురించి వ్రాయబూనుకొన్న నన్ను బెదరకొట్టుతున్నవి. వారు సుప్రసిద్ధకవులు; గొప్ప పండితవర్యులు. అన్నివిధాల పూజనీయులు. వారికి నా అవ్యాజమైన హృదయపూర్వక సాష్టాంగ నమస్కృతులు. అయినా ఠాకూరుగారి గ్రంథానికి జరిగిన అన్యాయము జ్ఞప్తికి వచ్చినప్పుడు ధైర్యము బూని, ధర్మబుద్ధితో ఆ అన్యాయమును లోకమునకు

వెల్లడిచేయవలెననే కర్తవ్యతాజ్ఞానమే ఈ నా సాహసానికి మూలము. వీరితర్జుమా పూర్తిగాకముందే, మొదటి సంపుటము అచ్చునుంచి రాగానే, మద్రాసు విశ్వవిద్యాలయమువారు వారికి అనిర్వచనీయమైన ఉత్సాహమును కలుగజేశారు. ఆ సంపుటాన్నే పఠనీయగ్రంథముగా నిర్ణయించి, కవులకు బాగా డబ్బు ఇప్పించారు. అప్పుడు వారి తర్జుమాలో కొన్ని పుటలు చదివి, చాలా విసుగుకొన్నాను. సామాన్యులు భాషాప్రౌఢిమ అని మెచ్చుకొనే మాటల గడబిడ నాకు నచ్చలేదు. ఇంగ్లీషుతర్జుమా చదివి నప్పుడు ఎంత ఆనందించానో, అంతకుతక్కువకాని విచారము వేసింది గ్రంథముయొక్క శైలి చూడగానే. అప్పుడు నా తగాయిదా అంతా భావప్రకటన సుష్ఠుగా జరిగించే శైలిలో గ్రంథము లేదని మాత్రమే: అప్పుడే ఈ వ్యాసాన్ని వ్రాసి ఉంటే, భాషాక్లిష్టతనే చూపించి, భాషను తేలికజేయుమని ప్రార్థించి యుందును.

కాని ఈమధ్య బంగాళీవచ్చిన నా స్నేహితులొకరు మూలము ఎట్టిభాషలో ఉన్నదో వెల్లడిచేసి, తెలుగుగోరాయొక్క శైలి శయ్యలతో సరిపోల్చి మూలానికి తర్జుమా ఎంతదూరంగా ఉందో విశదపరచారు. నాకు బంగాళీభాషరాదు. ఏదో తంటాలుపడి కూడపలుకొన్ని మాటలు చదవగలిగినా భాష అర్థంకాదు. కాబట్టి ఈ క్రింద నేను ఉదాహరించే మూలవాక్యాలకు నేను నా స్నేహితునిపైనిన్నీ, ఇంగ్లీషు తర్జుమాపైనిన్నీ ఆధారపడుతున్నాను. అంతేకాదు: ఈ వ్యాసానికి ముఖ్యమైన ఈ దిగువ అంశములన్నీ వారు కష్టపడి, ఓపికతో చేసిన శోధనాఫలితములే. ఇక్కడ పొందికచేసి వివరించడమే నేను చేసినపని. వారైనా గ్రంథము నంతా విమర్శించి ఉండలేదు. అక్కడక్కడ యాదృచ్ఛికముగా ఏవో రెండుమూడుస్థలాలు చూడగా బయలుపడ్డవాటిలో కొన్నిటిని మాత్రమే ఇక్కడ ఇప్పుడు పొందుపరుస్తున్నాను. (నా ప్రయత్నం ఏమిటంటే మనభాషాంతరీకారులకు బంగాళీభాష రాదనిన్నీ, ఆ రాకపోవడమువల్ల తర్జుమాలో చాలా పెద్దపెద్ద తప్పులు ఉన్నవనిన్నీ రుజువు చేయుటే.) వారు బంగాళీ చదవ గలిగియుండవచ్చు. మీద నుప

పొందించినట్లు అట్టి జ్ఞానము చాలక, పొరపాటులకు తావుఇచ్చింది. ఎట్లంటే, చూడండి :

(1) బంగాళీలో "భారము నొక్కుచుండెను" అని ఉంటే, దానికి తర్జుమా, తెలుగు 145-పుట, ఆఖరివాక్యము, "ఒక భావము ముద్రింపబడియెను" అని ఉంది. ఎట్టితప్పో చూడండి. ఏలాగు ఇది సిద్ధమయిందో నిరూపిస్తే నా వాదన చదువరులకు నచ్చుతుందని చెప్పుతున్నాను. బంగాళీలో 'వ' 'ర' అనే అక్షరాలకు భేదము చాలా తక్కువ. అందుచేత "భార" అని మూలంలో ఉంటే 'భావ' అని చదివారు. "భావము నొక్కుచున్నది" అంటే చక్కగా ఉండదనందున 'ఛాపా' అన్న బంగాళీమాటకు "నొక్కుట" అనే అర్థం తీసుకోక, "అచ్చు ఆఫీసుపని" అన్నదానినుండి వచ్చిన "ముద్రింపబడియెను" అన్న అపార్థాన్ని స్వీకరించారు. నొక్కడం వల్ల అచ్చవుతుంది గనుక బంగాళీలో అచ్చువేయడానికికూడా "ఛాపా" అంటారు.

(2) తెలుగు 146-పుట, 1-పేరా, 3-వాక్యము : "వినయుడు బ్రాహ్మవివాహము చేసికొనుటకు లుబ్ధుడై యుండెనని గోరా యను మానించి యా మిథ్యాసంశయమునకు శశిముఖివివాహమును జామీనుగా జేసి, నిశ్చింతుడై యుండెను." వాక్యము చెడ్డది; అన్వయము తప్పు; అర్థమూ కాదు; గోరా వినయుల శీలము మారిపోయింది. సరియైన తర్జుమా ఈ విధంగా ఉండాలి : "తాను బ్రాహ్మవివాహము చేసి కొనుటకు లుబ్ధుడై యున్నట్లు గోరా యనుమానించుచున్నాడని వినయుడు పోల్చి, వాని మిథ్యాసందేహముదగ్గిర శశిముఖీవివాహమును చిరంతనపు జామీను స్వరూపముగా ఉంచి, తనను విముక్తునిగ జేసుకొనెను." బంగాళీవాక్యములో వినయుడుకర్త, గోరా కాడు. అది భాషాంతరీకారులు పోల్చలేకపోయారు.

(3) 148, ఆఖరివాక్యము :

"గోరామతమునే విశ్వసింపవలయు నను బలవంతము నాకు లేదు." దీనిమూలానికి సరియైనతర్జుమా: "గోరాలాగు నాకు నమ్మకం మీద పట్టుదలలేదు." బంగాళీలో "మత" అని ఉంటే దానికి "మతము" అని అర్థంచేసుకోవడమువల్ల వచ్చినముప్పు ఇది. "మత"=లాగు.

(4) 166, పంక్తి 8:

"మహి—నీ విప్పుడు సరియే యంటివి. మఱి యెప్పుడైన నడ్డము చెప్పుదువు.

"గోరా—నే నెప్పుడును నూరక యడ్డము చెప్పను—నిరోధించి—"

అని ఉంది. దీనిమూలానికి సరియైన తెలుగుచూడండి:

"మహి—నీ విప్పుడు అంగీకరించుచున్నావు; కాని (నీ పుణ్యముంటుంది) ముం దెప్పుడూమాత్రం మరి యే క్రొత్తయాటంకమును లేవదియ్యకుము సుమా.

"గోరా—నా అడ్డు కాదు, నా కోరికయే ఈ చిక్కుకు కారణము."

ఎంత ఎక్కువ తక్కువ ఉందో చూడండి.

(5) 208-పుట, ఆఖరివాక్యం:

" 'డ్రైడన్' కవిచే...రచింపబడిన 'సంగీతశక్తి' అను నాటకమును..." అని ఉంది. ఇది నాటకముకాదు, పద్యకావ్యము. బంగాళీలో ఏ మాటవల్ల ఈ పొరపాటు వచ్చిందో బోధపడలేదు. ఇంగ్లీషుతర్జుమాలో "in a dramatic style" అని ఉన్నదానివల్ల సంక్రమించిన దోషమైయుండాలి. బంగాళీనుంచే కాకుండా ఇంగ్లీషు తర్జుమానుండికూడా తెనిగించేరని ఇది నిదర్శనమా!

(6) 210-పుట, మొదటివాక్యము:

"ఆమె యప్రసన్నత ... వినయునకు లక్ష్యమగుచుండెను." అని ఉన్నది. మూలానికి సరియైన తెలుగు: "ఆమె యప్రసన్నత వినయుని గురిగా జేసుకొనెను." ఎంతమార్పు!

(7) 214-పుట, 2-పంక్తి:

ఆ వాక్యమంతా చెడిపోయింది. గ్రంథసంకోచముకొరకు ముఖ్య భాగాలనే ఉదాహరిస్తాను:

తర్జుమాలో ఉన్నది:

1. "నాకింత వయస్సు వచ్చినను పుస్తకజ్ఞానమే కాని, యనుభవ జ్ఞానము కలుగలేదు."

2. "నా మానసము ముద్రణాలయము వంటిది."

3. "నీవు బాగుగా మాటలాడుటకు ప్రయత్నింపుము."

మూలానికి సరియైన తెలుగు:

1. నా కున్న వేళంతా చదువులలోనే గడుపుచుంటిని కాబట్టి-
2. నా మనస్సు అచ్చువేసినగ్రంథము వంటిది.
3. అంతచక్కగా మాటలాడుటకు ప్రయత్నింపకుమీ.

వాక్యమంతా ఈలాగే ఉంటుంది.

(8) పుట 212, దిగువనుంచి 3-వ పంక్తి:

తర్జుమా: "ఏ యుపాయమును దోచక, కేవలమును వినయుం డామె కధీనుడై యుండెను." సరియైనది: "తనకు అధీనమైన యుపాయ మేదియును గనపడలేదు." ఎంత తప్పు? లలితశీలము చెడ గొట్టినట్లు కాదా?

(9) శీలము పాడైన మరొకస్థలము చూడండి: పుట 320, ఆఖరివాక్యము: "సంసార మాతని కంతభారము కాకుండెను." సరియైనది: "ఇకముందు సంసారము అతనిదృష్టిని నాకర్షింపలేదు."

(10) పుట 278, పంక్తి 5-7: "ఇంటితలుపులు" అనిఉంది. అవి గదితలుపులు. 'ఘూర్' అంటే గదికాని ఇల్లుకాదు. "భర్తం దక్క నితరులకు దెలియదు." దీనికి సరియైనది: "భర్తం దక్క నితర వస్తువులన్నియు పెట్టెలో భద్రముగా నుంచబడును." "ఆమెయందు భర్తకైనను స్వాతంత్ర్యము లేదు." ఇది తప్పు. దీనికి సరియైనది:

"అతని భార్యాయాజమాన్యములో నతనికిగూడ నతడు కోరునంత స్వాతంత్ర్యము లేదు."

(11) పుట 313, మధ్యపేరా: "అకారణముగా బాధ్యత నేల వదలుకొనవలయును? సుచరితను వదలుకొనుట నా కొక్క గొప్పపని కాదు. కాని సమాజపుదలవంపులకు సహింపజాలను." బంగాళీలో on principle 'ఆన్ ప్రిన్సిపిల్' అనిఉంటే, దానికి "అకారణముగా" అని తెలుగు చేశారు. ఇదితప్పుకాదా? సరియైన బంగాళీదొరకక, ఆ స్వతంత్రకవి ఠాకూరు ఇంగ్లీషుమాటలోనే వేసేశారు. 'బాధ్యత' కాదు, 'హక్కు'. ఎంతమారిందో! ఆఖరివాక్యం ఈలాగు ఉండాలి: "బ్రహ్మసమాజమునకు నాచర్యవల్ల తలవంపులువస్తే సహించలేను."

(12) పుట 308, ఆరంభము: "వర:—ఇన్నాళ్ళకు దరువాత మరల నంగీకార మన నేమో నాకు బోధపడుటలేదు. దానికి బోధించుట నా చేతగాదు. లోపల నొకలాగు, పై నొకలాగు!"

దీనిమూలానికి సరియైన తెలుగు ఇది: "వర—బోధపడలేదూ! ఇన్నాళ్ళ తరువాత ఒప్పుకున్నారా? ఆ పిల్లను బోధపరచుకొనుట సులభమైనపని గాద........."

(13) పుట 302, అధ్యా. 40, పంక్తి 4: "తాను నందఱి నాదరించుటకు బ్రియత్నించుచుండెనేగాని, వారు తన్నవమానింతురని సంశయించుటయైన లేదు" అని ఉంది. తప్పు. ఏలాగుండాలంటే: "తాను ఆదరించుటకు బ్రియత్నించుచుండెను; గాని, వారుమాత్రము ఆమెయెడల తమకుగల అవజ్ఞను ఆమెదగ్గిర దాచి ఉండలేదు."

(14) పుట 592, వాక్యము 16: "అందుచేతనే మీ రేసమాజమునందును స్థానమును గైకొనలేదు" అని ఉంది. ఈలాగు ఉండాలి: "అందుచేతనే మీకు ఏ సంఘములోనూ స్థానం దొరకదు."

(15) పుట 514, అధ్యా. 65, వాక్యం 2: "గోరా మునుపటి కంటెను సాహసముతో మెలగుచుండెను." అంటే! మూలంలో "ఎక్కువ జాగ్రత్తతో" అని ఉంది.

(16) పుట 494, అధ్యా. 63, వాక్యం 3: "హరి—ఎక్కడ భుజించితివి? ఇక్కడనే పడియుంటివి." అని ఉంది. తప్పు. ఈలాగు ఉండాలి: "ఏమిటి తిన్నావు? అంతా (భోజనము) ఇక్కడే, ఇదిగో, ఆలాగే పడి ఉంది."

మేము చూసినవాటిలో కొన్నిటనే ఇక్కడ నిరూపిస్తున్నాను. పుస్తకము కళ్లుమూసుకొని విప్పి, ఎక్కడైనా సరే ఒకపేరా జాగ్రత్తగా పరీక్షిస్తే ఏదో ఒక తప్పైనా లేకుండా తర్జుమా నడవలేదని ఖేదపూర్వకముగా చెప్పుతున్నాను. తర్జుమా బాగున్నా లేకపోయినా ఈ తప్పులుమాత్రము ఉండకూడదని అందరూ నాతో అంగీకరిస్తారనే ధైర్యముతో వీటిని చూపేను. కవులకు బంగాళీభాష రాదు. ఇంగ్లీషు సహాయముతో తర్జుమాచేసిఉంటే ఇన్ని ఇట్టితప్పులు ఉండకపోవును. వారికి ఇంగ్లీషుకూడా రాదు కాబోలు. నేను చూపిన స్థలములలోగాని, మరెక్కడైనాగాని తర్జుమాయొక్క సాధుతా సాధుతలను పరీక్షించ నిశ్చయించుకొన్నవారు బంగాళీ తెలియదని విచారించ నక్కరలేదు. ఇంగ్లీషుతర్జుమా బంగాళీకి చాలా దగ్గరగా ఉంది. మన తర్జుమాలోని తప్పులు తెలుసుకొనుటకు ఇంగ్లీషు సరిపోతుంది; కాని ఆ తప్పులు ఏలాగు వచ్చినవి అనే కుతూహలము ఉంటే బంగాళీ చూడవలెను. మూలం తాలుకు ఏభాషా రానిదీ తర్జుమాచేయుటకు పూనుకొన్న కవుల సాహసాన్ని ఏలాగు వర్ణించాలో నాకు తెలియదు.

అంతకంటె ఎక్కువసాహసం మద్రాసు విశ్వవిద్యాలయపు తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ (Board of Studies) వారిది. పుస్తకము పరిశీలించకుండా నియమించారు. భాషాంతరీకారులు సుప్రసిద్ధులు. మూలం ప్రసిద్ధమైనది. గ్రంథంలోనిభాష పటపటమని సమాసాలతోను,

సంస్కృతముతోను శబ్దముచేస్తూ ఉంది. గ్రామ్యభాష కాదు. ఇవా చూడవలసిన లక్షణాలు! మూలం తారుమారైంది. శీలము పాడైంది. చెప్పదలచుకొన్నదానికి వ్యతిరేకం చెప్పడమైంది. ఈ సంగతులు చూడవద్దూ!

ఇంకొకసంగతిచెప్పి విరమిస్తాను. భాషాంతరీకరణముల ప్రయోజనాలను చక్కగా గమనిస్తే మూలానికి ఉచితమైన భాష ఉపయోగించవలసిన బాధ్యత వ్యక్తమవుతుంది. బంగాళీమూలం చదివే బంగాళీలందరూ ఠాకూరుగారిభాష ఎట్లు దేశ్యమో, ఎట్లు వ్యావహారికమో వర్ణిస్తారు. మనము, ఆంధ్రులము, గ్రాంథిక వ్యావహారిక వాదములతో కాలముగడుపుతూ ఉంటే, ఏ వాదమూ పెట్టుకోకుండా బంగాళీలు వ్యావహారికభాషను విచ్చలవిడిగా వాడేస్తున్నారు. అట్టి వ్యావహారిక బంగాళీభాషను తెలుగులోనికి తర్జుమాచేసేటప్పుడు ఈ డాంబికమైన పటపటతెలుగా ఉచితమైనది! ఉచితము మాట అటుంచి, అర్థము స్ఫురించే తెలుగేమో చదివిచూడండి. బంగాళీసంస్కృతాన్ని తెలుగు సంస్కృతముగా చెయ్యబోతే వచ్చేబాధలు కొన్ని; కొత్తక్రియలు కల్పించి వ్రాసేవారికి, చదివేవారికి అర్థముకాని శైలిని ఉపయోగించడము కొంత: రెండూకలిసి చదివేవారిని పీడించేటట్లు శైలి ఉంది ఉదాహరణాలకు స్థలములేక చూపించలేదు.

ఈ విమర్శన వ్రాయుటకు ప్రయోజనము ఒక్కటే. మనకవులు ఠాకూరుగారి బంగాళీగ్రంథాల నన్నిటినీ తర్జుమా చేస్తామని గ్రంథ పీఠికలో ప్రతిజ్ఞచేశారు. చేసి నాలుగేండ్లు గడచినా మరొక గ్రంథము బయలు వెడలనందున నా సలహా నిష్ప్రయోజనమే కాబోలు. బంగాళీ గ్రంథాల తర్జుమావాంఛ దేశములో ఉన్నప్పుడు, బంగాళీభాష బాగా తెలియనివారికి, వ్యావహారికభాషాద్వేషము దృఢముగా ఉన్న వారికి నా వ్యాసము ప్రయోజనకారి అగును. వారందరూ ఈ వ్యాసాన్ని చిత్తగింతురని నా ప్రార్థన.

## ౭

# రవీంద్రనాథఠాకూరుగారి ఇంటా బయటా

'భారతి' యొక్క యొకసంచికలో "విశ్వభారతీ గ్రంథమాల" అనే శీర్షికక్రింద ఠాకూరుగారి రెండు గ్రంథములను—గృహప్రవేశము-పోస్టు ఆఫీసులను — చదువరులకు ఎరుకపరిచే యున్నాను. ఇంటా బయటా ఆ గ్రంథమాలలోనిదే. ఇ వొకనవల; ఇదివరకు ప్రచురించినవి చిన్న నాటకములు. చిన్న చిన్న కథలసంపుటముల రెండింటిని ప్రచు రిస్తున్నారు. గ్రంథముయొక్క రూప మేదైనా, నాటకమనండి, కథ అనండి, లేదా నవల అనండి, ఏదైనా సరే రవీంద్రుని ఆధిక్యము ప్రతిదానిలోను విశద మవుతూ ఉంటుంది.

బంగాళీలో ఘోరె బహిరె అన్నదానికి ఇది తర్జుమా. దీనిని చాలరోజుల క్రిందట ఇంగ్లీషులోనికి తర్జుమా చేసి, **Home and the World** అన్న పేరుతో ప్రచురించే యున్నారు. ఇంగ్లీషు నెరిగిన వారు చాలామంది యీ గ్రంథమును చదివి, ఆనందించి యుంటారు. ఇంగ్లీష్‌నుండి దీనిని తెలుగులోనికి తర్జుమా చేయుటకు చాలామంది సారస్వతాభిమానులూ, ఠాకూరుగారిని మెచ్చుకొనువారూ అభిలషించి యుండిరి. కాని అనేక కారణములచేత ఇప్పటికిగాని కేవలము ఆంధ్రభాషను చదివే వారికి ఈ ఉత్తమగ్రంథము అందినదికాదు. దీనిని తయారుచేయుటలో ఇంగ్లీష్‌గాక బంగాళీప్రతే మూలమగుట చేత గ్రంథమునకు చాలా లాభము కలిగినది. తర్జుమాకు బంగాళీ భాష సులువగునట్లు ఇంగ్లీషుకాదు. బంగాళీనుండి ఇంగ్లీషు తర్జుమా తయారైనపుడు ఎందుచేతనో కాని కొన్ని మూలభాగములు జారి పోయినవి. ఇంగ్లీషుభాషలో ఠాకూరుగారి శిల్పకౌశల్యమునకు సంబంధిం చిన కొన్ని అంశములు బోధపడవు. అందుచేత ఈ తెలుగు తర్జుమా

వల్ల కేవలము ఆంధ్రభాషను చదివేవారికి కాకుండా ఆంధ్రుల కందరికీ ఒకవిధ మైన మేలు కలిగినది.

ఈ మేలు ముఖ్యముగా భాషకూ శైలికీ సంబంధించినది. ఠాకూరుగారు కేవల వ్యావహారిక భాషను ఉపయోగిస్తారు. ఆ విష యమై వారు చూపే స్వాతంత్ర్యమునకు వారిస్వేచ్ఛ కాక, వేరే ఎట్టి నియమము లేదని చెప్పవచ్చును. వారి అభిప్రాయాదులు చాలా అధునిక ములూ నూతనములూ. వారి భావన, భావాదుల ధార మిక్కిలి జోరుగా ఉంటుంది. వీ టన్నిటికి అత్తైటట్లు భాషాంతరీకరణ శైలి ఉండాలంటే, నిరోధము లేకుండా ఉండేటట్లు ప్రవహించే వ్యావహారిక భాషే సరిపోతుంది. కాని గ్రాంధిక భాష ఉపచరించదు. ఈ సూచన బాగా విశదపడినది ఈ తర్జుమాలో. ఎక్కడ చదివినను భావములు సూక్ష్మముగా ఉన్నట్లున్ను, భావన నూతన ఫక్కిని ఉన్నట్లున్ను తేలికగా బోధపడుతుంది. సందీపుని వాదన ప్రవాహ మునకూ, వాదముల సూక్ష్మతకూ, అతునట్లు వాక్యముల రచన కలదు. ఏచోటనైనాసరే సందీపుని వాక్యములను తీసి, సహజముగా వచ్చిన మాటలను గ్రాంథికవ్యాకరణానికి సరిపడే ప్రత్యయములతోనూ, సంధుల తోనూ, కారకములోనూ వ్రాసినట్లయితే, తర్జుమాలో అవలంబించిన శైలియొక్క యోగ్యత స్పష్టపడుతుంది. భావములు హృదయమందు నాట వలెను; అభిప్రాయములు మనస్సుకు ఎక్కవలెను; తర్కము బుద్ధికి తట్టవలెను; వర్ణనలు చదువరిభావనలో మిళితము కావలెను. ఆ యా కార్యములు నెరవేరుటకు భావాదులకు మధ్యసహజముకాని ప్రత్య యాదులు దూరకూడదు. నిత్యవ్యవహారములో ఉండే దీర్ఘాలలోను, కారకములలోను ఉండే సరళత, ధ్వనిసూచకత్వములు అప్రయత్న పూర్వకముగాను, చక్కగాను విశదపడుతవి. ఈ విషయమై ఎంత వ్రాసినా లాభ ముండదని విమర్శకులు కొందరు ఉంటారు; వారికి నచ్చడానికి ఒకటే మార్గము. సాధ్యమైనంత సానుభూతితో గ్రంథ

మంతాను చదివి, ఆనందించిన తరువాత ఆ విమర్శకులు పర్యాలోచన చేస్తే నా వాదము, ఈ శైలియొక్క యోగ్యతలు నచ్చవచ్చును.

ఇంటా బయటా రెండూ రెండువిధములైన మనోనిర్మాణములకు సూచనలు. ఇంటి నాలుగు గోడలమధ్య ఉన్నదే ప్రపంచమంతా అని తయారైన జనానాస్త్రీ, బయట నున్న దేశవ్యవహారముల గడబిడలతో తయారైన వ్యక్తి- ఈ రెండు రీతుల మనస్సులను సూక్ష్మబుద్ధితో విప్పి, విభజించి పరీక్షిస్తే విమర్శకునికి వ్యక్తమయేదానిని కథలోనికి గ్రుచ్చి వర్ణించేటప్పుడు ఇంటా బయటా కంటె అనుకూలమైన పేరు మరొకటి దొరకదుగదా. ఘోషాపద్ధతిలో హిందూసంఘమర్యాదల ప్రకారము పెరిగిన స్త్రీలు విమల, ఆమె వోదిన చోటీరాణి. ఇంగ్లీషు చదువుతో పాటు, కొంతప్రపంచమును చూచి, దేశమందు అన్నిమూలల ఆవరించుకొనియున్న సాంఘిక రాజకీయ సమస్యలతో పరిచయము సంపాదించి, ఆ సమస్యలకొరకు దేశసేవ చేయవలె నని మనోదార్ఢ్యముగల పురుషులు నిఖిల్, సందీప్, మాష్టర్ మొదలైనవారు. ఇట్టి భిన్న వాసనలు గల వ్యక్తులను జతపెట్టి, ఆ వాసనల ప్రతిభావమును వర్ణించేకథ 'ఇంటా బయటా.' ఇంటి సంప్రదాయములలో పెరిగేవారిని బయటసూచించే సంప్రదాయములోనికి తీసుకోవస్తే ఆ వ్యక్తులలో ఆరెండు సంప్రదాయముల సంఘర్షణవల్ల పుట్టే కలవరము, ఉద్రేకము, అందువల్ల సంభవించే ప్రమాదము మొదలైన ఫలితములను సూక్ష్మదృష్ట్యా వర్ణించేది 'ఇంటా బయటా.' పతికంటె వేరగు పురుషుని మొగమెరుగని పతివ్రతను, జనానాకంటె వేరైన ప్రపంచమును కని విని ఎరగని ముగ్ధను ఒకేసారి బయటకు తీసుకొని వస్తే, ఆమె భావప్రపంచ మెట్లు కల్లోలమగునో అదివర కుండే మనఃస్థైర్య మెట్లు భంగమొంది కలవరపెట్టునో వర్ణించే కథ ఇంటా బయటా. తర్కము, వాదోపవాదములు, కుశలబుద్ధి, మొదలైన వివేకధర్మములకు అలవాటు పడని నిర్మలహృదయముపై ఒక్కమారు తీవ్రమైన వాటి దెబ్బ తగిలితే ఆ హృదయ మెట్లు తత్తర పడి, సహజమైన ముగ్ధత్వమునకున్నూ, కుశలబుద్ధిచే ఆపాదింపబడ్డ

నూతనరుచులకున్నూ మధ్య కాలిబంతివలె ఎట్లు కొట్టుకుంటుందో సూక్ష్మముగా ఈకథలో వర్ణింపబడినది; ఒక ప్రభావపరంపర ఇంటిది, మరొకటి బయటిది.

జమీందారు నిఖిల్, విద్య నభ్యసించి, దేశసేవాపరాయణుడైనాడు. అన్ని విధముల అతని శీలమునకు భిన్నమైన శీలముకల సందీపు ఈ దేశసేవలో నిఖిల్‌కి సహకారాై అతని కోటలోనే బసచేసుకొన్నాడు. స్వదేశి ఇద్దరికి కట్టుకొన్న కంకణము. కాని వారు ఉపయోగించేవి, ఉపయోగింప దలచుకొన్నవి పద్ధతులుమాత్రము పూర్తిగా విరుద్ధములు. వ్యక్తిస్వాతంత్ర్యమునకు ఎట్టిభంగమూలేకుండా శీలము, ధర్మము, ఋజుత, ఏ విధాన్న చెడకుండా ఉండే పద్ధతినే అవలంబించాలని నిఖిల్ ఆదర్శము; మంచి చేయడానికి మంచే సాధనము గాని, మంచికానిది సాధనము కానేరదని ఆతని అభిప్రాయము. సందీపు ఆదర్శము అదికాదు. కార్యము సాధించుటకు ఏది ఉపచరిస్తే అదే సజ్జనపద్ధతి. మంచి అనగా కార్యసాధనమునకుపకరించే దేదైతే అది. కాబట్టి నిఖిల్ సందీపులు అవలంబించిన పద్ధతులు విరుద్ధములు. చదువు చెప్పించి, పనిలో నేర్పువచ్చేటట్లుచేసి, ప్రజలకు బోధపరిచి, లాభము ఎంతవరకు వీలుఅవుతుందో చూచి, స్వదేశి నడిపించడము నిఖిల్ పద్ధతి. దోపిడి చేయించి, విదేశిదుకాణాలు కాల్పించి, విననివాళ్లను హింసించి, ధనముకోసము దొంగతనాలు చేయించి, ఏదోవిధాన్న స్వదేశి నిలపాలని వాదించేవాడు సందీపు. అందుకు ఉపచరించే కుతర్కము, వాగ్ధోరణి, వాదవిజృంభణము సందీపుకు కలవు. కాబట్టి నిఖిల్‌కు ఉన్నట్టి విద్యాపరిజ్ఞానములు లేని ముగ్ధ స్త్రీలను, అవివేకప్రజను, బుద్ధిలేని యువకులను సందీపు సులభముగ వశపరచుకో గలిగేవాడు.

ఇట్లు నిఖిల్, రాణీని విమలనుకూడా సందీపు తాను సృష్టించిన మంటలోనికి లాగేశాడు. దేశమాతపూజ 'అన్న పేరున విమల వాని వలలో చిక్కుకొని, నిఖిల్‌పైగల ఆదరభావమునకు లోపము రానిచ్చింది. పతిభక్తికి విగ్రహము నిఖిల్; దేశభక్తికి విగ్రహము సందీపు. ఈ

రెండింటికి విరోధము కలిగినప్పుడు ఇంటినికూడా ఆక్రమించే బయట ఆమెను వశపరచుకొన్నది. దేశసేవకేగదా నిఖిల్ కూడా ప్రవర్తి స్తున్నాడు. నిఖిల్ కు గల సంకోచమువలన, మాధుర్యమువలన మండుతూ ఉన్న కాంతి కానరాకున్నది. క్రమముగా పతిభక్తికంటె ఎక్కువైన దేశభక్తి ఆమెను ఆవరించడము చేత, సందీపు విగ్రహము ఒక్కటే ఆమె చైతన్యాన్ని అంతని ఆశ్రయించుకొన్నది. కాని ఆమెభక్తి పరాయణత్వము, నిష్కాపట్యము, నిర్మలస్వభావము మనకు ఆమె యెడలనుండే గౌరవమునకు భంగము రానీయవు. అమూల్యయెడల ఆమె చూపిన భాతృత్వము, ఆమె మోహసముద్రములో నుండి పైకిలేచినప్పుడు కనబరచిన సౌహృదయము విమలయొక్క సౌజన్యతను కొనియాడును.

సందీపు స్వార్థపరాయణు డనిన్నీ, కుటిలస్వభావుఁ డనిన్నీ, విమల పతంగమును ఆకర్షించడానికి మాయకాంతిని ప్రజ్వలింప జేస్తున్నా డనిన్నీ నిఖిల్ తెలుసుకొనక పోలేదు. కాని, నిఖిల్ ఆదర్శము వ్యక్తి స్వాతంత్ర్యము, ఒకరి స్వేచ్ఛకు నిరోధము కల్పించే స్వాతంత్ర్యాభి లాషి దొంగ అని అతని సిద్ధాంతము. విమల స్వేచ్ఛకు ఆటంకము లేనప్పుడే నిఖిల్ కు ఆనందము. చిలుకను పంజరములో ఆడిస్తూ ఆనందించ వలసిన స్వాతంత్ర్యవాది కాడు నిఖిల్. ఇంటనున్న విమలను బయటకు తీసికొని వచ్చినవాడు నిఖిలే. ఆమెకు సందీపు పరిచయము కలుగ జేసినవాడు నిఖిలే. ఆమె తన అవసరము లేకుండానే సందీపుతో దేశ సేవావాదములు జరుపుతూ ఉంటే ఆనందించేవాడు. తరువాత సందీపు తంత్రము తెలిసినా, విమలకు ఎట్లు నచ్చచెప్పడమో నిశ్చ యించుకొనలేక పోయినాడు. సందీపు శీలము తనకెట్లు తెలిసిపోయినదో అట్లే విమలకుకూడ కొంచెము ఆలస్యంగా నైనా తెలిసిపోతుందని నమ్మినవాడు నిఖిల్. ఆమె కనుగొనిన దానిని ఆమెయందు బలవంతాన ప్రవేశపెట్టకూడదని భావించినాడు నిఖిల్. కాబట్టి కథ అలాగు నడిచింది.

ఈ ముగ్గురి ముఖ్యపాత్రల మధ్య ఇంకా ఎన్నో చిన్నచిన్న పాత్రలు వస్తవి. అవి చిన్నవే అయినా, కథాభాగములో వాళ్లుచేసిన పనులుఅంత పెద్దవికాకున్నా, వారి శీలము, వారిఆత్మధర్మము మాత్రము విపులవిస్తృతి కలిగినవే. అమూల్య విమలయెడల కనబరచిన సోదరీప్రేమ, శరీరత్యాగము దివ్యసమమైనవి. సందీపు శిష్యుడైనా విమలపై సందీపు ప్రయోగిస్తున్న తంత్రమునకు దొరకక, విమలకు తగిన తమ్ముడుగా అమూల్య ప్రవర్తిస్తాడు. సుందరమైన స్వభావము. నిఖిల్‌కు తగినవాడే ఆమేస్టర్. నీతివంతమైన స్వేచ్ఛ ఎట్టిదో కార్యరూపమున పంచు విషయమై చూపినవాడు అతడు. పూర్వ సంప్రదాయములలో పెరిగినా చోటీరాణీ మానవహృదయము నెట్లు వ్యక్తపరుస్తుందో చూస్తే హృదయము చలిస్తుంది. కాబట్టే పూర్తిగ నూతనసంప్రదాయావలంబుడైన నిఖిల్ ఆమెపై ఎల్లప్పుడూ ఆదరము చూపించేవాడు.

ఇట్లు పాత్రలహృదయమును విశదపరుస్తూ, ఉన్నతభావ పరంపరలతో పొంగిపొరుతూ, బుద్ధిసూక్ష్మత, శీలవ్యక్తీకరణము, స్వభావ నిరూపణము మొద లైన ఉన్నతశిల్పధర్మములకు నిదర్శనప్రాయమవుతూ గ్రంథము ఉంటుంది. ఠాకూరుగారి శిల్పచమత్కారమును తెలుసుకోవాలన్నా, ఠాకూరు ఆదర్శతత్వమును పరీక్షించాలన్నా, ఈ నవలను చదివితీరవలసిందే. నవలకు సాధారణముగా కథ ముఖ్యమైనా, దీనికి మాత్రము కథ ప్రధానముకాదు. కథ లేకపోలేదు. కాని కథనము ముఖ్యము కాదన్నట్లు కథను ఒక క్రొత్తఫక్కీని ఆయన వివరించాడు. నిఖిల్ సందీపు విమలలు ముగ్గురూ వారివారి కథలను వర్ణిస్తూ మొత్తంకథను చెప్తారు. ఈ పద్ధతి బ్రౌనింగ్ 'ది రింగ్ అండ్ ది బుక్కు' ను, (Browning: The Ring and the Book) అనుకరిస్తున్నదా అనేది ముఖ్యప్రశ్నకాదు. బ్రౌనింగ్ పుస్తకము వల్ల ఇట్టిపద్ధతి ఠాకూరుగారికి తట్టిందా అనేది మనము పరిష్కరించలేము. కాని, రెండింటికిగల సామ్యము కేవలబాహ్య మనిన్నీ, చాలా ముఖ్యాంశములలో భేద మున్నదనిన్నీ నొక్కి చెప్పవలసి యున్నది.

ఈ పుస్తకమును జాగ్రత్తగా చదివినవారికి ఠాకూరుగారి శిల్పము తత్వము ఆదర్శములు - ఇట్టివి చాలావిషయములు చక్కగా బోధపడగలవనే ఉద్దేశముతో దీనిని విశ్వభారతీ గ్రంథమాలవారు తెలుగు లోకమునకు అందజేసినట్లు నేను తలుస్తున్నాను.

ఈ గ్రంథము వాఙ్మయములోని నవలారూపమునకు నిదర్శనముగ భావిస్తే కొన్నిలోపములు కానవస్తవి. కొసకు రాగానే కథను అంత మొందించుటకు కవి తొందరపడినట్లు తోస్తుంది. నిఖిల్ ఎక్కడా కూడా విమలకు సందీపు కుట్ర, లేదా, సందీపు వాదములలోని లోపములు బోధపడేటట్లు చేయడానికి ప్రయత్నించడు. మల్లిపూవు సుగంధము వర్ణించిచెప్పాలా అని కాబోలు నిఖిల్ ఉద్దేశము. అయినా కొంతబోధన ఆధ్యాత్మికవిషయాలలో ఆవశ్యకము కదా. విమలకు చదువు చెప్పించ ప్రయత్నించినంతమాత్రాన ఎంతవిద్య అబ్బిందో, ఆ విద్యవల్ల ఆమెబుద్ధి వికసించిందో లేదో తెలుసుకొనకుండా ఆమెస్వేచ్ఛాప్రాప్తికి ఆమెనే సాధనముగా విడిచిపెట్టుట 'కోతిచేతిలోనికత్తి' వలె కాదా అని నిఖిల్ వితర్కించినట్లు కానరాదు. ఇట్లు విమర్శించకూడదు ఠాకూరుగారి నవలను; వారి ఉద్దేశము నవల వ్రాయడము కాదని అంగీకరిస్తే ఈ విమర్శనలకు చోటు ఉండదు.

మనస్తత్వమును ప్రతిపాదించే కథలోనికి బెంగాలీదేశమును క్షోభింపజేసిన చీలికను, దానికి ప్రతీకారముగా నాయకులు ప్రతిపాదించిన స్వదేశీవ్రతమును ప్రవేశపెట్టడములో కవికి రాజకీయాదర్శముల సూచన ప్రధానోద్దేశ మని కొందరు భ్రమపడవచ్చును. అది ప్రాసంగికముగాని ప్రధానముకాదు. కాబట్టి ఆ చీలిక ఆందోళనము చల్లారినా గ్రంథముయొక్క ప్రశస్తి తగ్గలేదు. క్రమముగా ఠాకూరుగారి తత్వము తెలిసినకొలది గ్రంథముయొక్క ప్రాశస్త్యము ఎక్కువ ఆమోదమునకు వస్తూ ఉన్నది.

౮

# శృంగార కావ్యములు:
# శృంగార రాధామాధవ సంవాదము

౧

అన్ని సారస్వతములలోనూ శృంగారభావ ప్రదర్శనమునకు చాలా ముఖ్యస్థానము గలదు. శృంగారము ప్రధానరసముగాగల కావ్యాలు సాధారణముగా నూటికి ఎనభై తొంభై వంతున ప్రతీసారస్వతములోనూ ఉంటవని చెప్పవచ్చును. ఈ భావాలలో దీనికే ఇంత ప్రాముఖ్యము ఎందుకు వచ్చిందో గదా అన్ని రసములకంటె ! ఇది ఎక్కువ ఆనందజనకమనా ? దీనంత మెత్తగాను, దీనంత సులభముగాను మరేరసమూ చదువరులను ఆకర్షించదనా ? అందరిహృదయాలలోనూ దీనంత ప్రాయముగా మరేదిన్నీ వ్యక్తమవుతూఉండదనా ? కవులు ఇతివృత్తముల కొరకు మానవహృదయాన్ని పరీక్షించినపుడు వారి దృష్టికి గోచరమయే సామాన్యభావము ఇదేఅనా ? ఈ హేతువులలో ఏదైనా కావచ్చును; లేక అన్నీ కలిసి కావచ్చును. కాని శృంగార రసవర్ణనము సమంజసముగా ఉండడానికి మాత్రము సామాన్యకవి హృదయము చాలదని నొక్కి చెప్పవచ్చును. అది ఎంత సుగమమో, ఎంత సాధారణమో, అందుచేతనే ఎంత హృదయతలగతమో, అంత సూక్ష్మమైనది కూడా. అవిచ్ఛిన్న ప్రవాహము ఎల్లఋ అందరికి సులభమైనా ఎక్కడనో కొన్ని కొన్ని స్థలములందే పుణ్యతీర్థ మవుతుందో, ఆలాగే ఈరసముకూడా ఎంత విస్తృతముగా ఉన్నా, అక్కడక్కడ మాత్రమే ఉన్నతకవులకు ఆశ్రయ మవుతుంది. సూక్ష్మగ్రాహులైన సహృదయులకే ఆ రసము చక్కగా సాధ్యమై, వారి కవనములోనే ఒప్పారుతూ, వారి కావ్యములు శాశ్వతము లౌనట్లు సాధన మవుతుంది. ఇట్టి కారణముచేతనే సుకావ్యములు చాలా తక్కువగా ఉంటవని వేరే చెప్పనక్కరలేదు. ఏది "శృంగార కావ్యములు" మెండుగా బయలు

వెడలుటకు కారణ మయిందో అదే అల్పసంఖ్యాకములు తప్ప తక్కిన వన్నీ ఉత్కృష్టకావ్యములు కాకపోవుటకు కూడా కారణ మయింది.

శృంగారభావము సాక్షాత్తుగా సంభోగేచ్ఛావాసనపై ఆధారపడి యున్నది. ఈ వాసన మనోనిర్మాణములో చాలా శక్తిమంతమైనది. దానికి అందుచేతనే అనేకవ్యాపారాలలో ప్రసక్తి ఉంటూ ఉంటుంది. అది సాక్షాత్తుగా కాకుండా ప్రకారాంతరముగా వక్రగతిని అవలంబించినీ ప్రభవిస్తూ ఉంటుంది. ఒకానొక తత్వజ్ఞుని అభిప్రాయము ప్రకారము దీని సంబంధము లేని ముఖ్యవ్యాపారమే లేదు. అనగా ఆశక్తియొక్క వినియోగము ఏమాత్రమైనా లేకుండా ఉండే మనోవ్యాపారాలు చాలా తక్కువని సమన్వయము చేయగలము. ఈ ఇచ్ఛ, ఈ శక్తి సంభోగేతర వ్యాపారాలలో ఖర్చు అవుతూ ఉంటుంది. స్త్రీపురుషుల అన్యోన్య విలాసాలను, సంతానసంరక్షణను కూడా ఈ వాసనయొక్క సాక్షాత్ కృత్యముల క్రిందనే పరిగణించినా, ఇంకా ఎన్నో ప్రకారాంతరకృత్య ములలో ఆశక్తి వినియోగ మవుతుంది. వాటిలోకెల్ల ఎక్కువ సాక్షా త్తుగా ఉండేది శృంగారకావ్యముల రచనపరనాలు. ఈ కావ్యాలద్వారా, ఆ భావసంతుష్టి పొందుట బుద్ధిపూర్వకముగా జరుగుతుందని పరిశోధ కులు చెప్పరు. కాని, ఈ సూత్రాన్ని అనుసరించి చాలామంది మనోవృత్తు లను నూటికి సమన్వయించుట సాధ్య మని నిరూపిస్తారు.

ఈ సంతుష్టి సున్నితముగాను, పచ్చిగాను ఉండవచ్చును. అది ఆ భావోద్రేకము ఇంద్రియగతమా, లేక హృదయగతమా అనే విభజనను పట్టి ఉంటుంది. కేవల ఇంద్రియసుఖాన్ని సంపాదించేది ఉన్నంత పచ్చిగా మనోగత మైనది ఉండదుగదా ! దీనిని బట్టే సభ్యాసభ్యశృంగారవర్ణన లను నిర్ణయించ వీలుంటుంది. సాధారణముగా మహాకావ్యాలని చెప్పుతూ ఉండే మన ఉద్గ్రంథాలలో సహితమూ ఇందిరియసంబంధ శృంగార వర్ణనలు కనబడకమానవు. కుమారసంభవాది కావ్యాలలోను, వసు చరిత్రాది ప్రబంధాలలోనుకూడా ఇట్టి వర్ణనలు లేవని అనము ; కాని,

మొత్తముమీద వాటిలో వర్ణితమైన శృంగారరసమునకున్నూ, బిల్హణీయము మొదలైనవాటిలో వర్ణితమైన దానికిన్నీ కావలసినంత భేదము ఉన్నది. అది సంఖ్యలోనేకాకుండా జాతిరూపాలలోకూడా అని సద్విమర్శకు లందరు ఒప్పుకొనక తీరదు. ఆ అంశము స్పష్టపరిచే ఉద్దేశముతో ఒక విధమైన వర్ణనలను సూచిస్తాను. అవి కేవల శారీరక సంభోగ విషయికవర్ణనలు. శృంగార మన్న దివ్యరసానికి పశుసమమైన ఈ కామప్రవృత్తిగా అధఃపతనము కలిగింది. ఇది నింద్యమనిన్నీ, అవినీతి అనిన్నీ నేను వాదించలేదు. రెండింటికీగల ముఖ్యభేదమును చూపిస్తూ, ఒకటి ఎట్లు మనుజునిలో ఉత్కృష్టమైన ఆత్మకు ఆనందకరమో, ఒకటి ఎట్లు అనిత్యమైన శరీరమునకు సుఖకరమో నిరూపిస్తున్నాను. ఇట్టి నియమముల ననుసరించే గదా శిల్పములో ఎక్కువ తక్కువలను నిర్ధారణ చేయగలము.

ఈ తక్కువస్థానమునే ఆక్రమించగలిగిన శృంగార ప్రబంధములు కొన్ని ఆంధ్రసారస్వతములో బయలుదేరినవి. సంస్కృత సారస్వతములో ఇందుకు పోలికలు లేకపోలేదు. వాటి కన్నిటికీ కామశాస్త్ర సంప్రదాయ దోషము తగిలిందని చెప్పవలసి యుంటుంది. కామశాస్త్ర మని ఒకటి మన దేశములో చాలాకాలము క్రిందటనే వర్ధిల్లినది. అందులో శాస్త్రదృష్ట్యా కామకళలు, కామవిధానములు మొదలైన సంగతు లనేకములు వర్ణనీయములు. వాటి చర్చ పూర్తిగా బుద్ధితర్కగతము. ఆ వర్ణనలు చర్చలు; అంతేకాని భావముల ఉద్రేకము ఫలముగా గల కావ్యరచనలు కావు. శాస్త్రమునకూ, కావ్యమునకూ గల శాశ్వతభేదమును మనస్సున ఉంచుకొంటే కామశాస్త్ర మందున్న సంభోగవర్ణనలకు తలఊపే విమర్శకులు ఆ వర్ణనలతో నిండిపోయే కావ్యములకు కూడా ఆదరము చూపినట్లు కాదని స్పష్టమవుతుంది. తెలుగులోకూడా ఈ కామశాస్త్ర గ్రంథాలు బయలునెడలిన తరువాతనే ఈ శృంగారప్రబంధాలకు ఆధారము దొరికింది. శాస్త్ర మనే పేరుతో చేసిన చర్చలను పద్యరూపముగా నాయికానాయకుల నోళ్లలో ఉంచి

నంతమాత్రాన అనౌచిత్యము నాటిల్లునని ఎవరనగలరు అనే పొరపాటు కొంతవరకు ఈ కావ్యముల రచనకు ప్రోద్బలకము అయి యుంటుందని నా ఊహ. ఎఱ్ఱన అనే మధ్యకవి, సుమారు 1560 సం॥ నాటివాడు, కొక్కోకమును తెనిగించి, కేవలము ఇంద్రియసుఖప్రియులైనవారికి చవి చూపాడు ఒకవిధముగా. ఆ తరువాతనే బయలుదేరినవి ఈ ప్రబంధా లన్నీ. భావ వికారములకు తావు ఇవ్వని కొక్కోకాంశములను భావోద్రేకము లవునట్లు కావ్యసరణిని వేంకటకవి మొదలుగా గల శృంగార కవులు లోకములో విరజల్ల ప్రారంభించారు. కాని ఈ వెద యెప్పుడూ కూడా గొప్పపంట పండినట్లు రుజువులేదు. ఏ కొద్ది కాముకబృందముల లోనో తీవ్రప్రచారము కలిగియుండి, ఏ కొద్దియోచన దివసములలోనో విరాజిల్లి చెదపుట్టలవలె తగ్గిపోతున్నట్లు సారస్వత చరిత్రకారులు ఊహిస్తున్నారు.

ఈ ఊహకు మరొక బలమైన నిదర్శనము కలదు. ఇట్టి ప్రబంధాల "కృతిపతు" లందరూ—పతు లనండి, భర్త లనండి, ఏమన్నా సరే. సహృదయముగా లే దని నా మనవి — మధుర తంజాపురీ నాయకులే. అవును, వారిలో చాలామంది ఆంధ్ర సారస్వత వృద్ధింకరులే; అయినా, వారి పురుషార్థములు మాత్రము ఆద్యంతేతరములు. ఐహికసంపదలతో విర్రవీగుతూ ఉండి, శరీరమే సర్వ మని దృఢముగా నమ్మియుండి, మధుసమమైన మదముతో ప్రమత్తులైయుండిన ఈ బుద్బుదప్రాయ ప్రభువుల కామసంతుష్టికి ప్రవర్తించిన కావ్యాలు ఇవి. వా రిచ్చిన "పడుపు కూటి" కొరకు ఈ మధ్యమకవులు వ్రాసిన కావ్యాలు ఇవి. అట్టివారు వాస్తవముగా మధ్యములే గదా!

మొన్న మొన్నటివరకు ఇట్టి కావ్యాలు సొగసైన అచ్చుకూర్పులో బయలువెడలలేదు. ఏ బజారు ప్రతో అశృంగారముగా, హేయముగా, తప్పులతడకగా దొరికేది. బహుశః విమర్శకులు విధించిన కఠినదండమునకు పాత్రములై, ఇట్టి ప్రచురణలు బహిష్కారములో పడిపోయి యుండిపోయినవి కాబోలు. కాని యిప్పుడు అన్ని గ్రంథాలతోపాటు వీటికి

కూడా ఉద్ధరణ ప్రాప్తించింది. చక్కని అచ్చులో, ముద్దులు ఒలికే బొమ్మలతో ఈ గ్రంథాలుకూడా ఇప్పుడు దొరుకు తున్నవి.

౨

రాధామాధవసంవాదము అనే పేరువల్ల రాధామాధవులు వ్యక్తుల వలె సూచింపబడ్డా, ఈ గ్రంథములో చెప్పిన కథనుబట్టి చూసినా, ఈదేశములో అనాదిగా వస్తూఉన్న సంప్రదాయాన్నిపట్టి చూసినా, వారు ఒకవిధమైన శాశ్వతభావానికి ప్రతిబింబములుగా నిలిచియున్నారని సూచిత మవుతూ ఉంటుంది. శృంగారానికి, దాని ఫలమైన ప్రీతిలోలత్వానికి, దాని తుదిసోపానమైన ఐక్యానికి వీరిద్దరినీ సంజ్ఞామాత్రులుగా ఈ దేశస్థులు పరిగణిస్తున్నారు. ఆధ్యాత్మిక విచారణపరిణామములో భక్తికిన్నీ, ఆభక్తియొక్క సవిశేషకల్పన మైన ప్రీతికిన్నీ అగ్రస్థానము ఉత్తరదేశమందు విజృంభించిన వైష్ణవసంప్రదాయమతములో ప్రాప్తించింది. ఆ శాఖలలో ఒకటి రాధాకృష్ణశాఖ. ఆప్రీతికి రాధాకృష్ణులు అనే నామరూపములు కల్పించి, ఆ మతప్రవర్తకులు వర్ణించారు. ఈ పురాణపురుషుల అసాధారణ ప్రీత్యైక్యమును సిద్ధాంతమందు ప్రతిపాదితమైన జీవబ్రహ్మల యైక్యమునకు బ్రతిబింబముగా భావించి, సాధకుల సాధనకు సాధనముగా వర్ణించారు. ప్రీతిసంబంధములలో కెల్ల అసమానమైనదీ, అత్యుత్కృష్ట మైనదీ తల్లిపిల్లలదా, లేక భార్యాభర్తలదా అని నిర్ణయించవలసినప్పుడు రెండోదానికి ఆధిక్యము చాలామంది విచక్షణులు స్థిరపరిచారు. ఒండొరులను ప్రయత్నపూర్వకముగా ప్రీతిరూపమున అన్యోన్యము ఆకర్షించుకొంటూ, ప్రీతిసాధనమున ఐక్యము పొందగలరు. ఇట్టి సంబంధము మరొకటిలేదు. అదిన్నీ కేవల సాంప్రదాయిక దంపతులలో కనబడే దానికంటె కాముకులలో ఎక్కువ స్ఫుటముగా వ్యక్తమవుతుంది. అన్యోన్యాకర్షణతో కూడుకొన్న ఆ వలపును ప్రదర్శించుటకు కాముకుల చేష్టలు కావలసియున్నా, అది కేవల శారీరిక భోగముక్రింద దిగిపోకుండా ఉండేటట్లు పురాణపురుషులై, అమానుష శక్తిమంతు లని ప్రసిద్ధి కెక్కియున్న ఆ రాధామాధవులను ఆ అసాధారణ ప్రీతివిగ్ర

హులుగా నిర్మించి, సవిశేషభక్తిసాధనకు బింబములుగా ఆ రాధాకృష్ణ మతస్థాపకులు ప్రవర్తింపజేసినట్లు మనము నూటిగా ఊహింపవచ్చును. రాధే కృష్ణుని వలచి, మోహమును మప్పి, తుదకు ప్రసాదింపబడినదని గదా గాథ. ఆలాగే జీవుడే బ్రహ్మను వలచి, బ్రహ్మను తన భక్తిమోహము చేత వశపరచుకొంటే తుదకు బ్రహ్మప్రీతిని పొందగలడని సూచన. కేవల బ్రహ్మప్రసాదమువల్లనే కలిగే ఫలము కంటె జీవుడు తన ప్రీతిచేత ఆకర్షించిన బ్రహ్మప్రసాదము శాశ్వతతర మని అభిప్రాయము. ఈ ఉన్నతాశయములను వ్యక్తపరచుటకు కల్పించిన భాగవత తత్త్వములలో కెల్ల ఈ రాధాలీల అగమ్యమై, సంతృప్త్యవధి లేనిదై విరాజిల్లుతుంది. రాధ స్వతంత్రురాలై, ఎవరి ప్రేరణా లేకుండా, చక్కని లోకజ్ఞానముగల ప్రౌఢగానుండి, ప్రీతి అనగాయెట్టిదో చవిచూపి, చవిచూసిన్నీ, ప్రయత్న పూర్వకముగా ఆ ప్రీతిసాగరుని పొంద నిశ్చయించుకొన్నది. కాబట్టే ఆ నావికుడు తన ఆ ప్రీతినావపై ఆమెను అనన్యలభ్య మైన స్థానమునకు తీసుకొని పోయేడు.

ఇట్టి గాథను ఆధ్యాత్మికాపేక్షతో ఎంత వర్ణించినా వర్ణించే వారికిగాని, వినేవారికి గాని విసుగురాదు. కాని, క్రమముగా అసులభ మైన ఆధ్యాత్మికతత్త్వచ్ఛాయ తగ్గి తగ్గి, వారి సంబంధములో మిళితమై యున్న కాముకుల శృంగారచ్ఛాయ ఎక్కువవుతూ, దేశములో విరుద్ధ ప్రయోగమునకు సాధనముగా మారింది. శృంగారచేష్టల వర్ణనలను విన గోరువారికిన్నీ, అట్టి వర్ణనలను చేయగోరువారికిన్నీ ఈ రాధామాధవగాథ సుకరమైన ఆశ్రయ మైనది. ఎంత బూతుపెట్టినా, ఎట్టి అశ్లీలమువర్ణించినా, ఎంత అసభ్యము ఆపాదించినా, భగవన్నామస్మరణ అనిన్నీ, అందుకు పురాణప్రామాణ్య మున్నదనిన్నీ, దేవాంశసంభూతులైనవారి చర్యలు వినీత్యవినీత్యతీతము లనిన్నీ, మనుష్యులకు ఉదాహరణము లెన్నటికీ కాలేవనిన్నీ తమ్ముతాము సమాధానపర్చుకొంటూ, కవులూ, కాముకస్వభావపరులూ వారి శృంగారభావోద్రేకశాంతికి ఈ రాధామాధవులను సంజ్ఞలుగా ఉపయోగించ ప్రారంభించారు.

3

అట్టి కావ్యాలలోనిది ఈ రాధామాధవ సంవాదము. దీనిని మహాకావ్య మనిన్నీ, తద్గ్రంథకర్త వెలిదండ్ల వేంకటపతి మహాకవి అనిన్నీ చెప్పేవారు ఉండవచ్చు. ఈ కవికాలము విషయమై భేదాభిప్రాయాలు ఉన్నవి. వీరేశలింగం పంతులువారు నిర్ణయించిన కాలము కంటె నూరు సంవత్సరాలు పూర్వునిగా మరికొందరు విమర్శకులు నిరూపించారు. ఈ కావ్యకృతి "భర్త" (భర్తా!) తంజావూరు అమాత్యులలో ఒకడు. జనకమహారాజు శుకయోగిని "చనవున వేడె కృష్ణకథ" "పాపములు వాఱగ" కృష్ణుని మొక్కి యిట్లనెః:

'జనకరాజేంద్ర! వినవయ్య సావధాన
మతినిఁ గృష్ణుని చరితము ల్మహిని విందు
మవి రుచింపవు మాకు మా యనుభవంబు
చెలఁగు శృంగారరూపమోఁ జిత్తగింపు'.

ఈ అవతారికమిషతో కవి కృష్ణుని మోహము, రాధవిరహము వర్ణింప ప్రారంభించాడు. కాని ఈ జనకశుకుల శృంగారరుచికల్పనకు ఎట్టి సందర్భశుచి ఉన్నట్లు కానరాదు. జనకమహారాజునాటికి కృష్ణావతారము అసందర్భము కాకపోయినా, ఏ పురాణములోనో, ఏ మూలనో జనకునివద్దకు శుకయోగి వచ్చి, సకలావతారముల పుణ్యకథల చెప్పినట్లు ఉన్నా, శాశ్వతబ్రహ్మచారి అనిన్నీ, ఆబాల్యవైరాగి అనిన్నీ, ప్రసిద్ధి వడసియున్న శుకయోగికి మహిని అందరూ వినే కృష్ణకథలు రుచింపక, శృంగారకథలే ఆతని అనుభవానికి వచ్చినట్లు చెప్పుట చాలా అసంబద్ధముగా కనిపిస్తుంది. కొంపదీసి ఎక్కడైనా శుకయోగి శృంగార పురుషు డని ఉందో ఏమిటో, పండితవర్యులు సాధింతురుగాక. లేదా శృంగారముయొక్క ప్రాబల్యము రుజువుచేయడానికి శుకయోగిలాంటు వాటుకూడా నిదర్శనముగా కావలసి వచ్చిందా ఏమిటి? కాని, ఈ రాధామాధవకథలో క్రొత్త నా కేదీ కానరాలేదు.

కథ పాతదే. రాధ కృష్ణుని మేనత్త. బాలకృష్ణుని పెంచి, ఉగ్గుపెట్టి ఉయ్యేలలో ఆడించి ఆనందించేది. అంత చిన్నపిల్లకాయను చూచే మోహపరవశ యై, ఆనాడే బాలునికి తెలియని శృంగార చేష్టలు చేస్తూ ఆనందం పొందేది. ఆ తరువాత కథంతా సులభముగా ఊహ్యాము. రెండువిధాల ప్రబంధశృంగారము, ఆ రెండు రకాల చేష్టలు, కట్టుకథలలోని చిలుకదూతిక, అన్నీ పాతవే. వర్ణనలన్నీ సంప్రదాయ సిద్ధమైనవే. కవి పూర్వుల ఫక్కీని అనుసరించాడు. I - 48 లో తారాశశాంకాదులు ఉటంకింపబడ్డారుకూడా. పాత శృంగార ప్రబంధాలలోని పద్యాలు కొన్ని కవి తన కావ్యములో కూర్చినట్లు కనబడుతుంది. శిల్పములో ఏదీ కొత్త సంగతి కానరాదు. సవతు లందరూ సంధిజేసికొని, కృష్ణుని వంతులు వేసుకొన్నారు. ఇది మాత్రము కొత్తసంగతి కాబోలు.

రాధామాధవులను కేవల శరీరసుఖభోగు లైన కాముకులవలె కవి భావనచేసినట్లు కనిపిస్తుంది. వర్ణనలోనే కాకుండా వాచ్యముగా కూడా ఆ పదము ఉచ్చరింపబడియున్నది. తుదకు కృష్ణుడు దక్షిణ నాయకుడు అయినాడు. ( III -159.)

రాధతోడిదే......
లోకముగాఁగ నుండె నిఁక
లోకులు కాముకుఁ డంచు నెంచరే!

—[ III -125.]

ఈ భావనే కావ్యాన్ని మొత్తముమీద ఆవరించుకొనియున్న భావన యైనా, వారు ఆధ్యాత్మిక తత్త్వసూత్రాల బింబము లన్న మాటకు సూచన లేకపోలేదు. బాలకృష్ణుని పరుండబెట్టుతూ, "నా దేవుఁడవు" అని జోకొట్టేది. దేవుడు=భర్త అని నిర్వచనము చేస్తారేమో. "సర్వజ్ఞమూర్తి వీవు" అని ఉంది. ఇంకా చూడండి—

II - 6. "పదిరెం డేం డ్లగు ప్రాయమందు......
......రుక్మిణ్యాదులౌ కన్యలక్ష

పదియాఱ్వేల వివాహమై సగుణరూ
పబ్రహ్మ మై కన్న వి
న్నదిగా దీమహిమం బటంచు......"

తిరిగి III-24 లో

'...నిర్వికారుఁ డనినన్
నిర్మోహియో నిర్జితేం
ద్రియుడో నన్నను దాళియుండె....'

ఆఖరున శుకయోగికూడా కృష్ణుని శృంగారచర్యలద్వారా అతని మహాత్వమును జనకునికి నచ్చచెప్పాడట—
'కృష్ణదేవుఁడె మఱి దేవు లింకను గలరె ?

అని. కాని ఉత్కృష్టభావన చదువరుల హృదయమున బాగా నాటేటట్లు గ్రంథరచన ఉండేనందున, గ్రంథప్రయోజనము ఇది కాదనిన్నీ, ఇదే అయితే ఏమీ నెరవేరలేదనిన్నీ చెప్పక తీరదు. ఇదే కాని ప్రయోజనము కాకపోతే ఈ గ్రంథములో శాశ్వతముగా ఉండవలసిన సంగతి ఏదీ ఉండదు.

అందరిలోకీ రుక్మిణి ఎక్కువ ఉదారస్వభావురాలివలె కనిపిస్తుంది. III-143-147 అందుకొరకు చదువవలెను. కాని, అక్కడకూడా శరీరభోగమే నొక్కి చెప్పియుండకపోతే ఎక్కువ సమంజసముగా ఉండునేమో. ఏలాగైనా ఉన్న స్థలములకంటె ఇక్కడ కవియొక్క హృదయములోతు తెలియడానికి ఎక్కువ అవకాశము లున్నవి. ఇంకా ఎక్కువ చక్కగా చిత్రింప సాధ్యముకూడా.

ఈ ప్రబంధముయొక్క గొప్పంతా దాని శైలి. దానిచర్చకు తగిన ఉదాహరణములు ఇవ్వాలంటే ఒకచిక్కువస్తుంది. కొంచెము శృంగారము ఎక్కువగా గల పద్యాలే ఎంచవలసివస్తుంది. అదేమో కాని, కవితాధారయొక్క జోరు అంతా అట్టిచోట్లలోనే ఇమిడియుంది. వీరేశలింగం పంతులువారు చెప్పినట్లు శృంగారప్రబంధాలలో మాటల

మాధుర్యము ఎక్కువగా ఉండి, చదువరులను గుంపులుగా ఆకర్షిస్తుంది. ఈ వర్ణనలు పచ్చిగా ఉండడముకలదు. అవి నీతిభంగకరములు అగునా కావా అనేది నాకు అప్రస్తుతము. శిల్పము ఎట్లు ఉన్నది అనేదే నాకు ప్రస్తుతము. సాధారణముగా ప్రబంధాలలో ఉండేపదక్లిష్టత, వక్రగతార్థములు, శ్లేషగతరచనలు ఈ కావ్యములో లేకపోయినందుకూ అందరికీ ఎక్కువ అందుబడిలో ఉన్నందుకూ నీతిపరులు దీనిని బహిష్కరిస్తారా, శిల్పపరిశీలకులు మెచ్చుకొంటారా? మరొకవిశేషము. దీనిలో గ్రాంథికభాషావాదమునకు కుదరని ప్రయోగాలు చాలా చాలా ఉన్నవి. ఉదాహరణములుగా:

| | |
|---|---|
| చందాన | ద్రోహానకు |
| ముద్దయితే | నీవల్ల |
| వల్లను | అలిగేవేమయ్యా |
| అడిగేవని | అనుకోరాదని |
| చర్చసేయగబోతే | మళ్లీ |
| జూడగలిగుందును | లోకాన |
| వచ్చేనన్నాడా | భోజనానికి |
| పోయేదుగాని | పోకు రావోయి |
| రాచకొమాళ్లు | ప్రార్థించినకొద్ది |
| నగర్లోనికి | దినాల |
| మంచితనానకు | ఇందుకోసమె |
| అడిగేవారో | కూడా |
| మరచేవు | దిద్దుకోరారంటే |

ఇవిచాలవా? వీటిని పరీక్షిస్తే గ్రాంథికభాషావాదుల రెండుయుక్తులకు ఆధారములేనట్లు తోస్తుంది. నిజమైన తెలుగు సంప్రదాయము ప్రకారము ఈ వ్యావహారికరూపాలు ప్రబంధాలలోకూడా ప్రయోగార్హములు. ఏ కవి చక్కనిభాషను హాయిగా ఉండేటట్లు వాడ నిశ్చయించుకొంటాడో, అతడు ఈ వ్యావహారికపదాలు వాడితీరుతాడు. రెండోది

మాండలీకాల గురించి చేసే తగాయిదాలకుకూడా ఆధారములేదు. ఈ వెలిదండ్ల వెంకటపతి దక్షిణదేశపుకవి. తంజాపురీనాయకుని కొరకు వ్రాసిన కావ్యము ఇది. కాని, కావ్యములో మాండలీకాల చిక్కు ఏదీ కానరాదు. చక్కగా అర్థమవుతూ ఉంటుంది గదా. పాత బజారుప్రతిలో ఉన్నవాటిని ఆధునికసంస్కర్తలు తమ వాదానికి అనుగుణముగా దిద్దప్రయత్నిస్తూ, దిద్ద లేనివాటిని ఉంచివేసి, దిద్ద వీలున్న వాటిని మార్చివేస్తూ ఉండడము చాలా శోచనీయము. అలాగు చేయుంటకు ఎవరికీ అధికారములేదు. చదువరులు, విమర్శకులు, సంపాదకులు అట్టి విపరీతసంస్కరణమును ఆమోదించకూడ దని నా అభిప్రాయము. కవి వ్యాకరణబాధ అంతగా పెట్టుకోక, లోకములో ఉండే ప్రయోగాలను ఉపయోగించేసంప్రదాయాన్ని అవలంబించాడు. "నిత్యపెండ్లి కొడుకు", "సిరామరక్ష" "ఇహము న్నహి పరము న్నహి య్యైతే" —ఇట్టి లోకసిద్ధోక్తులను ధైర్యముగా ప్రయోగించినకవి ధన్యుడుగదా!

ఈ భాషావిశేషముకొరకు, రాధామాధవుల ఆధ్యాత్మిక వినియోగముకొరకు, సారస్వతమందు ఇట్టి శృంగారమునకు గల స్థానముకొరకు ఈ విమర్శనము వ్రాయదలచి వ్రాశాను.

# ఠాకూరిగారి పడవమునుక



శ్రీ రవీంద్రనాథ ఠాకూరిగారి నామపరిచయములేని ఆంధ్రయువకుడు ఉండడము అసంభవము. రాజకీయదృష్టిని ఈ యుగాన్ని శ్రీ గాంధీయుగమని ఎట్లు పిలువదగియున్నదో అట్లే సారస్వతదృష్టిని దీనిని శ్రీ ఠాకూరుగారి యుగమనికూడా పిలువవచ్చును. సూర్యచంద్రులవలె వీరిద్దరూ ఈ యుగాన్ని ఉత్తేజించియున్నారు. సారస్వతకాంక్షకలిగిన ప్రతి హిందువు శ్రీ ఠాకూరిగారి కవనములచేత ఉద్రేకితుడై ఆయన గ్రంథపఠనముచేత కొందరు ఆ గ్రంథాలను స్వభాషలోనికి తర్జుమాచేసి, కొందరు ఆ గ్రంథరీతుల ననుసరించి, కవనాలను కల్పించి కొందరు ఇట్లు భిన్నవిధముల ఆ ఉద్రేకమును వినియోగించుకొనుచున్నారు. వీరిలో శ్రీ కొరుమూరి వైకుంఠరావుగారు ఒకరు.

శ్రీ ఠాకూరుగారు వారి స్వభాషలో వారి కవనసృష్టిని చేశారు. ఆ భాషరానివారు అందరూ వాటి భాషాంతరీకరణముల ద్వారానే వాటి పరిచయము చేసుకొనేవారు. శ్రీ ఠాకూరిగారి కవనాలను తర్జుమాచేసిన వారు చాలామంది ఈ భాషాంతరీకరణములపై, అందులో ముఖ్యముగా ఆంగ్లానువాదాలపై ఆధారపడినవారే. ఒకవేళ బంగాళీ గ్రంధాలనే ఉపయోగించినచో వారి బంగాళీభాషాజ్ఞానము నిఘంటువుల అపేక్షితమై ఉంటేది. శ్రీ ఠాకూరిగారిభాష జీవభాష. అనగా ఆంధ్రభాషా వివాదాలలో వ్యావహారికభాష అని చెప్పినట్లు శ్రీ ఠాకూరుగారు ఉపయోగించినభాష అట్టి జీవభాష. ఈ భాషను ఆయన పద్యాలలోనే ప్రయోగించి యున్నప్పుడు నవలలో మరీ ఎక్కువగాను, ఎక్కువ స్వతంత్రతతోను ఉపయోగించి ఉంటారని చెప్పనక్కరలేదుగదా. బంగాళీకుటుంబాలతోను, బంగాళీయువకులతోను సంవ్యవహారము

గలవారికి అలవడినట్లు ఈ వాడుకభాష నిఘంటువులపై ఆధారపడిన వారికి సుసాధ్యముకాదని చెప్పవచ్చును.

శ్రీ వైకుంఠరావుగారి తర్జుమాయొక్క అధిక్యతాకారణము ఇదే. బంగాళీవాడుకభాషలో ఆయన ఉత్తరప్రత్యుత్తరములు సలుపగలిగినంత పరిచయము ఇతడు సంపాదించగా, శ్రీ ఠాకూరిగారి సాధారణ భాషాంతరీకరణాలలో శ్రీ ఠాకూరిగారి భాషావిశేషాలు సూక్ష్మముగా విశదపడలేదని తెలుసుకొని, విశ్వభారతి అధికారవర్గమునుండి, బంగాళీభాషనుండి సాక్షాత్తుగా తర్జుమాచేయడానికి అనుజ్ఞను సంపాదించినాడు. ఇదివరకు తెనుగులోనికి పడవమునుక తర్జుమా అయియున్నదని ఎరిగిన్నీ, తిరిగి తాను తర్జుమా చేయ సాహసించడానికి ఆ ఉత్సాహామే కారణము. నా ప్రస్తుత వ్యాసము ఆ భాషాంతరీకరణ తారతమ్యాల చర్చతో సంబంధించినది కానందున ఆ తర్జుమాల భేదాలను విమర్శించను. కాని, శ్రీ ఠాకూరిగారి అసలు భావాలు, భావనావిశేషాలు ఈ తర్జుమాలో బాగాను మూలానికి సన్నిహితముగాను వ్యక్తమైన వని నిశ్చయముగా చెప్పగలము.

కాని, ఒకసంగతి చెప్పకతీరదు. ఈ భాషాంతరీకరణభాషలోనికి అరసున్నలు మొదలైన కొన్నివ్యాకరణయుక్తమనే గ్రాంథికశైలి చిహ్నములు చేరినవి. శ్రీ వైకుంఠరావుగారి మతములోగాని, శ్రీ ఠాకూరుగారి స్వభాషానుకరణములోగాని ఈ లాంఛనాలకీ, ఈ రూపాలకీ ప్రవేశము లేదు. అందుచేత నేకాబోలు శైలి నడపవలసినంత సాఫుగా అక్కడక్కడ నడవలేదు. కాని, ఇది చాలా అల్పలోపము. నవలయొక్క ఘనతకు లోపము ఏమీ వాటిల్లలేదు. కథారచన సొంపు, భావస్ఫుటీకరణము, సంభాషణ చాతుర్యము, భావనాగరిమ ఈ మొదలైన గుణాలుగదా నవలయొక్క గొప్పకు కారణాలు. ఇవి మూలానికి సరిగ్గా ఉన్నవి.

ఈ నవల శ్రీ ఠాకూరుగారి నవల లన్నిటిలోనూ ఎక్కువ సరళమైనదని చెప్పవచ్చును. ఈ నవలకంటె ఆ మిగిలిన నవలలు ఇంటా బయటా, గోరా ముఖ్యముగా ఎక్కువ ఉద్గ్రంథాలనే అభిప్రాయము ఉండ

వచ్చును. వీటిలో ఏదో ఒక సమస్య మత రాజకీయ సమస్యలచర్చ కథా వస్తుభాగములో దూరి, తత్వవిచారణ రూపాన్ని దాల్చింది. మానవస్వభావము, మానవహృదయము, మానవప్రవర్తన, మానవశీలము నవలవిషయముగా ఉండడము ఈ నవలలో జరిగినట్లు ఉన్నవాటిలో జరగలేదని అభిప్రాయము.

పడవమునుక అన్నపేరే కథయొక్క చమత్కారాన్ని సూచిస్తున్నది. కథను క్లుప్తముగా చెప్పాలన్నా విస్తారము గాకతప్పదు. కాబట్టి కొన్ని ముఖ్యసంగతులను సూచించి, చదువరులను గ్రంథపఠనానికి పురికొల్పెదను. కథానాయకుడైన రమేశ్ బి. ఎల్. పరీక్షలో ఉత్తీర్ణుడై, కలకత్తాలో ప్లీడరుపనిచేస్తూ ఉన్నాడు. తనతండ్రి తన స్నేహప్రేమబాంధవ్యాలను వేటినీ అడగనైనా అడగకుండా నిశ్చయించిన పిల్లను, తన తండ్రియందుగల అమితభక్తి గౌరవ విధేయతలవలన తాను సరిగ్గా చూడైనా ఎరగని ఒక పల్లెటూరుపిల్లను పుస్తెకట్టి, గంగానదిమీద ఒక పడవలో తన గ్రామానికి పెళ్లికూతురిని తీసికొనివస్తూ ఉండగా, రాత్రి పెద్దతుపాను ఒకటిరేగి, ఆ పడవను విరగగొట్టింది. తెల్లవారేసరికి తుపాను తగ్గింది. రమేశ్ ఒక్కడే బ్రతికియున్నాడు. తనవారు ఎవరూ కనబడలేదు. పరికించిచూడగా తాను పడియున్న ఇసుగదిబ్బపైనే ఒకకొసను పడియున్న ఒక అమ్మాయి, నూతన వధువు, పెళ్లిదుస్తులతో కనబడింది. తాను పెండ్లి ఆడిన పిల్లే ఆమె అని ఊహించి ఆమెను ఊరడించాడు. కాని, తాను పెండ్లియాడిన పిల్లపేరు ఈ పిల్లదికాదని తెలియగానే తన వలెనే బయలుదేరిన మరియొక పెండ్లివారి వధువు ఈమె కావచ్చునని స్పష్టము చేసుకొన్నాడు. కాని ఆసంగతే ఆమెకు చెప్పివేయడానికి కాఠిన్యము ఎరగని అతని హృదయము జంకింది. ఆమెబంధువులు ఎవరో, ఆమె గ్రామము ఏదో, ఈ మొదలైన వివరాలను ఆమెను సాక్షాత్తుగా అడిగినయెడల ఆమె నిజాన్ని పోల్చుకొని, తనసాహాయ్యాన్ని నిరాకరించే, ఆ అనాథస్థితిలో ఏమిచేయడానికి అతనికి తోచలేదు. ఆమె మాత్రము తాను అతనిభార్య అని నిశ్చయించుకొన్నది. ఈ విధముగా మరియొక

పడవపైని కలకత్తా చేరుకొన్నారు. కొన్నిరోజులు గడచినవి. తనను భార్యగా అతడు ఎందుకు పూర్తిగా ఆదరించలేదని ఆమె ఆశ్చర్యపడినా ఎప్పుడూ కూడా తన హక్కుకొరకైనా ప్రశ్నఏదీ ఆమె అడగ సాహసించలేదు. ఆమెభర్తచనిపోక, తనవలెనే ఒకవేళ బ్రతికియుండెనేమో అని అతడు ఊహించెను. ఒకవేళ ప్రయత్నముచేసి అతనిగురించి ప్రయత్నపూర్వకముగా కనుక్కొగలిగినా అతడు వారిరువురి బ్రహ్మచర్య వాసాన్నినమ్మక, ఆమెను పరిగ్రహించక పోవునేమో అనితర్కిస్తూ పూర్ణమానాన్ని దాల్చినాడు. క్రమముగా తెలుసుకొనవలెనని నిశ్చయించుకొనెను.

తన వివాహపూర్వము కలకత్తాలో ఉన్నప్పుడు తాను నివసించియున్న బసకు పొరుగు అన్నదాబాబుగారిలోగిలి. అతని కొమార్తె నలినితో అతనికి కలిగిన పరిచయఫలముగా వారికి అన్యోన్య ప్రేమ కుదిరినది. నలిని చదువుకొన్నయువతి, బ్రాహ్మసమాజానికి చెందినది. అందువలన ఆమెకు అలవడిన స్వాతంత్ర్యము, లౌకికజ్ఞానము వారి ప్రేమకథకు సహకారి అయిపోయినవి. ఈ ప్రేమప్రవాహానికి అంతరాయముగా సంభవించిన పల్లెటూరి వివాహము ఈ పడవమునుకలో సంఘటిల్లిన ప్రమాదమువల్ల త్రోసివేయబడినదిగదా అని అతడు తిరిగీ నలినీపరిచయము ప్రారంభించాడు.

నలినీప్రేమ, కమలసంరక్షణ ఈరెండింటి మధ్య చిక్కుపడిన రమేశ్ ఎట్లు ప్రవర్తించెనో, ఆ చిక్కు తుదకు ఎట్లు పరిణమించిందో, కమల తనకు వివాహమైన భర్తను ఎట్లు కలుసుకొన్నదో ఈ వృత్తాంతాలు ఈ నవలకథావస్తువ. రమేశుడు చేసిన ప్రయత్నాలు, నలిని హృదయము నుండి రమేశుని తొలగింప ప్రయత్నించిన అక్షయుని ప్రయోగాలు, కమల తనస్థితిని తెలుసుకొన కల్పించుకొన్నబాధలు, రమేశుని చర్యవలన నలినికి కలిగిన నిరాశాఘాతములు, కమలను పెండ్లాడిన నలినాక్షుడు కనబడుట, ఈమొదలైన వివరాలతో కథ సాగుతుంది. ఇవన్నీ పడవభంగమువలన సంక్రమించిన చిక్కులుకాబట్టి ఈ కథకు నామధేయము ఆలాగు కవిశేఖరుడు చేశాడు.

సాధారణపాఠకులకు కథ చమత్కారముగాను, ఆహ్లాదకరముగాను, మనోహరముగాను నడుస్తుంది. అందుకేమీ సందేహము లేదు. కథ చదవడానికి ప్రారంభించినవారు పుస్తకము పూర్తి అయినదాకా విడువరు. పాఠకుల హృదయాన్ని పట్టుకొని ముందు ఎట్లు జరుగుతుందో అనే ఔత్సుక్యముతో కథనము తోస్తుంది. కాని కథనంతా కథకుడు తనభావనలో కల్పించివ్రాసిన నవలగా కథాభాగాలు అత్తియుండలేదు. మాసపత్రిక కొరకు భాగభాగాలుగా వ్రాసినట్లు కనిపిస్తుంది: మాసపత్రిక ప్రచురణ కాలానికి అందించిన భాగాలువలె కథ నడుస్తుంది. నాలుగు పెట్టెలతో బయలుదేరిన రైలుబండి మధ్య మధ్య స్టేషనులో ప్రయాణీకులు ఎక్కువ కాగా కొత్తపెట్టెలను చేర్చుకొని తుదకు పది పెట్టెల బండిగా పెరుగుతుందో ఆ విధాన్న ఈ నవల పెరిగిందని చెప్పగలము. ప్రారంభాన చూచిన గంగానది సముద్రసమాగమనము లోపున ఎట్లు ఉపనదులు చేరడమువల్ల వెడల్పులోను, పొడుగులోను పెరిగిందోగదా. లోతులోనో? ఈ కథనాగుణము శ్రీ ఠాకూరిగారి అన్ని నవలలోను వ్యక్తమవుతున్నది కాబోలు. వారి చిన్న చిన్నకథలను మెచ్చుకొన్నట్లున్నూ, నవలలోని కొన్నికొన్నిఘట్టాలను కొనియాడినట్లున్నూ నవలయొక్క రచనాపద్ధతి నంతనూ శ్లాఘించలేము.

ఇంతకూ నవల ఘనత కథవల్ల రాలేదు. కథలో విశదమైయే గుణాలు అనగా హృదయగాంభీర్యము, మనోభావాలు, శీలవ్యక్తీకరణము, భావనాసౌష్టవము, ఆత్మోన్నత్యము ఇవి అనన్యములైనవి. శ్రీ రవీంద్రనాథుడు మహాకవి. మానవహృదయాలలో ఉత్తేజిల్లే భావాలను అతడు చాలా సూక్ష్మముగా గ్రహించగలిగి, ఆ గ్రహించిన తత్వాలను పాత్రవ్యక్తులలో ప్రతిఫలింపచేయగలిగే అనన్యమైన శిల్ప చాతుర్యముగలవాడు. మానవహృదయముయొక్క లోతులను, పాత్రల సంభాషాదులలో అతడు విశదపరుస్తున్నప్పుడు విచక్షణులైన పాఠకులకు వారివారి హృదయాలలో అవి భావతరంగాలుగా ఉప్పొంగును. ఈ కౌశల్యము లతనిసొమ్ము. ఈ విశేషము ఏ రాజకీయమతసాంఘికాది

సమస్యలకు సంబంధించినదిగా ఉండక, కేవల మానవజీవితముగా ఈ నవలలో ఉండడమువల్ల ఈ నవలను పాఠకులు ఎక్కువగా ఆనందింపగల రని నొక్కి చెప్పగలము.

ఒక సాధారణ కుటుంబములో పుట్టి, సాధారణవిద్యను సంపాదించిన యువకుడు రమేశ్. కాని అతడు చేసిన మహాత్యాగము తనకూ, తనతోనూ సన్నిహితసంపర్కముగల ఏ ఇద్దరికో సంబంధించేదే అయినా త్యాగముయొక్క ఘనతకు ఎట్టిలోటూ రాలేదు. నళినిని ప్రేమించి, ఆ ప్రేమకు లోబడినా తండ్రికోరికను అధిక్షేపించకుండా మొగమెరుగనిపిల్లకు పుస్తె కట్టడములో తన స్వార్థసుఖానికి ఎట్టి హాని వాటిల్లినదో విచారించవలసిన విషయమే. ఇందుకు రమేశుని తిరస్కరించే విమర్శకులు ఉండవచ్చు. అతనితండ్రిచేసిన ఏర్పాటులో ఒక చిన్న త్యాగసంబంధమైన విశేషమున్నది; అతనితండ్రి బాల్యస్నేహితుడు ఒకడు అకస్మాత్తుగా పిల్లలను దీనులుగా విడిచి, అకాలమృత్యువువాత బడినాడు. ఆ కుటుంబానికి కొంతదుఃఖశాంతి ఒనర్చుటకు ఆ స్నేహితునిపిల్లను కోడలుగా చేసుకొన్నాడు. రమేశ్ తండ్రి. ఈ త్యాగాన్ని రమేశ్ ఆమోదించి, తానుకూడా త్యాగమును చేశాడు. కాని, ఇంతకంటె కష్టతరమైనది నళినీకమలల బాంధవ్యప్రేమలమధ్య అతడు ఇరుక్కొన్న పదవి. ఆ ఘట్టములో అతడుచూపిన మనోనిరోధానికి తుల్యమైన ఉదాహరణాలు చాలా కొంచెము. అంతకంటె సూక్ష్మమైనది అతడు ఓడప్రయాణములోను, గాజీపూరు నివాసములో కనబరచినప్రవర్తన. పరిస్థితులకు లొంగి, వాటి కార్యకలాపములలో దొరికిన ఒక జీలుగుబెండువలె అతడు సామాన్యదృష్టికి ఎంతకనబడినా అతని మనోవృత్తులను, అతని ప్రయత్నాలను, అతని భావసంఘర్షణలను చక్కగా విమర్శించే పాఠకులకు అతని శీలసౌష్ఠవము, అతడు చేసిన త్యాగమహిమ విశదముకాగలవు. "ఇతరుల కష్టసుఖాలనుగురించి ఆలోచించక, తన హక్కులను నిలబెట్టుకొనేస్వభావముకాదు అతనిది. తనకు ఆశాభంగము కలిగినప్పుడుకంటె ఇతరులకు నిరాశకలిగించడము

అతన్ని బాధించేది. ఇందుకోరకు రమేశ్ ఘనమైన ప్రయత్నము చేశాడు. గొప్పచిక్కులలో పడ్డాడు. నిందలపాలైనాడు. తుదకు ఘోరమైన అశాంతిపొందాడు.'' ఈ మాటలలో అతని శీలాన్ని, అతని ప్రవర్తనాన్ని స్పష్టపరచగలము. కమలయొక్క పవిత్రతను అందరికీ, ముఖ్యముగా నలినాక్షునికి, నచ్చచెప్పాలని ఎంత వ్యాకులపడ్డాడో, అంత తేలికగా చక్రవర్తిసలహాను అవలంబించి తనను తాను మాఫు చేసికొన్నాడు. అదీ త్యాగము! ఇదంతా రమేశుని నిజమైన నాయకునిగా చేసినది. అతడు ధీరోదాత్తుడు.

ఇతనితో సరిపోల్చడానికి తగినవారు కాకపోయినా, శీలము కలవారు నలినీకమలలు ఇద్దరూ వీరు ఈ నవలకు నాయికలు. వీరు ఇరువురి తారతమ్యాన్ని కథకుడు తన స్వంతమాటలలో వర్ణించక పోయినా వారిప్రవర్తనలోను, వారిమనోవృత్తులద్వారాను స్పష్టపరచినాడు. నలిని ఇద్దరినిప్రేమించినది; మొదట రమేశుని, తరువాత నలినాక్షుని. ఆమె ప్రేమయొక్క నిర్మలత మొదటిభాగములో చక్కగా విశద మవుతుంది. అక్షయుడు ఎట్టి నిదర్శనాలను తెచ్చిపెట్టినా, రమేశుని ఆమె ఎన్నడూ సంశయించలేదు. కమలతో తనకుగలసంబంధాన్ని విశదపరచక, కలకత్తా విడిచి రమేశ్ వెళ్ళిపోయి ఆమెను పూర్తిగా మరచినాడా అన్నట్లు ఉత్తరాలనుకూడా వ్రాయక, ఊరుకొన్నప్పుడు గదా ఆమె నలినాక్షుని పరిచయాన్ని తన హృదయసీమలోనికి చొరనిచ్చింది! నలినాక్షుని వరించ నిశ్చయించుకొన్న తరువాత రమేశ్ వచ్చి కనబడినా అతనిపై ఆమె మరి ఆశ చూపలేదు. పరిస్థితులకు లోబడినట్లు ఆమె కనబడుతుంది నిజమేకాని చల్లని కోమల హృదయము కలది ఆమె. తండ్రిచూపిన వాత్సల్యానికి అర్హురాలు; అన్ని విధాలా తన అన్నకంటె భిన్నమైన స్వభావముకలది ఆమె. అన్న జోరుచేసి, ఆమెచేత అక్షయుని వరింపింప చేయాలన్నప్పుడు ఆమె చూపిన ఆత్మగౌరవము ఆమెశీలానికి వన్నెతెచ్చింది; జోరుకి జోరు ప్రయోగించలేదు ఆమె. సుకుమారి. తన ప్రేమావిష్కరణములో ఆ

మెత్తని పరిమళాన్ని వెదజల్లిన భీరువు. "నలినికి ఏమాత్రమూ ఇష్టము లేదు; నేను పట్టుపట్టాను" అని క్షేమంకరిచెప్పిన మాటలవలన ఆమె శీలముయొక్క లోతు స్పష్టపడుతుంది. ఏ పరిస్థితులలో ఆమె నలినాక్షు నితో వివాహానికి అంగీకారము ఇచ్చిందో?

ఇట్టి నలినికి ప్రతిపక్షురాలు కమల. కష్టాలలో బాగా సాన పెట్టబడినది. చేరదీసి ఊరడించే ఆప్తులు ఎవరూ ఆమెకు లేరు. భర్త అని భావించిన రమేశునిలో భర్తకు ఉచిత మనదగు ప్రత్యుత్తరము రానప్పుడు ఆమె తొందరచూపక, ఉద్రేకించక, సంశయించక, సర్దు కొని ఓర్మితో సహించి వేచియుండిన అబల ఆమె. ఆమెయందు చక్ర వర్తిచూపిన పితృవాత్సల్యానికి, శైలజ కనబరచిన సోదరీభావానికి తగినస్వభావము కలది ఆమె. నలినాక్షుడు తన నిజమైనభర్త అని తెలి సిన తరువాతకూడా ఆమె చూపిన సహనము, శాంతము, సమర్పణము చాలా శ్లాఘనీయములు. తన నలినాక్షుని వివాహమాడ నిశ్చయించు కొన్న నలినికి చెప్పిన సాంత్వనవాక్యాల వలన ఆమె ఎట్టి సరళ హృదయముతో తనస్థానాన్ని ఆ ఇంట్లో నిశ్చయించుకొన్నదో మనము తెలుసుకోగలము. "ఇంటిభార మంతా నామీద వదలిపెట్టేయి అక్కా! మన మిద్దరమూ అప్పాచెల్లెళ్ళమూ కలిసి సంసారము నడిపించుదాము. ఆయన సుఖముగా ఉండేటట్టు నీవు చూస్తూ ఉండు. నేను మీ ఇద్ద రికీ సేవచేస్తూంటాను." ఆహా! ఏమి ఔదార్యము! క్షేమంకరి కమ లను ఎట్లు గౌరవించిందో, ఎట్లు ఆమెను ముస్తాబుచేసి, పొంగిపోయేదో, ఎట్లు ఆమె ఆదరణవల్ల సుఖిస్తానని ఆశించేదో చదివేటప్పుడు చదు వరుల మన్ననంతా క్షేమంకరిమీదకంటె ఆ హరిదాసిపై (అనగా కమ లకు ఆపేరు అప్పుడు) ఎక్కువ ఘనముగా ప్రసరిస్తుంది. కమలదగ్గర నౌకరీపని చేసిన ఉమేశ్ యొక్క ఐదురూపాయీల త్యాగముకూడా కమల హృదయమాధుర్యాన్నే పాడుతుంది. కమలను ఎరిగినవా రందరూ (నవీన కాళీకూడా) ఆమెను శ్లాఘించినవారేగదా.

మిగిలినపాత్రలు అన్నీ వీరిని పోషించినవారే అయినా వ్యక్తులుగా నవలను ఆహ్లాదకరముగా చేసినవారే. నవ్వేతాల పండితుడైన చక్రవర్తి, ఆయన కూతురు శైలజ, అన్నదాబాబు, ఆయన కొమారుడు యోగేష్ మానవహృదయభావాలను చక్కగా వ్యక్తపరచినారు.

నవలలో చిత్రింపబడిన ప్రకృతివిశేషాలు హృదయరంజకముగా వర్ణింపబడినవి. శ్రీ ఠాకూరుగారు చిన్నప్పటినుండి ప్రకృతిలోని భిన్న రూపాలను మానవహృదయంగములుగా అనుభవించియుండెను. నీరు, నక్షత్రాలు, ఆకాశము, నదులు, ఆకులు, పువ్వులు, చెట్లు చేమలు, సూర్యకిరణాలు, చంద్రకాంతి, స్త్రీ ముఖసౌందర్యము, పురుషుని వీర శీలము ఇవన్నీ అతని వర్ణనాంశములు.

మానవమనోతత్వదర్శకుడైన శ్రీ ఠాకూరుగారు ఈ నవలలో అన్నిరకములైన పాత్రలద్వారా మానవత్వాన్ని జ్వలింపజేసేభావాలను చక్కగాను, సూక్ష్మముగాను పాఠకుల అనుభవానికి స్ఫురించేటట్లు కథను కల్పించారు. ఇద్దరునాయికలను సృజించి, వారి భిన్నశీలముల ద్వారా స్త్రీహృదయాన్ని స్త్రీప్రేమ పాతివ్రత్యాన్ని వ్యక్తీకరించాడు. ఒకరికొకరు పూర్ణత కల్పిస్తూ వినియోగపడి, స్త్రీచిత్రాన్ని ప్రతిఫలింపజేశారు. ఈ ఇద్దరి ప్రేమలకు ఆశ్రయములైన యువకులు ఒక్కరే. ప్రారంభాన రమేశ్, తుదకు నలినాక్షుడున్నూ. ఈ నలు గురిప్రవర్తన సమ్మేళనము ఒక పరిపూర్ణచిత్రము. వీరిద్వారా వ్యక్త మయే మానవజీవితాన్ని స్ఫుటపరచడానికా అన్నట్లు చిన్న చిన్న కుంచెలదెబ్బలద్వారా చిత్రపటానికి పూర్ణత తెచ్చే శిల్పివలె మిగిలిన పాత్రలను ఒకవైపున, అన్నదాబాబు చక్రవర్తి అక్షయుడు యోగేష్ ఉమేశులను, మరియొకవైపు నుంచి, క్షేమంకరి, శైలజ, నవీనకాళీ మొదలైనవారిని గ్రంథకుడు సృజించి ఉపయోగించెను.

ఇట్టి పద్ధతి మహాశిల్పుల విధానము. ఇట్టి శిల్పనైపుణ్యాన్ని విశద పరచే ఈ నవల ఎన్నదగినది ఆయెను.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 4 | 25 | కలిగి | కలిగించి |
| ,, | ,, | , (కామా) | లేదు |
| 5 | 23 | , (కామా) | లేదు |
| 6 | 4 | స్తై | స్థై |
| ,, | 7 | అత్త వని | అత్తవని |
| ,, | 19 | భాగములుగ | భాగములు |
| 7 | 13 | విరమించినాడు | విరమించెను |
| ,, | 17 | కావలెనా | కావలెననా |
| ,, | 25 | కమలము | కమల |
| 10 | 16 | c | లేదు |
| ,, | 24 | గుమాస్తాకూలీలపై | గుమాస్తా కూలీలపై |
| 11 | 3 | ర్ | ష్ |
| ,, | 9 | ర్ణ | ర్ణము |
| ,, | 18 | యిక నీతి | యికనీతి |
| 12 | 14 | కమలము | కమల |
| ,, | 24 | తప్పిదారి | దారితప్పి |
| 13 | 2 | కమలము | కమల |
| ,, | 4 | శృంకా | శృంగా |
| 15 | 14 | Nuova Beatrice | Nuova—Beatrice |
| ,, | ,, | Astrophal | Astrophal |
| ,, | ,, | Stellna | Stella |
| 16 | 8 | తాల్చి | దాల్చి |
| ,, | 15 | స్త్రీ | స్త్రీని |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 17 | 20 | దేపి | దేవి |
| 18 | 8 | అవకాశ ముండగల దనిన్ని | అవకాశము ఉండగల దనిన్నీ |
| 24 | 3 | ఉచ్ఛ్వాసాలు | ఉచ్ఛ్వాసాలు. |
| 25 | 16 | సా | స్వా |
| 26 | 3 | దర్శములో | దర్శములు- |
| 28 | 5 | ఏకం | ఏవం |
| 28 | 5 | షి | పి |
| 28 | 11 | వాక్య | వ్యాఖ్యాన |
| 30 | 2 | న్ని | న్నీ |
| 31 | ఆఖరిది | లో. | లో |
| ,, | ,, | నాటిక | నాటిక. |
| 32 | ఆఖరిది | వలెచదవ | వలె చదవ |
| 35 | 18 | ష్టా | ష్ణా |
| 37 | 7 | . (చుక్క) | లేదు |
| 40 | ఆఖరిది | రా | కా |
| ,, | ,, | [ ] | లేవు |
| ,, | ,, | ఉచితము గాని | ఉచితము, |
| 41 | మొదటిది | . (చుక్క) | లేదు |
| 43 | 14 | ర్తు | ర్తూ ఉం |
| 47 | 5 | . చుక్క | లేదు |
| 49 | ఆఖరిది | వె | నె |
| 50 | 7 | రు | డు |
| ,, | 16 | మాత్రమే | మాత్రమే. |
| 65 | 2 | : | లేదు |
| 65 | ఆఖరిది | న్న | న్నా |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 73 | 16 | సమరసము | సామరస్యము |
| 77 | 15 | , | లేదు |
| 79 | 11 | న్య | న్యా |
| 83 | 11 | మె | నొ |
| 85 | 14 | ర | ర్య |
| 87 | 18 | చ్ఛ | చ్ఛ |
| 89 | 8 | మా | సూ |
| 91 | 22 | ర్చి | ర్శి |
| 92 | 17 | డ్డ | డిం |
| 94 | 8 | వా | గా |
| 100 | 10 | తీ | తా |
| ,, | 23 | ట్టు | పడు |
| 102 | 25 | గొనిన | గొనని |



